

# శ్రీ అనుభవానంద గ్రంథమాల

## ప్రచురణములు

1. శ్రీరామకృష్ణ లీలా సంకీర్తనము : (చతుర్థముద్రణము)
శ్రీరామకృష్ణ, శారద, వివేకానందులగూర్చి భక్తి ప్రబోధకముగా 132 కీర్తనలు. 1/16 డెమ్మీ.
200 పుటలు. రు. 0—62

2. శ్రీరామకృష్ణాంజలి : (తృతీయ ముద్రణము)
శ్రీరామకృష్ణ వివేకానందతత్త్వములగురించి భక్తి ఉత్సాహపూరిత పద్యములు 100. 0—12

3. శ్రీ దక్షిణేశ్వరీ స్తవము : (ద్వితీయ ముద్రణము)
భక్తితో తత్త్వవిషయముల ప్రబోధించు శతకము. 0—12

4. చిత్తప్రబోధ : (ద్వితీయ ముద్రణము)
సాధకుల కనేక అమూల్యరహస్యముల బోధించు శతకము. 0—12

5. సాధన రహస్యము : (ద్వితీయ ముద్రణము)
ఆధ్యాత్మిక అభివృద్ధికిమూలమైన యోగశాస్త్ర సాధన చతుష్టయముల చక్కని వ్యావహారికభాషలో తెలిపిన సుప్రసిద్ధ గ్రంథరాజము. 1/8 క్రౌను. 330 పుటలు. 2—25

6. అనుభవానందము : (ద్వితీయ ముద్రణము)
అద్వైతానందానుభూతిని వ్యక్తపరచు శతకము. 0—12

# మాండూక్యరసాయనము

## అనుభవభాష్యము

(108 ఉపనిషన్మంత్రములతో)



కర్త

'సాధనరహస్య' 'సర్వసిద్ధాంతసార' భాది

బహుగ్రంథకర్తలు

పరమహంస పరివ్రాజకాచార్య

## శ్రీ అనుభవానంద స్వాములవారు




ప్రకాశకులు

శ్రీ అనుభవానంద గ్రంథమాల

బాపట్ల (గుంటూరు జిల్లా)

అండ్

భీమునిపట్నము (విశాఖ జిల్లా)

(ఓం)

# అనుభవానంద గ్రంథమాల

**ఉద్దేశ్యము:-** ఈ గ్రంథమాలలో శ్రీ అనుభవానంద స్వాముల వారి చేతను యితరులచేతను రచితములైన భక్తిజ్ఞాన వైరాగ్య ప్రబోధక గ్రంథములు ప్రకటింపబడును.

**విధానము:-** సంవత్సరమునకు రెండువందల పుటలుగల గ్రంథములు వెలువడుచుండును.

**విరాళములు:-** 1) రు 500/- మించు విరాళ మొసంగువారు మహారాజ పోషకులు. ఒక ముఖ్య గ్రంథమున వీరి ఫొటో ప్రకటింప బడును. వీరి నామములు ప్రతి కుసుమమున ముద్రింపబడుచుండును. గ్రంథమాల ప్రచురణములన్నియు నుచితముగ వీరి కొసంగబడును.

2) రు 100/- మించు విరాళ మొసంగువారు రాజపోషకులు ప్రతిగ్రంథమున వీరి నామములు ముద్రింప బడుచుండును. మరియు గ్రంథమాల ప్రచురణము లన్నియు వీరుగూడ నుచితముగ బడయుదురు.

3) రు 50/- మించు విరాళ మొసంగువారు పోషకులు. వీరి నామములు అన్ని ప్రచురణముల ప్రకటింప బడును. ప్రచురణముల వీరు సగము ధరలకు బడయుదురు.

4) రు 25/- మించు విరాళమొసంగువారు మిత్రులు. ప్రచురణముల 3/4 ధరలకు బొందుదురు.

5) రు 10/- మించు విరాళమొసంగువారు సభ్యులు. ప్రచురణముల వీరు 1/8 తగ్గింపు ధరలకు బొందుదురు.

గ్రంథమాలయొక్క మహోద్యమమునకు ఎల్లరు ఉచితరీతి తోడ్పడుదురుగాక.

# విరాళకర్తలు

1. శ్రీ మెంటా ఈశ్వరయ్యగారు, మర్చంట్, నెల్లూరు రు. 300
2. ,, కలిగొట్ల సూర్యనారాయణ నాయుడుగారు,<br>మా॥ ఛైర్మన్, భీమునిపట్టణము 100
3. ,, నడురుపాటి వీరరాజుగారు, శిర్లపాలెము 100
4. ,, బొలిశెట్టి సీతారామయ్యగారు, అడ్వొకేట్, బాపట్ల 282
5. ,, నంబగిరి వేంకట రామదాసుపంతులుగారు, శిర్లపాలెము 100
6. ,, పులవర్తి సుబ్రహ్మణ్యంశెట్టిగారు అండ్ సన్,<br>ఆయిల్ మిల్లు, భీమునిపట్టణము 516
7. ,, భలభద్రుని చెన్నయ్యశెట్టిగారు, అండ్ సన్స్ ,, 516
8. ,, దుర్గా దానయ్యశెట్టిగారు అండ్ సన్ ,, 100
9. ,, కాళ్ళకూరి సూర్యనారాయణగారు, విశాఖపట్టణము 100
10. ,, బూపరాజు వెం॥ నరసింహారావుగారు, డాక్టరు, స్వర్ణ 100
11. ,, పసుపర్తి శేషాచలంశెట్టిగారు, నెల్లూరు 100
12. ,, ఏడిద సూర్యనారాయణమూర్తి గారు, భీమునిపట్టణము 100
13. ,, విద్వాన్ గజ్జె సత్యనారాయణగుప్తగారు, విజయవాడ 50
14. ,, ఎలిశెట్టి సుబ్బారాయుడు శెట్టిగారు, నెల్లూరు 58
15. ,, రాయపురెడ్డి అప్పారావునాయుడుగారు,<br>వైస్‌చైర్మన్, భీమునిపట్టణము 100
16. ,, కొత్త రమణాజీరావుగారు, బొబ్బిలి 100
17. ,, అడక్కి వెం॥కృష్ణ హనుమంతరావు గారు, శ్రీకాకుళము 100
18. ,, నిట్ట భీమశంకరంగారు, ఇన్‌కంటాక్సుఆఫీసరు, పాలకొల్లు 100
19. ,, బండి వీరరాఘవమ్మగారు, చింతలపూడి 100
20. ,, బండి రామారావుగారు, ,, 100
21. ,, గైనేడి వేంకట అప్పారావుగారు, డాక్టరు, హైదరాబాద్ 100
22. ,, ఉద్దగిరి శ్రీరామమూర్తిగారు, అనకాపల్లి 100
23. ,, బొమ్మదేవర హేమలతా దేవి బహదూర్ గారు, ఏలూరు 100

| | | | |
|---|---|---|---|
| 24. | శ్రీ నూనె శేషాచలం శెట్టిగారు, | నెల్లూరు | 116 |
| 25. | ,, వెలగపూడి సుందరరామదత్తుగారు | ,, | 50 |
| 26. | ,, నూనె జగ్గయ్యశెట్టిగారు, | ,, | 116 |
| 27. | ,, చిత్తూరు మునుస్వామి మొదలియార్‌గారు, | ,, | 116 |
| 28. | ,, యల్లపల్లి గోవిందుశెట్టిగారు, | ,, | 116 |
| 29. | ,, పోలిసెట్టి వేంకటరమణయ్యగారు, (రాజా) | విజయనగరము | 116 |
| 30. | ,, పూసల్ల జూ॥ అప్పలనరసయ్య అండ్ సన్స్, | ,, | 58 |
| 31. | ,, శారదా గ్రంథాలయము, | శిగ్లపాలెము | 116 |
| 32. | ,, పొట్టా వీరరాజుగారు, | భీమునిపట్టణము | 116 |
| 33. | ,, నదురుపాటి సత్యనారాయణగారు, | ,, | 58 |
| 34. | ,, కులుకూరి సన్న్యాసిశెట్టిగారు, | విశాఖపట్టణము | 100 |
| 35. | ,, నంగునూరు మహబూబురెడ్డిగారు, (దేశముఖులు) | వరంగల్ | 100 |
| 36. | ,, మేఘాద్రి మహాలక్ష్మమ్మగారు, | గజపతినగరము | 116 |
| 37. | ,, మంతెన వెంకటరామరాజుగారు, | బుద్దాం | 116 |
| 38. | ,, వేంకటేశ్వరస్వామివారిదేవస్థానము, | బందరు | 116 |
| 39. | ,, వల్లూరి వేంకటసూర్యనారాయణగారు,అడ్వొకేట్ | బందరు | 100 |
| 40. | ,, యద్దనపూడి రామచంద్రరావుగారు, | ,, | 100 |
| 41. | ,, తాడంకి వేంకటకృష్ణారావుగారు, అడ్వొకేట్ | ,, | 100 |
| 42. | ,, మోటుమర్రి దయానిధిగారు, | ,, | 100 |
| 43. | ,, తాడికొండ నాగేంద్రరావుగుప్తగారు, | ,, | 100 |
| 44. | ,, చిత్రపు అచ్యుతరామయ్యపంతులుగారు, | ,, | 100 |
| 45. | ,, దీవి సేతు మాధవాచార్యులుగారు, | ,, | 100 |
| 46. | ,, పసుపర్తి సుబ్బరాజుగారు, జి.డి.ఏ.,ఏఫ్.సి.ఎ., | ,, | 50 |
| 47. | ,, అద్దేపల్లి వేంకటరామయ్యగారు, | ,, | 100 |
| 48. | ,, పిన్నమనేని లింగయ్యచౌదరిగారు, అడ్వొకేట్ | ,, | 100 |
| 49. | ,, బెండపూడి పేరరాజుగారు, డాక్టరు | విశాఖపట్టణము | 100 |
| 50. | ,, పలుకూరి జగన్నాధరావుగారు, | నరిసీపట్టణము | 100 |
| 51. | ,, తుమ్మల వేంకటేశ్వరరావుగారు, | భీమడోలు | 50 |
| 52. | ,, కొత్తూరి రామయ్య అండ్ కర్పూరపు రామకృష్ణమూర్తి కంపెనీ, | గుంటూరు | 100 |

| | | | |
|---|---|---|---|
| 53. | శ్రీ పోలిశెట్టి సోమసుందరముగారు, | ,, | 100 |
| 54. | ,, చిన్ని రమణయ్యగారు, బి. ఇ., మెకానికల్ ఇంజనీయర్, | ఇంజనీరింగుకాలేజి, కాకినాడ | 100 |
| 55. | ,, బొమ్మపల్లి సీతారామస్వామిశాస్త్రిగారు, | కర్లపాలెము | 100 |
| 56. | ,, దేవులపల్లి కృష్ణమూర్తిగారు, బి. ఇ., ఎలక్ట్రికల్ ఇంజనీయర్ | ఆంధ్రాయూనివర్సిటీ, విశాఖపట్టణము | 100 |
| 57. | ,, కనకదండి భాస్కరరావుగారు, ఇన్‌కంటాక్సు ఇన్‌స్పెక్టరు | విజయవాడ | 100 |
| 58. | ,, పులిపాక ప్రకాశరావుగారు, | అమృతలూరు | 100 |
| 59. | ,, మాటూరు లింగమూర్తిగారు, | విజయనగరము | 100 |
| 60. | ,, పూసపాటి రామచంద్రరాజుగారు, ఎగ్జిక్యూటివ్ ఇంజనీయర్, పి. డబ్ల్యు. డి. | శ్రీకాకుళము | 100 |
| 61. | ,, మంచిరాజు చినవెంకటరత్నముగారు, | భీమడోలు | 100 |
| 62. | ,, దశిక రామారావుగారు, సూపర్వైజరు, బి. డి. | కొవ్వూరు | 100 |
| 63. | ,, కొండ ఈశ్వరరాజుగారు, | గుండుగొలను | 50 |
| 64. | ,, మావులేటి సోమరాజుగారు, | ,, | 100 |
| 65. | ,, దుగ్గంపూడి ధర్మరాజుగారు, | ,, | 100 |
| 66. | ,, ఉనికిలి వేంకటరాజుగారు, | ,, | 50 |
| 67. | ,, వంకాయల రామచంద్రరావుగారు, | ఏలూరు | 100 |
| 68. | ,, భీమవరము వర్తకసంఘ భవన గ్రంథాలయము, | భీమవరము | 100 |
| 69. | ,, ఇమ్మిడి సత్యనారాయణగారు, | పాలకొల్లు | 100 |
| 70. | ,, బొండాడ వేంకటరాజుగుప్తగారు, | ,, | 100 |
| 71. | ,, బర్రెడ్డి తమ్మేశ్వరరావుగారు, పోస్టుమాస్టరు | ,, | 100 |
| 72. | ,, రాజులపాటి వేంకటేశ్వర్లుగారు, | ,, | 100 |
| 73. | ,, అద్దేపల్లి సత్యనారాయణమూర్తిగారు, యం. యల్. ఎ., | | 100 |
| 74. | ,, కలగ వెంకటసూర్యసత్యశంభుప్రసాద్‌గారు, | ,, | 100 |
| 75. | ,, వీరమనేని గోపాలరావుగారు, | హైదరాబాద్ | 100 |
| 76. | ,, కరూర్వరపు వెంకటనారాయణగారు, | గుంటూరు | 100 |

# తొలిపలుకు

Religion is realisation అనుభూతియే మతము అను శ్రీరామకృష్ణుని వాక్యరీతి, బాహ్యాడంబరాచార ఉపాసనాదికము యథార్థమున మతముగాదని గ్రహించి, మార్గాన్వేషణమునకై బాహ్యాముల బరికింపక, The sense of the Infinite is the basis of religion. అనంతత్వస్ఫురణమే మతాధారమని రాధాకృష్ణ పండితుని వచనచందము ఆయనంత ఆత్మానుభూతికై యన్వేషించుట ముముక్షుకోటి ముఖ్య కర్తవ్యము. ఆ యన్వేషణము ఇంద్రియాపేక్షిక ప్రవృత్తులగాక 'ఏక ఏవాత్మా మంతవ్యో జాగ్రత్ స్వప్న సుషుప్తిషు । స్థానత్రయాద్వ్యతీతస్య పునర్జన్మ న విద్యతే॥' అని బ్రహ్మబిందూపనిషత్తు బోధించు రీతి, అవస్థాత్రయాధిష్ఠానముగ నాత్మ ఏకముగ నున్నదనియు, నది వానికతీతముగ నున్నదనియు గ్రహింప, నది స్వాత్మానుభూతియై సంకుచితత్వమునుండి సాధకు నుద్ధరించి, యనంతత్వమున నుంచి జన్మరాహిత్యమును బ్రసాదించును. అందుచే నట్టి ఆత్మానుభూతికి సూటిమార్గమును సర్వేతరములకంటె నీ మాండూక్య ప్రబోధిత విధానము స్పష్టపరచియున్నది.

తొలుత నీ యుపనిషత్ప్రాధాన్యమును విని, పఠించి, గ్రహించి, ఆనందించి, మిత్రులకు దాని సర్వోత్కృష్టమాహాత్మ్యమును 1944 వ సంవత్సర ప్రాంతముల భీమునిపట్టణమున శ్రీరామకృష్ణాశ్రమమున వివరించుచుంటిని. అప్పుడు గౌడపాద కారికలకు, శంకరభాష్యమునకు అన్వయము లగుచు, అందు స్థూలముగ నగోచరమైన యనేక అనుభవరహస్యములు స్ఫురించినే వివరించుటచే, వాని గ్రంథస్థము గావింప వారు కోరిరి. కాని తగు ప్రోద్బలము లోనుండి రాకుండుటచే నుద్గ్రంథ రచనమునకు నాడు గడంగక మిత్రతృప్తికొరకై 'అస్పర్శయోగసిద్ధి' అను గీతమాలికను 200 పాదములలో రచించి వారి కొసంగియుంటిని. తర్వాత దాని 'సాధనసుధ' గ్రంథమున ముద్రించితిమి.

కాని నాడు నాకు దోచిన భావములన్నియు నా 'అస్పర్శ యోగసిద్ధి' లో వ్యక్తము కాజాలక, నట్టే నాహృదయమున బంధితమై యుండెను. అంత 'సర్వసిద్ధాంతసారభ' గ్రంథము ఆవిర్భవించి, మహాదూ్రపముదాల్చి

షోడశభాగముల విస్తరించుచుండ, దాన జతుర్థమైన శ్రీ శంకరపూర్వాద్వైత భాగమున, జీవరప్రికరణమున, గౌడపాద ప్రస్తావనానంతర కారికా సమీక్షకు బిమ్మట, నా మాండూక్యముపై నా పూర్వభావములు వ్యక్తము కా యత్నించెను. అయినను, ఆ బృహద్గ్రంథమున నొక ప్రకరణముగ నిది రూపొంద యత్నించుటచే నతిక్లిష్టమై, స్వాత్మభావములు పూర్తిగ వ్యక్తము కాజాలవయ్యెను. అంతియగాక, నీ ప్రధానోపనిషత్తును గూర్చి అష్టోత్తర శతోపనిషత్తులు తమతమ వివరణముల, భావముల నన్వయించుకొన ముందరు గుటచే, నా భావజాలములు వెనుకంజ వేయవలసివచ్చెను. అయినను 108 ఉపనిషద్భావాలంకృతమై మాండూక్యము ఇందు త్రిపురసుందరియై రూపొందుటయు నొక యలంకారమే యగుచున్నది.

కావున, నీగ్రంథము నాపూర్వభావముల నింకను వ్యక్తముగావించుట లేదు కావున, నది యసంపూర్ణమే యగుచున్నది. అయినను సర్వసిద్ధాంత సారభ చతుర్థభాగమునకు తుది ప్రకరణసృష్టినే పఠించి, ఉపనిషద్వ్యాహినిలో నద్వైతామృతము ఎట్లు ప్రవహించి శంకరు చేరెనో గ్రహింప నది యుపయుక్తము. మరియు నిది అద్వైతభాగమున కొక యలంకారము.

ఈ గ్రంథము ముముక్షుకోటి నెట్లు ఆకర్షించునో జూచి, కాలక్రమమున నీగ్రంథము, అనుభవవిషయ పరిపూర్ణపుగురితి అద్వైతసాధనానుభవములు, అవస్థా చతుష్టయ సాధనారహస్య వివరణములతో, నా పూర్వభావములతో సంపూర్ణ స్వరూపమును బొందగలదని ఆశయము. అట్టి యవకాశమునకు నిరీక్షించెదముగాక.

అనుభవం.

బాపట్ల
8-9-1959

# అష్టోత్తరశత ఉపనిషత్తులు

## ఋగ్వేదీయములు

1. ఐతరేయ
2. కౌషీతకీ
3. నాదబిందు
4. ఆత్మబోధ
5. నిర్వాణ
6. ముద్గల
7. అక్షమాలికా
8. త్రిపుర
9. సౌభాగ్య
10. బహ్వృచ

## శుక్ల యజుర్వేదీయములు

1. ఈశావాస్య
2. బృహదారణ్యక
3. జాబాల
4. హంస
5. పరమహంస
6. సుబాల
7. మంత్రిక
8. నిరాలంబ
9. త్రిశిఖిబ్రాహ్మణ
10. మండలబ్రాహ్మణ
11. అద్వయతారక
12. పైంగల
13. భిక్షు
14. తురీయాతీత
15. అధ్యాత్మ
16. తారసార
17. యాజ్ఞవల్క్య
18. శాట్యాయని
19. ముక్తిక

## కృష్ణ యజుర్వేదీయములు

1. కఠవల్లి
2. తైత్తిరీయక
3. బ్రహ్మ
4. కైవల్య
5. శ్వేతాశ్వతర
6. గర్భ
7. నారాయణ
8. అమృతబిందు
9. అమృతనాద
10. కాలాగ్నిరుద్ర
11. క్షురిక
12. సర్వసార
13. శుకరహస్య
14. తేజోబిందు
15. ధ్యానబిందు
16. బ్రహ్మవిద్య
17. యోగతత్త్వ
18. దక్షిణామూర్తి
19. స్కంద
20. శారీరక
21. యోగశిఖ
22. ఏకాక్షర

23. అక్షి
24. అవధూత
25. కఠరుద్ర
26. హృదయ
27. యోగకుండలిని
28. పంచబ్రహ్మ
29. ప్రాణాగ్నిహోత్ర
30. వరాహ
31. కలిసంతరణ
32. సరస్వతీరహస్య

## సామవేదీయములు

1. కేన
2. ఛాందోగ్య
3. ఆరుణి
4. మైత్రాయణి
5. మైత్రేయి
6. వజ్రసూచిక
7. యోగచూడామణి
8. వాసుదేవ
9. మహత్
10. సన్న్యాస
11. అవ్యక్త
12. కుండిక
13. సావిత్రి
14. రుద్రాక్షజాబాల
15. దర్శన
16. జాబాలిని

## అథర్వవేదీయములు

1. ప్రశ్న
2. ముండక
3. మాండూక్య
4. అథర్వశిర
5. అథర్వశిఖ
6. బృహజ్జాబాల
7. నృసింహతాపిని
8. నారదపరివ్రాజక
9. సీత
10. శరభ
11. మహానారాయణ
12. రామరహస్య
13. రామతాపిని
14. శాండిల్య
15. పరమహంసపరివ్రాజక
16. అన్నపూర్ణ
17. సూర్య
18. ఆత్మ
19. పాశుపతబ్రహ్మ
20. పరబ్రహ్మ
21. త్రిపురతాపిని
22. దేవి
23. భావన
24. భస్మజాబాల
25. గణపతి
26. మహావాక్య
27. గోపాలతాపిని
28. కృష్ణ
29. హయగ్రీవ
30. దత్తాత్రేయ
31. గరుడ

# విషయసూచిక

తొలిపలుకు

మాండూక్యరసాయనము

| | | |
|---|---|---|
| ప్రాధాన్యము | ... | 1 |
| ఒకటవ మంత్రము | ... | 9 |
| రెండవ మంత్రము | ... | 18 |
| మూడవ మంత్రము | ... | 37 |
| నాలుగవ మంత్రము | ... | 44 |
| అయిదవ మంత్రము | ... | 56 |
| ఆరవ మంత్రము | ... | 74 |
| ఏడవ మంత్రము | ... | 97 |
| ఎనిమిదవ మంత్రము | ... | 115 |
| తొమ్మిదవ మంత్రము | ... | 124 |
| పదియవ మంత్రము | ... | 131 |
| పదునొకండవ మంత్రము | ... | 134 |
| పండ్రెండవ మంత్రము | ... | 140 |
| మలిపలుకు— | ... | 152 |

ఓం

శ్రీ శారదా రామకృష్ణాయనమః

# మాండూక్య రసాయనము

## ప్రాధాన్యము

'మాండూక్య మేక మేవాలం
ముముక్షూణాం విముక్తయే'

ముక్తిక. 1-26

ముముక్షువులు ముక్తినొంద మాండూక్యోపనిషత్తు ఒక్కటియే చాలునని అష్టోత్తరశతోపనిషత్తులలో ప్రధానమైన ముక్తికోపనిషత్తుచేతను, 'వేదాంతార్థ సారసంగ్రహభూతం' (మాం. భా. 1-1) వేదాంతార్థసారసంగ్రహమని భాష్యకారులైన శ్రీశంకరభగవత్పాదాచార్యులచేతను, ప్రస్తుతింపబడిన మాండూక్య భావగ్రహణము అతి క్లిష్టతరమై పూర్వము సౌరభగ్రంథమున వచింపబడినట్లు దుర్జ్ఞేయమై యొప్పారుట, తద్గ్రహణకార్య నిర్వహణమునకై 'ఓం భద్రం

కర్ణేభిః శ్రుణుయామ దేవా, భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః స్థిరైరంగై స్తుష్టువాంస స్తనూభి ర్వ్యశేమ దేవహితం యదాయుః ’ ‘ ఓం శాంతిః శాంతిః శాంతిః ’ ఓ దేవతలారా, కర్ణద్వయముద్వార మేము క్షేమంకరశబ్దముల నాకర్ణించెదము గాక. పవిత్రదృశ్యములనే నేత్రములద్వారమున గాంచెదముగాక. సుస్థిరాంగములతో నారోగ్యవంతులమై మా యాయుష్కాలమున బరమేశ్వరుని స్తుతించుచు దేవహితులమై సంతుష్టి నొందుదుముగాక. త్రివిధశాంతులు లభించునుగాక యను వైదిక శాంతిపాఠపఠనముతో ‘ ఆదౌ సగుణమాశ్రిత్య నిర్గుణం చ తతః పరం ’ ప్రథమమున సగుణము నారాధించి, పిమ్మట నిర్గుణము నవలంబింపవలయు ననెడి ఆర్యోక్తి ననుసరించి, ప్రథమతః మనోవాక్కాయముల సంసిద్ధము సేయ దేవానుగ్రహము నపేక్షించెదముగాక. వేదార్థసారసంగ్రహభూతమై, సాధారణ ప్రజ్ఞాదూరమైన యీ యుపనిషత్తు, ‘ అద్వైతం పరమార్థో హి ’ (మాం. కా. 3-18) ; అద్వైతమే పరమార్థమను మహత్తర ఉపనిషద్రహస్యమును బోధించుచు, దుర్దర్శమై యొప్పుటచే, కారుణ్యరసపూరిత హృదయుడై గౌడపాదాచార్యవర్యుడు కారికారూప వ్యాఖ్యానమును 215 శ్లోకముల విరచించియుండుట పూర్వము శ్రీశంకరపూర్వాద్వైతభాగమున గ్రహించియున్నారము. కాన నీమంత్రార్థవివరణమునకు నాకారికాసంచయము అతిప్రధానమై తదర్థగ్రహణమునకు అత్యంతోపయుక్తము అని వేరుగ వచింపనవసరము లేదు. ఈ యుపనిషద్రాజము చిన్నదయ్యును మహత్తర ప్రాధాన్యమును గడించియున్నదగుటచే నృసింహపూర్వతాపి

న్యుపనిషత్తు ప్రథమమంత్రమునుండి సప్తమమంత్రమువరకును; నృసింహోత్తరతాపిన్యుపనిషత్తు ప్రథమమునుండి సప్తమ మంత్రమువరకు నా యా మంత్రార్థాన్వయముల తోడను; రామోత్తరతాపిన్యుపనిషత్తు ప్రథమ మంత్రముతో ప్రారంభించి, సప్తమమువరకు యథాతథముగను; తారసారోపనిషత్తు ప్రథమమంత్రమును మాత్రము గ్రహించి, అన్వయించుకొని యుండ, పరమహంసపరివ్రాజక, నారదపరివ్రాజకాది యుపనిషత్తులు యీ ఉపనిషదర్థమును గ్రహించి, వివిధరీతుల జీవ బ్రహ్మపరముగ నన్వయించియుండుట గమనార్హము. కావున నీ యుత్తమభావపూరితమైన మాండూక్యోపనిషద్గ్రహణము నకు సర్వేతరోపనిషత్తులు అనేక సందర్భముల వ్యాఖ్యలుగను వివరణముగను నుపయుక్తమగుచుండుటచే వానిగూడ నన్వయించుకొని తాత్పర్యమును గ్రహింప యత్నించెదముగాక.

ఈ యుపనిషత్తు అతిక్లుప్తమై ఉపనిషత్తుల యన్నింటిలో నతిస్వల్పమైనదై యుండియు, బ్రహ్మతత్త్వవిచారణమునకు మందాధికారి కుపయుక్తమగు గాథలను, సంభాషణములను, ప్రశ్నోత్తరములను ఉపయోగింపక నతిప్రౌఢవిధానము నవలంబించి, సర్వేతరోపనిషత్తులు ప్రస్తుతించు నాదబ్రహ్మమైన ప్రణవరూప ఓంకారమును స్వీకరించి. ప్రథమతః దాని నుచ్చస్వరమున నుచ్చరించి, ఆ ఓంకారాక్షర వ్యాఖ్యానమున కుపక్రమించి, దాని త్రికాలవిశిష్టముగను, విలక్షణముగను ప్రతిపాదించి, అద్దాని సగుణ నిర్గుణబ్రహ్మములకు ఒకే ప్రథమ మంత్రమున నన్వయించెను. ఇంతవరకు నది యితర ఉపనిషత్తుల ననుసరించి యున్నుండినను, ద్వితీయ మంత్రముననే తన

విశిష్టమార్గమును ప్రోక్కినది. 'ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా' (రామపూర్వతాపిని. 1-7) ఉపాసకుల కుపయోగార్థము బ్రహ్మమునకు రూపకల్పన చేయబడును అను సూక్తి ననుసరించి, అద్వయ అనంతబ్రహ్మమును మందప్రజ్ఞులకొరకు సంకుచితపరచినట్లు తదనుగుణబోధనావిధానము ననుసరింప, నీ మాండూక్యము, ఛాందోగ్యమున వివిధవిధానముల వివరింపబడిన 'తత్త్వమసి' (ఛాం. 6-8-7) అను మహావాక్యము కేవలము శ్రవణవాక్యమై జిజ్ఞాసువులకు సంపూర్ణోపయుక్తము గాకుండుటంజేసి, మననవాక్యమైన 'అయమాత్మా బ్రహ్మ' అను మహావాక్యమును రామోత్తరతాపిని, నృసింహపూర్వోత్తరతాపినులు, శుకరహస్య, పైంగల, మొదలగు ఉపనిషత్తులు ప్రస్తావించియున్నను, సక్రమ మనన విధానమును జిజ్ఞాసువునకు అందజేయకుండుటచేత సాధకుల నిస్సహాయతకు జింతించి కరుణదలంచిదైయుండనోపు యీ యుపనిషన్మాత కసికరించి వివేకపూరిత మననోపయుక్తముగ నీ మంత్రరాజముల బ్రసాదించెను. అందుచే నితర ఉపనిషత్తులవలె బరోక్షముగను దుర్గ్రాహ్యముగను నున్న సర్వజటిలపరిభాషా విధానమును బరిత్యజించి, ప్రత్యక్షమును, సన్నిహితమును, స్వకీయమును, నిత్యానుభవసిద్ధమును అయిన జాగ్రత్స్వప్నాదిక అవస్థాత్రయమునే గ్రహించి, అ ఉ మ రూపముననున్న ఓంకార త్ర్యక్షరముల కన్వయించి, వానిమూలముగ దదధిష్ఠానము లగు విరాడాది బ్రహ్మస్థితుల కన్వయించి, ఓంకారమున జతుర్థమైన నవస్థమాత్రతో అవస్థాత్రయ విలక్షణమగు దురీయమును బరబ్రహ్మముతో నన్వయించి, క్రమన్యాయమున సాధకుని చిత్త

మును, 'యోగశ్చిత్తవృత్తి నిరోధః' అను యోగసూత్రము రీతి గాక, జాగ్రదవస్థాస్థితుడై స్థూలభుగ్రూపమున నున్న విశ్వునుండి సూక్ష్మభుక్కగు స్వప్నస్థిత తైజసునకును, అంత ఆనందభోక్త యగుచు నిద్రాస్థితినున్న ప్రాజ్ఞుని ద్వారమున, వీరెవరును గానట్లు దోచుచు అదృష్టాదిలక్షణశోభితుడై యుండు తురీయునివరకు శుద్ధపరచుచు ఉన్మనీభావస్థితికి గొంపోవుచున్నది. ఇందు ఉపాసనావిధానములుగల బాహ్యదైవమూర్తి లేకుండుటచే స్వీయవిషయవిమర్శారూపమైనను అతికష్టసాధ్యమై యీ మార్గము విరాజిల్లుచుండును. అవును, 'పరాంచి ఖాని వ్యతృణత్ స్వయంభూః తస్మాత్ పరాన్ పశ్యతి నాంతరాత్మన్' (కఠ. 4–1) స్వయంభువు యింద్రియముల బహిర్గతములుగ నొనరించెనుగాన జీవుడు బాహ్యము నవలోకించునుగాని అంతరాత్మను గాదను మంత్రార్థముచందము ఇంద్రియముల కన్యవస్తుదర్శన గ్రహణాపేక్షయే అభ్యాసముగాని స్వాత్మగ్రహణకార్యము కష్టముకదా. అందుచేతనే యీమాండూక్యమార్గము జీవ బ్రహ్మముల కంతరమున ఈశ్వరాదిక సగుణబ్రహ్మమును గల్పింపక, అస్పర్శ యోగ్యమైన సర్వాతీతబ్రహ్మముతోడ జీవునికి సాక్షాత్సంబంధమేర్పరుప యత్నించుచు, ఆ బ్రహ్మము జీవేతరము గాకుంటచే స్వాత్మవిమర్శావిధానమున అన్యథాజ్ఞాన అజ్ఞానరూపములైన జాగ్రదాది అవస్థాత్రయముల విచారించి, త్రోసివైచి తదధిష్ఠానమైన తురీయ బ్రహ్మచైతన్యమునకు జీవుని అనుసంధింపజేయును గాన అది అస్పర్శయోగమనియు, నా యోగరాజము 'దుర్దర్శమతిగంభీరం' (మాం. కా. 4–100) అగుచు; 'న నిరోధో న చోత్పత్తిర్న బద్ధో న చ సాధకః। న ముముక్షు

ర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా॥' (మాం. కా. 2-32) సృష్టి లయములు, బంధమోక్షములు, సాధక ముముక్షువులు లేవు. ఇదియే పరమార్థము అనియు' 'న కశ్చిజ్జాయతే జీవః సంభవోఽస్య న విద్యతే। ఏతత్తదుత్తమం సత్యం యత్ర కించిన్న జాయతే॥' (మాం. కా. 4-71) ఎట్టి జీవుడు నుద్భవింప లేదు. దానికి గారణమెద్దియును లేదు. ఏదియును జనింప లేదు అనునదియే ఉత్తమసత్యము అను పరమసిద్ధాంతమునకు శ్రుతి యుక్తి అనుభవయుక్తముగా సాధకుని గైకొనిపోవుటచే, 'అస్పర్శయోగో వై నామ దుర్దర్శః సర్వయోగిభిః' (మాం. కా. 3-39) సర్వేతరయోగులకు దుర్లభమై విరాజిల్లుచు, 'యోగినో బిభ్యతి' (3-39) యోగులకు భయకారణమై యొప్పారుట సహజమేయగుచున్నది. తైత్తిరీయ విధానమున అన్నమయాదిక పంచకోశముల గ్రహించి, విమర్శించి, ఆనందమయకోశాతీతుడైన బ్రహ్మమును గ్రహింప యత్నించుట కంటె నీమాండూక్యవిధానము మిగుల స్పష్టమై, ప్రత్యక్షమై అనుభవయోగ్యమై వెల్గొందుచున్నది. కోశములును అవస్థల వోలె జీవపరములై అంతర్గతములైయున్నను అవి సువ్యక్తములుగాక సామాన్యానుభవములు గావు కాని అవస్థాత్రయము ఎల్లజీవుల నిత్యానుభవములో నుండుచు, గ్రహణయోగ్యమై యొప్పారియుండుట విదితము

అంతియగాక నీ అవస్థాత్రయము, భారతీయ తత్త్వశాస్త్రమున నతిముఖ్యస్థానము నలంకరించియున్న సత్త్వ రజస్తమోగుణములతో స్వక్రమలీల నన్వయించుచు, 'సత్త్వాత్సంజాయతే జ్ఞానం' (గీత. 14-17) అను సూక్తి ననుసరించి

స్థూలమై, బాహ్యమైయొప్పు జాగ్రద్రూప తమస్సునుండి, సూక్ష్మమై అంతరమై రాజిల్లు స్వప్నరూప రజస్సు ద్వారమున అతిసూక్ష్మాతిసూక్ష్మమై తురీయమునకు అతిసన్నిహితమునగల ఆనందమై ప్రజ్ఞానఘనమై యుండు సుషుప్తిరూపసత్వమునకు ముముక్షువును గొంపోయి; అంత అవస్థాత్రయ విదూరమై, అనగా గుణత్రయరహితమై సర్వాతీతమై విరాజిలు ఆత్మపదము నకు యీాయుపనిషత్తు సాధకుని జేర్చుచున్నది. అనగా జీవుని నావరించియున్న త్రిగుణరూప అవస్థల దొలగించి అతని యథార్థ స్వరూపదర్శనము గావింపజేయుచున్నది.

ఈవిధానము సామాన్య ఉపాసనా ధ్యానాదిక సాధన విధానములలోగల విక్షేప కషాయ లయ రసాస్వాదనాదులు జాగ్రత్స్వప్ననిద్రాతురీయరూపముననే యుండి, సాధకుని ఏకాంత ధ్యానమందిరముననో అరణ్యపర్వతగుహాంతరముననో యుంపక. విశాల విశ్వమధ్యమున, ప్రజాసందోహముల నడుమ నుంచి, అచ్చటనే అతనికి నేకాంతమును ఏకాగ్రతను ప్రసా దించి, పరాగ్రూపముల కాధారమైన ప్రత్యక్కుపై నంతర్దృ ష్టుల ప్రసరింపజేయు శక్తిసామర్థ్యముల నొసంగుచున్నది. కాన శాక్త సాధనావిధానమునగల పశు వీర దివ్యభావముల నెడు సాధనావిధానములలో ద్యాగరూప పశుభావమును ద్యజించి, యెకాయెకి వీరభావమునే స్వీకరించి, ప్రపంచ సంక్షోభముల మధ్య ఏకాంతమును, ఇంద్రియాకర్షణముల మధ్య ఏకాగ్రతను గలిగించి, అచిరకాలమున సాధకుని యోగయోగీశ్వరునిగా రూపొందించి, దివ్యభావమున నెట్టి విక్షేపాదులులేని నిశ్చల అసంగ అస్పర్శయోగసిద్ధునిగ బరిణమింపజేయుచున్నది.

అందుచే నీమాండూక్యోపనిషత్తు సర్వోపనిషత్తులలో నెంతటి ప్రముఖస్థానము నలంకరించియున్నదో గ్రాహ్యము. ఉత్తమాధికారులకు అది ఎంత అద్భుతముగా నుపయుక్తమగుచున్నదో సువ్యక్తము. ఈవిధానమున సాధన నెరింగి, యోగసిద్ధి గడించినవాడు దివ్యభావమున బ్రపంచమున నున్నను దుర్గ్రాహ్యమై యితరులకు అస్పర్శయోగియై అనగ అంది అందనివాడై నిశ్చలవృత్తి జరించుచు, 'అద్వైతం సమనుప్రాప్య జడవల్లోకమాచరేత్' (మాం.కా. 2-36) అద్వైతజ్ఞానమును బొంది లోకమున జడపదార్థమువలె అచంచలముగ యింద్రియార్థములకు లొంగక నుండును. అట్టివాడు 'స పూజ్యః సర్వభూతానాం వంద్యశ్చైవ మహామునిః' (మాం.కా. 1-22) ప్రపంచములో సర్వభూతముల కతడు పూజ్యుడు వంద్యుడు. అతడే మహాముని యగుచున్నాడు. కాన సర్వేతరమార్గముల కంటె మాండూక్యసాధనావిధానమే సర్వోత్తమమును సర్వార్థసాధకమును అయియున్నది. అద్దాని గ్రహణమును శ్రద్ధాన్వితులమై జేయ సంసిద్ధులమగుదుముగాక!

—•—

# ఒకటవ మంత్రము

హరిః ఓం । ఓమిత్యేతదక్షర మిదం సర్వం
తస్యోపవ్యాఖ్యానం । భూతం భవద్భవిష్య
దితి సర్వమోంకార ఏవ । యచ్చాన్యత్త్రి
కాలాతీతం తదప్యోంకార ఏవ ॥

హరిః ఓం. ఈసర్వము ఓంకారాక్షరమే. దాని విస్పష్ట వ్యాఖ్యానము ప్రారంభింపబడుచున్నది. భూత భవిష్య ద్వర్తమానరూపకాలము ఓంకారమే యగుచున్నది. మరియు త్రికాలాతీతముగూడ నా ఓంకారమే యైయున్నది.

'సకృదుచ్చరిత మాత్రః సఏష ఊర్ధ్వ మున్నామయతీ త్యోంకారః' (అధర్వశిఖ. 1) ఒక్కమారు ఉచ్చరింపబడగా సాధకుని శ్రేష్ఠగతిని అనగా బరమపదము జేర్పించునట్టిది కావున ఓంకార మనబడినది అనియు, 'యస్మా దుచ్చార్య మాణ ఏవ ప్రాణానూర్ధ్వ ముత్క్రామయతి తస్మాదుచ్యతే ఓంకారః' (అధర్వశిర. 4-1) ఉచ్చరింపబడుచున్నదై ప్రాణ ముల నూర్ధ్వముగ నుత్క్రమింప జేయుటచే నోంకార మనియు, 'సర్వం శరీర మూర్ధ్వమున్నమయతి' (అధర్వశిర. 5-1) సర్వ శరీరము ను ఊర్ధ్వముఖముగ లేవదీయునుగాన ఓంకారమనియు, నుపనిషత్తులచే నిర్వచింపబడిన ఓంకారము యమధర్మరాజు వచించినట్లు 'సర్వే వేదా యత్పద మామనంతి తపాంసి సర్వాణి చ యద్వదంతి । యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి తత్తే పదం సంగ్రహేణ బ్రవీమి । 'ఓమిత్యేతత్' (కఠ. 1-2-15) వేదములు ఏ అక్షరమును నుతించుచున్నవో, తపోకార్యములు దేని బ్రకటించుచున్నవో, దేనిని గోరి మహానులు బ్రహ్మ

చర్యము నవలంబించుచున్నారో దానిని గూర్చి ఎరింగించెదను. అదియే ఓంకారము అని సుప్రఖ్యాతమై; ‘ ఓమిత్యేవ యదుద్భ్యాతం జ్ఞానం జ్ఞేయాత్మకం శివం’ (శాండిల్య. 1-7-34) ఉద్భ్యాతమును, జ్ఞేయమును జ్ఞానమును మంగళకరమును అయినదే ఓంకారము అని వివిధముఖముల నీ ఓంకారము సంస్తుతింపబడుచున్నది.

కావున నా యోంకారము ‘ ఓమిత్యేతదక్షరమాదౌ ప్రయుక్తం ధ్యానం ధ్యాయితవ్యం ’ (అధర్వశిఖ. 1) సృష్ట్యాదియం దుపదేశింపబడినదై అదియే ధ్యానమైయుండుట ధ్యానింప బడవలయుననియు, ‘ ఓంకారం యో న జానాతి బ్రాహ్మణో న భవేత్తు సః ’ (ధ్యానబిందు. 14) ఓంకారమును గ్రహింపనట్టి వాడు లేనివా డగుచున్నాడు. కావున ‘ త్రిస్థానం చ త్రిమాత్రం చ త్రిబ్రహ్మ చ త్రయాక్షరం । త్రిమాత్ర మర్థమాత్రం వా యస్తం వేద స వేదవిత్ ॥’(ధ్యానబిందు. 36) ఓంకారాన్వయములైన సర్వవిషయముల గ్రహించిన వాడే వేదవిదుడుగా బరిగణింపబడుచున్నాడు. అందుచేత ఛాందోగ్యాదిక ఉపనిషత్తులు ఓంకారమును ఉద్గీథగ నుపాసింప ‘ ఓమిత్యే తదక్షర ముద్గీథ ముపాసీత ’ (ఛాందోగ్య. 1-1-1, 1-4-1) అని శాసించుచున్నవి.

ఎందుచేత ? ‘ ఓమిత్యే తదక్షరమిదం సర్వం ’ అని మాండూక్యము తెలుపుచున్నది. దానినే నృసింహపూర్వతాపినీ ( 4-2, 2-2 ) నృసింహోత్తరతాపినీ (1), రామ ఉత్తరతాపినీ (3-1), మొదలగు ఉపనిషత్తులు అనువదించి యున్నవి. ‘ సర్వ జగద్ధితం వా ఏత దక్షరం ’ (అధర్వశిర. 3)

'ఓమితీదం సర్వం' (తైత్తిరీయ. 1-8-1) 'ఓంకార ఏవేదం సర్వం' (ఛాందోగ్య. 2-23-3) 'స ఏవ సర్వం' (కైవల్య. 1-9) అను యితరోపనిషత్తులు ఓంకారవివరణము గావించినవి. 'సర్వకారణ కార్యాత్మా కార్యకారణ వర్జితః' (తేజోబిందు. 5-1) అనియు తేజోబిందు వచించినది. ఈ సర్వశబ్దముల నంత ర్గతముగనున్న జీవుడుగూడ నా ఓంకారమే యని, 'ఓంకార మంత్రమఖిలం విశ్వప్రాజ్ఞాది లక్షణం' ( 43 ) ఓంకారము అఖిలమగుటయే గాక విశ్వ తైజస ప్రాజ్ఞ తురీయరూపముస నున్న జీవుడును అదియేయని అక్ష్యుపనిషత్తు అన్వయించినది.

ఓంకారమే 'య ఓంకార స్స ప్రణవో యః ప్రణవ స్స సర్వవ్యాపీ' (అథర్వశిర. 4-2) ఏది ఓంకారమో అది ప్రణవము. అది సర్వవ్యాపియు నగుచున్నది. 'ప్రాణాన్ సర్వాన్ పరమాత్మని ప్రణామయతీతి ప్రణవః' (అథర్వశిఖ. 1) సకలప్రాణములను బరమాత్మయందు జేర్పించుటజేసి ప్రణవ మనబడును. 'యస్మా దుచ్చార్యమాణ ఏవ ఋుగ్ యజుః సామాథర్వాంగిరసం బ్రహ్మ బ్రాహ్మణేభ్యః ప్రణామయతి నామయతి చ తస్మా దుచ్యతే ప్రణవః' (4-2) ఏది ఉచ్చరింప బడిన మాత్రమున జతుర్వేదములను, ప్రణవోచ్చారణము పఠనము గావించు బ్రాహ్మణులకొరకు యజ్ఞకునందు బ్రహ్మ వర్చస్సును బొందింపజేయుచున్నదో అది ప్రణవముగ అథర్వ శిరకూడ వివరించియున్నది. దీనినే 'అథ ఖలు య ఉద్గీథః స ప్రణవః' (ఛాందోగ్య. 1-5-1) మంత్రము ననుసరించి ఉద్గీథయు నగునని నన్వయింపబడినది.

పైన వచింపబడియున్న ప్రణవరూప ఓంకారము ‘ఓమితి బ్రహ్మ’ (తైత్తిరీయ. 1-8), ‘ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతదేవాక్షరం పరం’ (కఠ. 1-2-16), ‘ఓమిత్యేకాక్షరం బ్రహ్మ యదుక్తం బ్రహ్మవాదిభిః’ (బ్రహ్మవిద్య. 8) బ్రహ్మవాదులచేత వక్కాణింపబడుచున్న యీయక్షరము బ్రహ్మము, ‘ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ధ్యేయం సర్వముముక్షుభిః’ (ధ్యానబిందు. 9) ఏకాక్షరమైన ఓంకారమే బ్రహ్మము, అది సర్వముముక్షువులకు ధ్యేయము; ‘ఓం ఇత్యేతదక్షరం పరం బ్రహ్మ తదేవోపాసితవ్యం’ (తారసార. 2-1) ఓంకారము పరంబ్రహ్మము అది ఉపాసితవ్యము; ‘ఓమిత్యేకాక్షరం బ్రహ్మ’ (సూర్య, అమృతనాద) అనియు, ‘ప్రణవాత్మకం బ్రహ్మ’ (త్రి. మ. నా. 1), ‘ప్రత్యగానందం బ్రహ్మపురుషం ప్రణవస్వరూప మకార ఉకారో మకార ఇతి’ (త్రిపురతాపిని. 4), ‘ప్రత్యగానందం బ్రహ్మపురుషం ప్రణవస్వరూపం’ (ఆత్మబోధ, నారాయణ), ‘ప్రణవహంసః పరంబ్రహ్మ’ (పరబ్రహ్మ), ‘అక్షరం పరమో నాదః శబ్దబ్రహ్మేతి కథ్యతే’ (యోగశిఖ. 3-2) అక్షరమే పరమనాదము, అది శబ్దబ్రహ్మ మనబడుచున్నది, ‘తదేతదక్షరం బ్రహ్మ’ (ముండక. 2-2-2) మొదలగు ఉపనిషద్వాక్యములు ఓంకారమును బ్రహ్మముగనే రూపొందించి వచించుచున్నవి. అటులే గౌడపాదులును ‘ప్రణవో హ్యపరం బ్రహ్మ ప్రణవశ్చ పరః స్మృతః । అపూర్వోఽనంతరోఽబాహ్యోఽనపరం ప్రణవోవ్యయః॥’ (మాం. కా. 1-26) ప్రణవము పరాపరబ్రహ్మముగ సమ్మతము. అది

అనాది, అపూర్వము, అబాహ్యము అవ్యయము అని వచించి యున్నాడు.

'యస్మా దుచ్చార్యమాణ ఏవ బృహతి బృంహయతి తస్మా దుచ్యతే పరబ్రహ్మ' (అథర్వశిర. 5-9) ఉచ్చరింపబడిన తోడ బెద్దదియగుచు, నితరమును బెద్దదిగ నొనరించుటచే బరబ్రహ్మ మనబడినదనియు, 'దేశతః కాలతో వస్తుతః పరిచ్ఛేదరహితం బ్రహ్మ' (త్రి. మ. నా. 1) దేశకాలవస్తుభేద రహితమైనది బ్రహ్మమనియు ద్వివిధముల నుపనిషత్తులు బ్రహ్మ శబ్దమును నిర్వచించినవి. అందుచేత 'ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః' (ప్రశ్న. 5-2) సత్యకామ, పరాపరబ్రహ్మములు రెండును ఓంకారమే అని వచింప, 'ద్వే వావ బ్రహ్మణో రూపే మూర్తంచైవా మూర్తం చ' (బృహదారణ్యక. 2-3-1) మూర్తా మూర్తములని బ్రహ్మ రూపము ద్వివిధము అనియు, 'ఓమితి బ్రహ్మేతి వ్యష్టి సమష్టి ప్రకారేణ' (నారదపరివ్రాజక. 8-1) అనగా వ్యష్టిసమష్టిరూప ప్రకారమనియు, అనగా 'సాకారః సావయవో నిరవయవం నిరాకారం|' (త్రి. మ. నా. 2) అనియు వివరించి, అవి 'మర్త్యం చామృతం చ' (బృ. 2-3-1) మర్త్య అమృతములుగ నున్నవని వచనము. కాని 'యన్మర్త్యం తదసత్యం య దమూర్తం తత్సత్యం' (మైత్రాయణి. 5-3) ఏది మర్త్యమో అది అసత్యము, అమూర్తము సత్యమగుచున్నది. అనగా 'తస్మాత్సాకార మనిత్యం నిత్యం నిరాకారమితి శ్రుతేః | యద్యత్సావయవం తత్తదనిత్య మిత్యానుమానాచ్చేతి ప్రత్య క్షేణ దృష్టత్వాచ్చ॥' (త్రి. మ. నా. 2) అందుచే సాకారము

పై చర్చింపబడియున్న ప్రణవరూప ఓంకారము 'ఓమితి బ్రహ్మ' (తైత్తిరీయ. 1-8), 'ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతదేవాక్షరం పరం' (కఠ. 1-2-16), 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ యదుక్తం బ్రహ్మవాదిభిః' (బ్రహ్మవిద్య.3) బ్రహ్మవాదులచేత వక్కాణింపబడుచున్న యీయక్షరము బ్రహ్మము, 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ధ్యేయం సర్వముముక్షుభిః' (ధ్యానబిందు. 9) ఏకాక్షరమైన ఓంకారమే బ్రహ్మము, అది సర్వముముక్షువులకు ధ్యేయము; 'ఓం ఇత్యేతదక్షరం పరం బ్రహ్మ తదేవోపాసితవ్యం' (తారసార. 2-1) ఓంకారము పరంబ్రహ్మము అది ఉపాసితవ్యము; 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' (సూర్య, అమృతనాద) అనియు, 'ప్రణవాత్మకం బ్రహ్మ' (త్రి. మ. నా. 1), 'ప్రత్యగానందం బ్రహ్మపురుషం ప్రణవస్వరూపం అకార ఉకారో మకార ఇతి' (త్రిపురతాపిని. 4), 'ప్రత్యగానందం బ్రహ్మపురుషం ప్రణవస్వరూపం' (ఆత్మబోధ, నారాయణ), 'ప్రణవహంసః పరంబ్రహ్మ' (పరబ్రహ్మ), 'అక్షరం పరమో నాదః శబ్దబ్రహ్మేతి కథ్యతే' (యోగశిఖ. 3-2) అక్షరమే పరమనాదము, అది శబ్దబ్రహ్మ మనబడుచున్నది, 'తదేతదక్షరం బ్రహ్మ' (ముండక. 2-2-2) మొదలగు ఉపనిషద్వాక్యములు ఓంకారమును బ్రహ్మముగనే రూపొందించి వచించుచున్నవి. అటులే గౌడపాదుడును 'ప్రణవో హ్యపరం బ్రహ్మ ప్రణవశ్చ పరః స్మృతః । అపూర్వోఽనంతరోఽబాహ్యోఽనపరం ప్రణవోఽవ్యయః॥' (మాం. కా. 1-26) ప్రణవము పరాపరబ్రహ్మముగ సమ్మతము. అది

అనాది, అపూర్వము, అబాహ్యము అవ్యయము అని వచించి యున్నాడు.

'యస్మా దుచ్చార్యమాణ ఏవ బృహతి బృంహయతి తస్మా దుచ్యతే పరబ్రహ్మ' (అథర్వశిర. 5-9) ఉచ్చరింపబడిన తోడ బెద్దదియగుచు, నితరమును బెద్దదిగ నొనరించుటచే బరబ్రహ్మ మనబడినదనియు, 'దేశతః కాలతో వస్తుతః పరిచ్ఛేదరహితం బ్రహ్మ' (త్రి. మ. నా. 1) దేశకాలవస్తుభేద రహితమైనది బ్రహ్మమనియు ద్వివిధముల నుపనిషత్తులు బ్రహ్మ శబ్దమును నిర్వచించినవి. అందుచేత 'ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః' (ప్రశ్న. 5-2) సత్యకామ, పరాపరబ్రహ్మములు రెండును ఓంకారమే అని వచింప, 'ద్వే వావ బ్రహ్మణో రూపే మూర్తంచైవా మూర్తం చ' (బృహదారణ్యక. 2-3-1) మూర్తా మూర్తములని బ్రహ్మ రూపము ద్వివిధము అనియు, 'ఓమితి బ్రహ్మేతి వ్యష్టి సమష్టి ప్రకారేణ' (నారదపరివ్రాజక. 8-1) అనగా వ్యష్టిసమష్టిరూప ప్రకారమనియు, అనగా 'సాకారః సావయవో నిరవయవం నిరాకారం।' (త్రి. మ. నా. 2) అనియు వివరించి, అవి 'మర్త్యం చామృతం చ' (బృ. 2-3-1) మర్త్య అమృతములుగ నున్నవని వచనము. కాని 'యన్మర్త్యం తదసత్యం య దమూర్తం తత్సత్యం' (మైత్రాయణి. 5-3) ఏది మర్త్యమో అది అసత్యము, అమూర్తము సత్యమగుచున్నది. అనగా 'తస్మాత్సాకార మనిత్యం నిత్యం నిరాకారమితి శ్రుతేః। యద్యత్సావయవం తత్తదనిత్య మిత్యానుమానాచ్చేతి ప్రత్య క్షేణ దృష్టత్వాచ్చ॥' (త్రి. మ. నా. 2) అందుచే సాకారము

అనిత్యము నిరాకారము నిత్యమని శ్రుతితాత్పర్యము. సావయవము అనిత్యమనియు ప్రత్యక్షానుమానములద్వార గోచరమేయని గ్రాహ్యము. కాన 'ద్వే బ్రహ్మణీ హి మంతవ్యే శబ్దబ్రహ్మ పరం చ యత్ । శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధిగచ్ఛతి' (త్రిపురతాపిని 5-17) శబ్దబ్రహ్మ పరబ్రహ్మములని ద్వివిధబ్రహ్మములు గ్రాహ్యము శబ్దబ్రహ్మమును గ్రహించి నిష్ణాతుడైనవాడు పరంబ్రహ్మమును బొందును. అయినను 'అన్యథా సర్వపరిపూర్ణస్య పరబ్రహ్మణః పరమార్థతః సాకారం వినా కేవలనిరాకారత్వం యద్యభిమతం తర్హి కేవల నిరాకారస్య గగనస్యేవ పరబ్రహ్మణోఽపి జడత్వ మాపద్యేత । తస్మాత్పరబ్రహ్మణః పరమార్థతః సాకారనిరాకారౌ స్వభావసిద్ధౌ' (త్రి. మ. నా. 2) సర్వపరిపూర్ణుడైన పరబ్రహ్మమునకు పరమార్థతః సాకారరహితమైన నిరాకారము అభిమతము కాని కేవల నిరాకారత్వము ఆకాశమువలె పరబ్రహ్మమునందు జడత్వము నాపాదించును కాన పరమార్థతః పరబ్రహ్మము సాకార నిరాకార స్వభావముగలవాడని మహానారాయణము సమన్వయింప యత్నించెను. అందుచేతనే 'సగుణ నిర్గుణ స్వరూపం బ్రహ్మ' అనియు నది వచించినది.

'యథా శంకునా సర్వాణి పర్ణాని సంతృణ్ణాన్యేవమోంకారేణ సర్వా వాక్ సంతృణ్ణా' (ఛాం. 2-23-3) పత్రములు తమ మొదళ్ళకు అంటుకొనియుండునట్లు వాక్కు ఓంకారమునకు అతికియుండును. అనగా నవి 'ఓంకార ప్రభవా దేవా ఓంకార ప్రభవాః స్వరాః । ఓంకార ప్రభవం సర్వం త్రైలోక్యం సచరాచరం॥'

(ధ్యానబిందు. 16) ఓంకారమునుండి దేవతలు స్వరములు సర్వము త్రిలోకములు చరాచరము లుద్భవించియుండుటచే, నవి ఆ యోంకారము మీదనే నాధారపడి యుండును. ఆవిషయమునే తారసారముగూడ 'తత్త్వ మంత్ర వర్ణ దేవతా ఛందో ఋ క్కలా శక్తి సృష్ట్యాత్మక మితి' (2-5) అనియు వాకొనియున్నది. కావున 'స ఏవ సర్వం యద్భూతం యచ్చ భవ్యం సనాతనం' (కైవల్య. 8) భూత వర్తమాన సనాతన సర్వము నాయోంకారమే అని కైవల్య రామోత్తరములును, అదియే విరాట్స్వరూపముగ 'తస్మాద్ విరాట్ భూతం భవ్యం భవిష్య ద్భవతి' (నా. ప. 9-13) అని భూత భవిష్య త్కాలముగ నారదపరివ్రాజకము బోధించుచున్నది. కాన 'భూతం భవ ద్భవిష్యదితి సర్వమోంకార ఏవ॥' అను మాండూక్య వాక్య తాత్పర్యమును బైయుపనిషత్సంచయమేగాక 'భూతం భవ్యం భవిష్యద్య త్త్రికాలోదిత మవ్యయం। తదప్యోంకార మేవాయం విద్ధి మోక్షప్రదాయకం॥' (నా.ప. 8-3) భూతాది కాలత్రయమును కాలాతీత మవ్యయమును అయి మోక్ష దాయకమైయున్నది. 'యద్భూతం భవ ద్భవిష్యత్ పరివర్త మానం సర్వదాఽనవచ్ఛిన్నం పరంబ్రహ్మ' (యోగచూడా మణి. 72) త్రికాలములు తానై సర్వదా అనవచ్ఛిన్నమై అది పరంబ్రహ్మమై యున్నది అనియు బలువిధములుగా నుపని షత్తులు ఓంకారమును వివరించెను. కాన నీమీమాంస ననుసరించి, ఓంకారప్రభవమైన సర్వచరాచరములు భూత భవిష్య ద్వర్తమానకాలరూపమున ప్రణవరూపముననే వెల్లు గొందునని తాత్పర్యము.

కాని 'యచ్చాన్యత్ త్రికాలాతీతం తదప్యోంకార ఏవ' త్రికాలాతీతమైనదియు నోంకారమే యగుచున్నది. దానినే 'అమూర్తం చ' (మైత్రాయణి. 5-3; బృహదారణ్యక. 2-3-1) అమూర్త మనియు, 'తత్సత్యం' (మై. 5-3) 'అమృతం' (బృ. 2-3-1) పరం' (ప్రశ్న. 5-1) అనియు నుపనిషత్తులు దెలిపియున్నవి. కాన 'య ఓంకారః స ప్రణవః యః ప్రణవ స్స సర్వవ్యాపీ య స్సర్వవ్యాపీ సోఽనంతః యోఽనంత స్తత్తారం యత్తారం తత్సూక్ష్మం యత్సూక్ష్మం తచ్ఛుక్లం యచ్ఛుక్లం తద్వైద్యుతం యద్వైద్యుతం తత్పరం బ్రహ్మ' (అధర్వశిర. 3) ఏది ఓంకారమో అది ప్రణవము, సర్వవ్యాపి, అనంతము, తారము, సూక్ష్మము, శుక్లము, వైద్యుతము అదియే పరం బ్రహ్మము అని ఆయా పదాన్వయములతో అధర్వశిరోపనిషత్తు వివరించుచున్నది.

అందుచే నోంకారము సర్వవర్ణాత్మకమై, అందుచే సర్వ నామరూపిణియై, సర్వాభిధాన మనంబడుచున్నది. మరల నదే రూపముల సృజించి తానెయై యుండుటచే బూర్వమంత్రార్థములరీతి సర్వరూపధారిణియైగూడ విరాజిల్లుచున్నది. కాన నది సర్వమునకు అభిధేయముగూడ నైయున్నది. అటుల ఇంద్రియ గోచరమై త్రికాలబద్ధమైన సర్వసగుణాత్మక సృష్టియొక్క నామ రూపధారిణియై యుండుటచే నది సర్వాభిధాన అభిధేయ స్వరూపముగా వచింపబడియున్నది. అటులే సర్వనామరూపములకు అధిష్ఠానమున నున్న అవ్యక్తముగను, అనగా అవ్యాకృతముగ గూడ వెలుగొంది యున్నదనుటకు 'యచ్చాన్య త్త్రికాలాతీతం' అని వాకొనబడినట్లు విదితము, కాని అవ్యాకృతము

బ్రహ్మ పరంబ్రహ్మ శబ్దముల వ్యవహార్యము కానే రదు. త్రికాలాతీతవ్యవస్థ అవ్యాకృతమునకు దాత్కాలికముగ నుండునుగాన, నీమంత్రతాత్పర్యము శుద్ధ పరంబ్రహ్మమునకే అన్వయము. పైమంత్రములు సగుణ నిర్గుణాత్మకబ్రహ్మమునకే యోంకారమును అన్వయించి యున్నవి. సగుణవ్యవస్థలో నది అభిధానముగనుండి అభిధేయమును గలిగియుండినను, త్రికాలా తీతవ్యవస్థలో దానికి అభిధేయము శూన్యమగుటచే నదియు నభిధానముగా వ్యవహరింపక నిర్వ్యవహారమున నుండును. త్రికాలములతో గూడియున్న నామరూపాత్మక సృష్టిజాతము, సర్వాధిష్ఠానమై నామరూపాద్విరహిత బ్రహ్మములో లయించి నప్పుడు వాని సాంకేతికమై ఓంకారము తన అభిధానత్వ అభి ధేయత్వములతో బ్రహ్మలయమగునని గ్రాహ్యము. అది తాత్కాలికమైన అవ్యాకృతమైయున్నను, భ్రాంతిసిద్ధమగు నవ్యాకృతముగూడ బ్రహ్మలీనమగుట సిద్ధముగాన నీయోంకా రము పరంబ్రహ్మమునకుగూడ నన్వయించునని రహస్యము. అందుచేత 'అకారాది త్రయాణాం సర్వకారణమేకాక్షరం పరంజ్యోతిః ప్రణవం భవతీతి ధ్యాయేత్' (శాండిల్య. 1–6) అకారాది త్రయమునకు ఓంకారమే కారణమై పరంజ్యోతి అనియు అదియే ప్రణవమనియు ధ్యానింపుము; 'ప్రత్యగానందం బ్రహ్మపురుషం ప్రణవస్వరూపం। అకార ఉకారో మకార ఇతి॥ తా అనేకథా సమభవత్ తదేత దోమితి। యముక్త్వా ముచ్యతే యోగీ జన్మసంసారబంధనాత్' (నారా యణ. 4) ప్రణవస్వరూపము ప్రత్యగానందమైన బ్రహ్మము అకార ఉకార మకారము కాక నది అనేకథా యున్నది.

అదియే ఓంకారము. దానినుచ్చరించి యోగి సంసారబంధము నుండి విడివడును అని ఉపనిషద్వచనము. వ్యక్తావ్యక్తముల నుపాసించిన సంసారవిముక్తి సిద్ధింపదుగదా.



# రెండవ మంత్రము

సర్వం హ్యేతద్బ్రహ్మ అయమాత్మా బ్రహ్మ।
సోఽయమాత్మా చతుష్పాత్॥

సర్వము ఆబ్రహ్మము. ఈ జీవాత్మయు బ్రహ్మమే. ఈ ఆత్మ నాలుగుపాదములుగలదిగ నున్నదని మంత్ర తాత్పర్యము. పూర్వమంత్రమున నుపయోగింపబడిన సర్వ శబ్దము ఇచట ఉపయోగింపబడుట విశేషము. 'అక్షరమిదం సర్వం, సర్వమోంకారఏవ' అను యన్వయమే నీ మంత్రమున బ్రహ్మ శబ్దమున కన్వయింపబడినది. అనగా ఓంకారము సర్వచరాచర రూపమై మరల బ్రహ్మమే యగుచున్నది. ఓంకారాక్షరము వలెనే ఈ ఆత్మయును బ్రహ్మమే యగును. కాన ఓంకారాత్మ బ్రహ్మము లభిన్నములని వ్యక్తము. ఈ యాత్మ నాలుగు పాదములుగలదిగ జెప్పబడియున్నది. అందుచే నోంకార బ్రహ్మములకు గూడ నాలుగుపాదములని గ్రాహ్యము. ఈ మంత్రమున బాద శబ్దము గోపాదములరీతి నన్వయింపక బూర్వము ఉత్తరమునందు అన్వయించువిధానమున బూర్వ నాడు కార్షాపణమను నాణెమునగల నాలుగుభాగములవలె, అనగా ఆధునిక రూప్యమునగల నాలుగుపావలలవలె నా భాగ

ములు చెల్లొందునని యర్థము. ప్రథమపాదము ద్వితీయముననుె, ఈ రెండు దృతీయముననూ, మరల నీ త్రయము చతుర్థమున లయించియుండును. అందుచేత పాదశబ్దము నన్వయించుటకై 'పద్యతే అనేనేతి పాదః' దీనిచేత పొందబడును అను కరణ వ్యుత్పత్తి ననుసరించి పాదత్రయమునకును, 'పద్యత ఇతి పాదః' పొందబడువాడు అని కర్మవ్యుత్పత్తి చతుర్థమునకును నన్వయింపవలెను. అట్లు ఆత్మపాదములగు విశ్వ తైజస ప్రాజ్ఞులు పొందబడువారగుదురు. అనగా విశ్వుడు తైజసునందును, ఆ ద్వయము ప్రాజ్ఞుని బొందుచున్నారు. మరల నీ మువ్వురును తురీయుని బొందుదురు. కాని చతుర్థమైన తురీయుడు దేనిని బొందుటలేదు. పూర్వత్రయమును లయింపజేసికొని మాత్ర ముండును. వాని బీజరూపముగూడ నందుండమిచే నవి యట అభావమనియే తాత్పర్యము.

ఆ విధముగ నీ మంత్రమున బూర్వమంత్రార్థమైన ఓంకారమును సర్వ శబ్దముద్వారమున బ్రహ్మమునకును, అంత బ్రహ్మాత్మల కభేదమును బ్రతిపాదించి, ఉత్తరగ్రంథవిషయమైన చతుష్పాదాత్మక ఆత్మవిషయమును బ్రవేశపరచియున్నది. అర్థభావనము లేక మననము సఫలము కానేరదు కావునను, కేవలము 'సర్వ' శబ్దాన్వయమైన పరమాత్మను స్మరించిన ముక్తిహేతువు కాకుండుటచే, బ్రహ్మమును బ్రస్తావించి, అదియు దుర్గ్రాహ్యమైయుండుటయు, ఆత్మేతరముగ నజ్ఞులకు గాను పించుటచే, జీవబ్రహ్మైక్యమును వచించి, నిత్యప్రత్యక్షానుభవ సిద్ధమైన ఆత్మను చతుష్పాదయుక్తముగా, జాగ్రత్ స్వప్న

సుషుప్తి తురీయములుగా బోధించుచు మననోపయుక్తము గావించుచున్నది.

అటులే 'తమేవాత్మాన మిత్యేతత్ బ్రహ్మ శబ్దేన వర్ణితం। తదేక మమృత మజర మనుభూయ తథోమితి॥' (నా. ప. 8-4) ఈ ఆత్మ బ్రహ్మశబ్దముచే వర్ణితము. అది ఏకము అమృతము, అజరము, అదియే ఓంకారము, 'ఓమిత్యేకాక్షర మాత్మ స్వరూపం' (తారసార. 1) ఓంకారాక్షరమే ఆత్మస్వరూపము, 'ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానం' (ముండక. 2-2-6) ఆత్మను ప్రణవముగా ధ్యానింపుము అను ఓంకారాత్మలను మేళవింప జేసి ధ్యానించుట యవసరమని యుపనిషత్తులు వక్కాణించు చున్నవి.

'సర్వం ఖల్విదం బ్రహ్మ' (ఛాం. 3-14-1) ఇది యంతయు బ్రహ్మముమాత్రమై యున్నది. 'సర్వం చ ఖల్విదం బ్రహ్మ నిత్య చిద్ఘనమక్షతం' (మహా. 4-119) సర్వము తప్పక బ్రహ్మమే, ఆబ్రహ్మము నిత్యచిద్ఘనము అక్షతము. 'సర్వం బ్రహ్మమయం ప్రోక్తం సర్వం బ్రహ్మమయం జగత్' (తేజోబిందు. 6-52) సర్వము బ్రహ్మమయముగ వచింపబడినది. సర్వజగత్తు బ్రహ్మమయము. 'బ్రహ్మైవ సర్వం చిన్మాత్రం బ్రహ్మమాత్రం జగత్త్రయం' (తేజోబిందు. 6-42) 'సర్వ మాత్మమయం జగత్ బ్రహ్మమాత్రమిదం సర్వం' (తేజోబిందు. 6-47) 'ఇదం బ్రహ్మ ఇదం సర్వం' (బృ. 2-5-1) అను వచనములద్వార సర్వము బ్రహ్మమేయని విస్పష్టలీల వివరింప బడియున్నది.

అంత మహావాక్యచతుష్టయములో ద్వితీయమైన 'అయమాత్మా బ్రహ్మ' అను మహావాక్యమిట ఉపదేశింప బడియున్నది. బృహదారణ్యక శ్రవణ విధివాక్యమురీతి 'శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః' (బృ. 2-4-5) శ్రవణ మనన నిదిధ్యాసనములలో ఛాందోగ్యాదిగత 'తత్త్వమసి' అను మహావాక్యము శ్రవణవాక్యముగను, మాండూక్యాదికము లోని 'అయమాత్మా బ్రహ్మ' మనన వాక్యముగను, బృహ దారణ్యకాది యుపనిషత్తులగల 'అహం బ్రహ్మాస్మి' నిదిధ్యాసన వాక్యముగను, ఐతరేయాదిక ఉపనిషత్తులగల 'ప్రజ్ఞానం బ్రహ్మ' అనువాక్యము సాక్షాత్కారవాక్యముగను బండితుల అభిప్రాయము. ఈ మననవాక్యమును అనేకోపనిషత్తులు ప్రస్తావించియున్నను మాండూక్య మనన విధానమును మాత్రమే అనువదించియున్నవి. అందుచే నీమననవాక్యమును మాండూక్యవిధానముననే అన్వయించుకొని తాత్పర్యగ్రహ ణము గావింపవలయునని గ్రాహ్యము.

'అతతి వ్యాప్నోతీతి ఆత్మా' వ్యాపించియుండునది ఆత్మ యనియు, 'యస్మాత్సర్వ మాప్నోతి సర్వమాదత్తే సర్వ మత్తి చ తస్మాదుచ్యతే ఆత్మేతి' (శాండిల్య. 3-1) దేనివలన సర్వము లభించునో, సర్వము గ్రహింబడునో, సర్వము సృజింప బడునో అది ఆత్మ యని నిర్వచింపబడియున్నను, శాస్త్రవిధా నము ననుసరించి యిట లక్ష్యార్థమును గాక ప్రథమతః వాచ్యార్థమును గ్రహించి సోపానన్యాయమున, విశ్వాత్మ తైజసాత్మ ప్రాజ్ఞాత్మల మననద్వారమున, దురీయమైన ఆత్మకు జేరవలయును గాన, 'కతమ ఆత్మేతి, యోఽయం విజ్ఞాన

మయః ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః పురుషః । స సమానః సన్నుభౌ లోకా వనుసంచరతి ధ్యాయతీవ లేలాయతీవ।' (బృం. 4-3-7) ఆత్మ ఏది? ఈ విజ్ఞానమయుడే యింద్రియములలో హృదయాంతరమునగల జ్యోతిరూప పురుషుడు. అతడు జాగ్రత్స్వప్నలోకముల, యోచించుచున్నటుల జలించుచున్నటుల గోచరించు చనబడుచు, 'ఏతాదృ దేహాభిమానేన జీవో భవతి । గృహాభిమానేన గృహస్థ ఇవ శరీరే జీవః సంచరతి' (నా. ప. 6-1) ఈ దేహాభిమానముచే నతడు జీవుడగుచున్నాడు. గృహాభిమాని అయిన గృహస్థువలె నాతడు శరీరమున సంచరించును అనబడు దేహస్థుడైన యాత్మయే యీమంత్రప్రోక్త ఆత్మ యగుచున్నది. అందుచేత 'అయం ఆత్మా' అనుచు 'యీ' అను సన్నిహితత్వమును నిత్యానుభూతమును అయిన పద ముపయోగింపబడియున్నది. అతడు 'అంతఃకరణ ప్రతిబింబితచైతన్యం యత్తదేవావస్థాత్రయ భాగ్భవతి । స జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థాః ప్రాప్య ఘటీయంత్రవ దుద్విగ్నో జాతో మృత ఇవ స్థితో భవతి॥' (పైంగల. 2) అంతఃకరణ ప్రతిబింబచైతన్యము నాబరగు నతడు అవస్థాత్రయముల బొందును. అతడు అవస్థాత్రయమును బొంది భీతిచే జననమరణముల బొందినట్లుండుచు. అనగా 'జీవేశ్వరాది రూపేణ చేతనాచేతనాత్మకం । ఈక్షణాది ప్రవేశాంతా సృష్టిరీశేన కల్పితా। జాగ్రతాది విమోక్షాంతః సంసారో జీవకల్పితః॥' (మహా. 4-73) జీవేశ్వరరూపమున జడ అచైతన్యములుగ గల సృష్టిని, 'తదైక్షత బహు స్యాం ప్రజాయేయ' (ఛాం. 6-2-3) అది నానాత్వము నగుదును గాక అని సంకల్పించెను

అను వాక్యమురీతి సంకల్పక్రియనుండి, 'తత్సృష్ట్వా తదేవాను ప్రావిశతు' (తై. 2-6) అది సృజించి అందు ప్రవేశించెను అను ప్రవేశకార్యమువరకు ఈశ్వరుడు కల్పింప; జాగ్రదవస్థ నుండి విముక్తి నొందువరకు గల సర్వసంసారమును గల్పించి, అందు సుఖదుఃఖ ద్వంద్వమున జరించువాడు జీవుడు అగుచున్నాడు.

కాన 'అయ మాత్మా బ్రహ్మ' అని యనుటతోడనే లక్ష్యార్థయోగ్యమై బ్రహ్మాభిన్న ఆత్మగాక, స్థూలమై సర్వానుభవముల ననుభవించుచున్న జాగ్రదవస్థామగ్నుడైన జీవుడు గోచరము కాన, అట్టి వానినే ప్రథమతః ఉపనిషత్తు మూడవ మంత్రములో ప్రవేశమొనర్ప, 'సోయమాత్మా చతుష్పాత్' ఈయాత్మ నాలుగుపాదములు గలదియని యిచ్చటనే సూచించినది. ఇచ్చట ప్రస్తావింపబడిన ఆత్మ 'కార్యోపాధి రయం జీవః' (త్రి. మ. నా. 4) అనుదీని కార్యరూపమైన అవిద్యాగ్రస్తమైన అంతఃకరణ ప్రతిబింబచైతన్యమని తాత్పర్యము.

అటులే బ్రహ్మశబ్దముగూడ నన్వయము. మనన కార్యకర్తయగు ప్రాథమికుడు పూర్వ మాత్మశబ్దమునవలె బ్రహ్మశబ్దమున 'సర్వోపాధి వినిర్ముక్తం నిర్విశేషచిన్మాత్రం సదద్వైత మానందం అమాయం బ్రహ్మ' (సర్వసార. 10) ఎట్టి యుపాధులు లేనిదై, విశేషము గాంచనిదై చిన్మాత్రమై సత్తై అద్వైతమై మాయారహితమైన ఆనందబ్రహ్మముగాక, 'బ్రహ్మశబ్దేన తద్బ్రహ్మ స్వప్రకాశాత్మరూపకం' (శుకరహస్య. 2) స్వప్రకాశాత్మరూపకమైన బ్రహ్మముగూడ గాక, 'సత్యం విజ్ఞాన మనంతం బ్రహ్మ' (శాండిల్య. 2-0.), 'సత్యం

జ్ఞానం అనంతం బ్రహ్మ' (తై. 2-1), 'సచ్చిదానందం బ్రహ్మ' 'విజ్ఞానమానందం బ్రహ్మ' (బృ. 3-9-28) మొదలగు వాక్యములచే సూచితమైన గుణగణ విశిష్టుడై సగుణుడై 'యస్మాచ్చ బృహతి బృంహయతి చ సర్వం తస్మా దుచ్యతే పరంబ్రహ్మేతి' (శాండిల్యా. 3-2) ఎందుచే సర్వము పెద్దదియగుచు పెద్దదిగ జేయబడుచున్నదో అందుచే నది పరంబ్రహ్మము అగుచున్నది యనియు, 'కిం బ్రహ్మేతి। మహదహంకార పృథివ్యప్తేజో వాయ్వాకాశత్వేన బృహద్రూపే ణాండకోశేన కర్మజ్ఞానార్థరూపతయా భాసమాన మద్వితీయ మఖిలోపాధి వినిర్ముక్తం తత్సకల శక్త్యుపబృంహిత మనా ద్యనంతం శుద్ధం శివం శాంతం నిర్గుణ మిత్యాది వాచ్య మనిర్వాచ్యం చైతన్యం బ్రహ్మ॥' (నిరాలంబ. 1) బ్రహ్మమన నేది? మహదాది పృథ్వీపర్యంతము బృహద్రూపముగను, అండకోశమున గర్మజ్ఞానార్థరూపమున వెల్గొందుచు, అద్వయమై, సకల ఉపాధివివర్జితమై సకల శక్తుల బెంచుచు, అనాద్యనంతము శుద్ధము శివము శాంతము నిర్గుణాదికపదము లచే వాచ్యమై యుండియు అనిర్వాచ్యమైన చైతన్యమే బ్రహ్మ మని వచింపబడుచు. సర్వాతీతమై యుండియు విరాడాది కార్య బ్రహ్మరూపము ధరించినట్లు సృష్ట్యాదిక కర్మలకు గర్తయై నట్లు గోచరించి, కార్యరూపమే తానై యున్నట్లున్న బ్రహ్మమే యిచ్చట అన్వయము. అందుచేతనే ఆత్మకుగల విశ్వాది చతుష్పాదములవలె నీబ్రహ్మమునకు గూడ వైశ్వానర హిరణ్యగర్భాది చతుష్పాదములును ద్యోతకము. 'పాదోస్య విశ్వా భూతాని త్రిపాదాస్యామృతం దివి'

(త్రి. మ. నా. 4) విశ్వమునగల భూతాదికము అతని కొక పాదము. అమృతమైన ద్యులోకాదికము అతనికి పాద త్రయము, 'పాదచతుష్టయాత్మకం బ్రహ్మ। తత్రైక మవిద్యా పాదం పాదత్రయ మమృతం భవతి' (త్రి. మ. నా. 4) బ్రహ్మమునకు నాలుగు పాదములుగలవు. అందు ప్రథమము అవిద్యాపాదము, అమృతమైనవి మిగిలిన త్రయము. ఆ విష యమును మహానారాయణ ముపదేశించుచు, 'అవిద్యా పాదః ప్రథమఃపాదో విద్యాపాదో ద్వితీయః ఆనందపాదస్తృ తీయ స్తురీయ పాదస్తురీయఇతి' (1) ప్రథమము అవిద్యా పాదముగను, ద్వితీయము విద్యాపాదము, తృతీయము ఆనంద పాదము, తురీయము చతుర్థపాదముగ వివరించి, 'ప్రణవ స్సర్వదాతిష్ఠేత్ సర్వజీవేషు భోగతః। అభిరామస్తు సర్వాసు హ్యవస్థాసు హ్యధోముఖః॥' (యోగచూడామణి. 73) తుర్యగమగు ప్రణవము విశ్వాది జీవత్రయమునందు భోగ రూపముగ సర్వావస్థల నేకరూపముగనుండి అభిరామము అనబడుచున్నట్లు 'మూలావిద్యా ప్రథమపాదే నాన్యత్ర। విద్యానంద తురీయాంశాః సర్వేషు పాదేషు వ్యాప్య తిష్ఠంతి।' (త్రి. మ. నా. 1) ప్రథమపాదమున మూలావిద్యగలదు. అన్యత్ర మూడుపాదముల నవి అభావము. మిగిలినపాదముల గల విద్యానందతురీయాంశములు సర్వపాదములందు వ్యాప్తమై యున్నవి. అందు ప్రథమము అవిద్యాశబలితము అగుచుండ, ఉపరితనమైన పాదత్రయము అమృత లక్ష్యములుగలవి అని ఆ యుపనిషద్వివరణము. 'ఏకమేవాద్వితీయం బ్రహ్మ మాయయా చ చతుష్టయం' (గోపాలోత్తర. 10) బ్రహ్మము

అద్వితీయమై యేకమే, కాని మాయాప్రభావమున చతుర్విధ ముగ గోచరము 'తత్రి చతుష్పాదం బ్రహ్మ విభాతి। జాగరితే బ్రహ్మ స్వప్నే విష్ణుః సుషుప్తౌ రుద్రస్తురీయ మక్షరం' (బ్రహ్మ. 3) బ్రహ్మ చతుర్విధము. జాగ్రత్తున బ్రహ్మ, స్వప్నమున విష్ణు, సుషుప్తిని రుద్రుడు. తురీయమున నక్ష రుడుగ నుండును అని బ్రహ్మోపనిషత్తు వచించును. ఛాందో గ్యము బ్రహ్మమును షోడశకళాత్మకముగ జేసి, నాలుగింటి నాలుగింటి కంధించి, అందు 'ప్రకాశవాన్' ప్రథముడు గను, 'అనంతవాన్' ద్వితీయుడుగను, 'జ్యోతిష్మాన్' తృతీయుడుగను, 'ఆయతనవాన్' తురీయునిగ చిత్రించినది.

ప్రణవరూపమున 'అకారః ప్రథమాక్షరో భవతి। ఉకారో ద్వితీయాక్షరో భవతి। మకారస్తృతీయాక్షరో భవతి। అర్ధమాత్రా శ్చతుర్థాక్షరో భవతి' (రామోత్తరతాపినీ. 2) అనునట్లు అకార ఉకార మకార అర్ధమాత్రలు నాలుగు పాద ములై యొప్పారినట్లు 'జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయమితి చతు ర్విధా అవస్థాః' (శారీరక. 5) అనబడు అవస్థాచతుష్టయమున 'విశ్వ తైజస ప్రాజ్ఞ తటస్థభేదై రేక ఏవ ఏకో దేవః' (నా ప. 6-1) 'జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయాశ్చ త్యవస్థా శ్చతస్రః తాసా మవస్థానా మధిపతయ శ్చత్వారః పురుషా విశ్వ తైజస ప్రాజ్ఞా త్మాన శ్చేతి' (యోగచూడామణి. 72) అనురీతి విశ్వ తైజస ప్రాజ్ఞ తురీయులు అధిష్ఠానమూర్తులుగ నుందురు. తురీయుని దటస్థ ఆత్మనామముల నాయుపనిషత్తులు పేర్కొనెను. తురీయమన నాల్గవది అను యర్థమున అవిజ్ఞేయమగు దానిని సామాన్యవ్యవహారమున దురీయమని యే మాండూక్యము

వచించును. దానిని 'చతుష్పాదిదమక్షరం పరం బ్రహ్మ' యని అథర్వణోపనిషత్తు పరంబ్రహ్మ అనియే వచించినది.

ఈ విశ్వాదులు ఆయా యవస్థాకాలముల 'చతుష్పాదంతర్వర్తినోఽంతర్జీవ బ్రహ్మణ శ్చత్వారి స్థానాని నాభి హృదయ కంఠ మూర్ధసు జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయావస్థాః' నాభి హృదయ కంఠ శిరములను జతుష్టస్థానములనుండి వ్యవహరించుదురని పరబ్రహ్మోపనిషత్తు వచింప, 'నేత్రస్థం జాగరితం విద్యా త్కంఠే స్వప్నం సమావిశేత్। సుషుప్తం హృదయస్థం తు తురీయం మూర్ధ్ని సంస్థితం॥' (24) నేత్రమున జాగ్రత్తు, కంఠమున స్వప్నము. హృదయమున నిద్ర శరీరమున దురీయము లుండునని బ్రహ్మోపనిషద్వాక్యము. అదే యుపనిషత్తు 'నాభి హృదయం కంఠం మూర్ధా చ' (1) అనుచు జాగ్రత్తునకు మూర్ధమును, నాభిని తురీయునకు నొసంగి పరబ్రహ్మోపనిషత్తు ననుసరించుచున్నది. జాగ్రత్తునకు నాభిస్థానము నొసంగక, 'దక్షిణాక్షిముఖే విశ్వో మనస్యంతస్తు తైజసః। ఆకాశే చ హృది ప్రాజ్ఞ స్త్రిధా దేహే వ్యవస్థితః॥, (మాం. కా. 1-2) అను కారికలో విశ్వునకు దక్షిణ నేత్రము నొసంగి, తైజసునకు మనస్సును, హృదయమును ప్రాజ్ఞునకును కారికాకారు డొసంగెను.

మరియు 'పరబ్రహ్మానుసంధధ్యా ద్విశ్వాదీనాం క్రమః క్రమాత్, స్థూలాత్వాద్ స్థూలభుక్త్వాచ్చ సూక్ష్మత్వాత్ సూక్ష్మభుక్ పరం, ఐక్యత్వానందభోగాచ్చ సోఽయమాత్మా చతుర్విధః' (నా. ప. 8-6, నృసింహోత్తరతాపినీ 1.) విశ్వాదులు క్రమక్రమముగ బరబ్రహ్మమునుండి స్థూలత్వ

ముచే స్థూలభుక్కనియు, సూక్ష్మత్వముచే సూక్ష్మభుక్కనియు, ఐక్యత్వముచే ఆనందభుక్కనియు విమర్శింపబడిరి. అట్లే 'స్థూలం తర్పయతే విశ్వం ప్రవివిక్తం తు తైజసం। ఆనందశ్చ తథా ప్రాజ్ఞం త్రిధా తృప్తిం నిబోధత॥' (1-4) స్థూలములు విశ్వుని దృప్తిపరచును. సూక్ష్మములు తైజసుని, ప్రాజ్ఞుని ఆనంద కరములుగ నివి త్రివిధానందములనియు, గాన 'విశ్వో హి స్థూలభుక్ నిత్యం తైజసః ప్రవివిక్తభుక్। ఆనందభుక్తథా ప్రాజ్ఞ స్త్రిధా భోగం నిబోధత॥' (1-3) విశ్వుడెల్లప్పుడు స్థూలముల ననుభవించును. తైజస ప్రాజ్ఞులు సూక్ష్మ ఆనందముల ననుభవించెదరు. ఇవియే త్రివిధభోగములుగను, కావున, 'బహిష్ప్రజ్ఞో విభుర్విశ్వో హ్యంతఃప్రజ్ఞస్తు తైజసః ఘనప్రజ్ఞస్తథా ప్రాజ్ఞ' (1-1) సర్వవ్యాపియయిన విశ్వుడు బాహ్యవస్తువుల ననుభవించును. తైజసుడు అంతర్విషయ ముల గ్రహించును. ఐక్యవస్తుస్వరూపమే ప్రాజ్ఞుడని కారికా తాత్పర్యము.

ఈ యవస్థాదులలో సర్వసామాన్యానుభవ యోగ్య త్వముగలవి ప్రథమత్రయమై, తురీయము యథార్థముగ నవస్థయేగాదు. అందుచేత పూర్వము దానిని దట్టస్థ ఆత్మ పరబ్రహ్మ మొదలగుపదముల గొన్ని ఉపనిషత్తులు వ్యవహ రించినవి. కాని మండలబ్రాహ్మణము 'పంచావస్థాః జాగ్ర త్స్వప్న సుషుప్తి తురీయ తురీయాతీతాః' (2-4) అనుచు తురీయాతీతమను పంచమావస్థనుగూడ జెప్పియున్నది. దానిని వివరించుచు 'చతుర్విధ్విరహితం తురీయాతీతం' (నా. ప. 6-1) నాలుగవదిగూడ లేనిది తురీయాతీతమని వ్రాసెను.

అంతతో దృప్తి బొందక 'బిందు స్తురీయాక్షరో భవతి। నాదః పంచమాక్షరో భవతి। కళా షష్ఠాక్షరో భవతి। కళాతీతా సప్తమాక్షరో భవతి। తత్పర శ్చాష్టమాక్షరో భవతి' (2-1) బిందు, నాద, కళ, కళాతీత, పరములను అయిదింటి ప్రథమ త్రియమునకు జేర్చి అష్ట పాదములుగ దారసారము జేసెను. తురీయమున నర్థమాత్రను నుంచి, 'నాద బిందు కళా శక్తు'ల నాలుగింటిని జేర్చి అష్టకముగ నారదపరివ్రాజకము గావించెను. బిందు నాదములమాత్రము పంచమ షష్ఠాక్షరములుగ గ్రహించి, ఓంకారమున షష్టపాదముల రామోత్తరతాపిని కల్పించినది. 'బ్రహ్మప్రణవః షోడశమాత్రాత్మకః సోఽవస్థా చతుష్టయ చతుష్టయగోచరః జాగ్రదవస్థాయాం జాగ్రదాది చతస్రోఽవస్థాః స్వప్నే స్వప్నాదిచతస్రోఽవస్థాః సుషుప్తౌ సుషుప్త్యాదిచతస్రోఽవస్థా స్తురీయే తురీయాది చతస్రోఽవస్థా భవంతి' అనురీతి బరమహంసపరివ్రాజకము జాగ్రదవస్థా భేదములు నాలుగుగను, అటులే నాలుగుస్వప్నావస్థలు, నాలుగు నిద్రావస్థలు, తురీయచతుష్టయముల ప్రతిపాదించి అవస్థల షోడశకముగ నొనరించెను. సగుణమైన విరాట్ప్రణవము షోడశమాత్రాత్మకమని నారదపరివ్రాజకము బోధించుచు, అకార ఉకార మకార అర్థమాత్రలతో బాటు నాద, బిందు, కళా, కళాతీత, శాంతి, శాంత్యతీత, ఉన్మనీ, మనోన్మనీ, పురీ, మధ్యమా, పశ్యంతి, పరా అను ద్వాదశకమును జేర్చినది. అవస్థాత్రయభిన్నముల నవస్థలలో బరిగణింపక జతుర్థ పంచమములుగ 'మూర్ఛా మరణావస్థా పంచ భవంతి'(2) మూర్ఛా మరణముల జేర్చి పంచావస్థల బైంగలము ప్రతిపాదించెను.

కాని మూర్ఛా మరణముల అవస్థలలో జేర్చుట యుక్తిరహితము. మూర్ఛ అనునది వ్యాధిమాత్రము, సర్వానుభవము కాదు. మరణముయొక్క అనుభవము శూన్యము. అవస్థాత్రయమువలె అనుభవయోగ్యమై యీ యవస్థ త దంతర్గతముగ గలదికానేరదు. అది క్షణికమే. తురీయుడుగూడ నవస్థాత్రయము ననుభవింపగలడుగాని, మృతుడు అట్టి అనుభవమున కయోగ్యుడు. కాన నీరెండుఅవస్థల యితరావస్థల చేర్చుట అసంగతము. మరియు నవస్థా చతుష్టయము మాండూక్యవిధానమున నొండొంట లయించుచు గ్రమముగ దురీయమున నుండును. ప్రథమత్రయమున కన్యోన్యత్వము రూఢిగ నుండి ఏకీభూతమగుచు, మరల చేతోముఖత్వము ప్రాజ్ఞునినుండి జరుగు చుండుట గమనార్హము. అట్టిది పైన ప్రతిపాదిత అవస్థాద్వయములో గాంచము. కాన మాండూక్య అవస్థాచతుష్టయమే ప్రమాణముగ గ్రాహ్యమగుట సముచితము.

అవస్థాత్రయరూపమునగల జాగ్రత్స్వప్నసుషుప్తులు, నిష్కళంకమును, నిర్వికారమును అయిన తురీయమునుండి జనితమై, 'సర్వావస్థాసు సాక్షీ త్వేక ఏవావతిష్ఠతే' (నా. ప. 6–1) సర్వ అవస్థలలో సాక్షివలె నది యున్నదను విధాన దురీయమును గలిగియున్నవి. కాని అవి క్రమక్రమముగా కార్యకారణ సంబంధమున స్థూలత్వమును ధరించి, జాగ్రదవస్థాస్థానమున నతిస్థూలమై యొప్పారియున్నవి. అందుచేత ఘన, సూక్ష్మ, స్థూల ప్రజ్ఞలుగ ప్రాజ్ఞ తైజస విశ్వులు రూపొందింపబడియున్నారు. ఘనప్రజ్ఞము స్వప్నజాగ్రత్తులకు గారణమగుటచే దాని గారణావస్థ యనియు, సూక్ష్మము కార్యకారణావస్థ

గను, స్థూలము కార్యావస్థయనియు వాని క్రమముగా నన నెల్లును. నిష్కళంకమైన సుషుప్తి కారణముగ బరిణమించుటచే నజ్ఞానావస్థ అనియు వ్యవహార్యము. అందుచే నచ్చట ప్రజ్ఞానఘనమున్నను అజ్ఞాతముగ అది యుండుటచే నాయవస్థ అజ్ఞాన మనబడియున్నది. పిమ్మట అజ్ఞానకార్యములైన అన్యథాజ్ఞాన ముదయించును. అనగా స్వకీయలక్షణముల విస్మరించి, పరకీయముల గ్రహించి భ్రాంతి నుండుట అందలిలక్షణము అట్లు నిద్రలోని స్వాత్మవిస్మరణరూప అజ్ఞానము పరిణమించి, కించిన్మాత్రస్థూలత్వముచే సూక్ష్మమై స్వప్నముగ దోచును. అదియు నన్యథాజ్ఞానమే యగును. మరల నాసూక్ష్మస్థితిగల నన్యథాజ్ఞానము ఇంకను బరిణమించి, పూర్తిగ స్థూలమై, కార్యమై స్థూలాన్యథాజ్ఞాన మగుచున్నది అదియే జాగ్రదవస్థ యనబడును. కాన స్వప్నజాగ్రత్తులు రెండును సూక్ష్మత్వస్థూలత్వవిభేదమును మాత్రము గలిగి అన్యథాజ్ఞానరూపములే యగుచున్నవి.

అటులే విశ్వ తైజస ప్రాజ్ఞులలోనీ విభేదమే గోచరము. ఆవిషయములు ముందు మంత్రముల స్పష్టపడగలవు. అదే విధముగ బ్రహ్మవిషయిక మూర్తిత్రయమునగూడ నీవిభేదము గ్రాహ్యము. ప్రాజ్ఞుని స్థితినున్నవాడు ఈశ్వరుడుగను, తైజసునికి హిరణ్యగర్భుడుగను, విశ్వునికి వైశ్వానరుడు అనగా జతుర్ముఖునిగను వ్యక్తము. అందు ఈశ్వరుడు ప్రజ్ఞానఘనుడై కారణ మూర్తియై యుండ, హిరణ్యగర్భస్థితినున్న విష్ణువు కార్యకారణ మూర్తియై విలసిల్లును. ఇక సృష్టిరూపమున నున్న బ్రహ్మ కేవలము కార్యరూపుడై వెలుగొందుట స్పష్టము. అయినను

'బ్రహ్మా విష్ణు రుద్రాశ్చోత్పత్తి స్థితి లయకర్తారః। రాజసో బ్రహ్మా సాత్త్వికో విష్ణు స్తామసో రుద్రఇతి ఏతే త్రయోగుణ యుక్తాః' (యోగచూడామణి. 72) బ్రహ్మా విష్ణు రుద్రులు సృష్టి స్థితి లయకర్తలు. రజోగుణవిశిష్టుడు బ్రహ్మా, సాత్త్విక సంపన్నుడు విష్ణువు, తామసికుడు రుద్రుడు. 'అకారో రాజసో రక్తో బ్రహ్మా చేతన ఉచ్యతే। ఉకార స్సాత్త్వికః శుక్లో విష్ణు రిత్యభిధీయతే॥' (75) 'మకారస్తామసః కృష్ణో రుద్రశ్చేతి తథో చ్యతే'(యో.చూ. 78) అకారము రాజసగుణము రక్తవర్ణము, బ్రహ్మాచేతన మనబడును. ఉకారము సాత్త్వికము, శుక్లవర్ణము విష్ణువనంబడును. మకారము తామసగుణమై కృష్ణవర్ణముగ రుద్రుడైయున్నది. 'అకారః పీతవర్ణః స్యా ద్రజోగుణ ఉదీరితః' (ధ్యానబిందు.12) అకారము పసుపువర్ణముగలదై రజోగుణము గలిగియున్నది. 'బ్రాహ్మణం రక్తగౌరాభం చతుర్వక్త్రం పితా మహః' బ్రహ్మారక్తవర్ణుడు చతుర్ముఖుడు పితామహుడు, 'ప్రథమారక్తా పీతా మహద్బ్రహ్మదైవత్యా' (అథర్వశిఖ) 'తమో మాయాత్మకో రుద్రః। సాత్త్వికమాయాత్మకో విష్ణుః రాజసమాయాత్మకో బ్రహ్మ' (పాశుపతబ్రహ్మ. 1) అనుచు గొన్నియుపనిషత్తులు ఆయా మూర్తులకు త్రిగుణములను దదనుగుణ వర్ణములను వివరించియున్నవి. కాని 'ఆనందమయో హ్యానందభుక్' ఆనందమయుడు. ఆనందభోక్తయని మాండూ క్యముచే వర్ణింపబడియున్న 'కార్యం విష్ణుః క్రియా బ్రహ్మా కారణం తు మహేశ్వరః' (రుద్రహృదయ. 15) అనునట్లు కారణస్వరూపుడైయున్న 'ధర్మో రుద్రో జగద్విష్ణుః సర్వజ్ఞానం పితామహః' (రుద్రహృదయ. 16) అనురీతి ధర్మమూర్తియై

యున్న, 'అవిద్యాపాదః ప్రథమః పాదో విద్యాపాదో ద్వితీయః ఆనందపాద స్తృతీయః' (త్రి. మ. నా. 1) అనురీతి అవిద్యా పాదవిశిష్టుడుగాక ఆనందపాదయుక్తుడై యున్న ఈశ్వరుని దామ సికుడని నచించుట అయుక్తము. 'క్రియా ఇచ్ఛా తథా జ్ఞానం బ్రాహ్మీ రౌద్రీ చ వైష్ణవీ' (యో. చూ. 86) క్రియాశక్తి బ్రాహ్మీయముగను, ఇచ్ఛాశక్తి రౌద్రీయముగను, జ్ఞానశక్తి వైష్ణవీయముగను యీ యుపనిషత్తు జ్ఞానేచ్ఛా క్రియాశక్తుల యొక్కయు, బ్రహ్మవిష్ణురుద్రులయొక్క క్రమత్వమును దప్పించి ఆయామూర్తుల కన్వయించినది. కాని 'తృతీయా శుభాశుభా శుక్లా రుద్రదైవత్యా' (అధర్వశిఖ) తృతీయము శుభాశుభ ములలో శుక్లమై రుద్రదైవత మనియు, 'ప్రోక్తాచ సాత్వికీ రుద్రే భక్తే బ్రహ్మణి రాజసీ। తామసీ, దైత్యపక్షేతు...॥' (కృష్ణ) ఆమాయ రుద్రునియందు సాత్వికమనియు, భక్తుడైన బ్రహ్మయందు రాజస మనియు, రాక్షసులందు దామసమనియు జెప్పబడినది అను మంత్రములు సుషుప్తిస్థిత ఈశ్వరుని సాత్వి కునిగ అభివర్ణించి యున్నవి. లేకున్న అతడు 'ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ' (మాండూక్య. 6) అని యెట్లు వర్ణింపబడగలడు? అందుచేతనే 'ఆనందమయో హ్యానందభుక్' (మాండూక్య. 5) అనియు, 'ఏష బ్రహ్మలోకః... ఏషాస్య పరమాగతిః। ఏషాస్య పరమాసంపత్ ఏషాస్య పరమో లోకః, ఏషాస్య పరమ ఆనందః' (బృ. 4-3-32) అది అతనికి బ్రహ్మలోకము, పరమగతి, పరమసంపద, పరమలోకము, పరమానందము, 'సుషుప్తౌ కేవల పరమేశ్వర సంబంధినీ బుద్ధిర్భవతి, నిత్యబోధ స్వరూపాభవతి' (ధ్యానబిందు. 94) సుషుప్తిలో బుద్ధి కేవలము

పరమేశ్వర సంబంధము నొందియుండును. అది నిత్యబోధ స్వరూపమును బొందును అని కొన్ని యుపనిషత్తులు తెలుపును. ఆనందశబ్దమున 'ఆనందం నామ, సుఖచైతన్య స్వరూపోఽపరిమితానంద సముద్రోఽవశిష్ట సుఖస్వరూపశ్చానంద ఇత్యుచ్యతే' (సర్వసార) సుఖచైతన్య స్వరూపమై అపరిమితానంద సముద్రమగ్నమై సుఖస్వరూపమై యొప్పారుట ఆనంద మన బడును. అట్టి ఆనందమయుడు తమోగుణవిశిష్టత్వము నొందుట దుర్లభము. అయిన సమన్వయ విధానమెట్లు? పై యుపనిషద్భావములు దోషయుక్తములా? కానేరవు. సమాధానమును గొన్ని యుపనిషత్తులే యొసంగియున్నవి. 'మకార స్తమో ద్యౌర్లోకః పరమాత్మ జ్ఞానశక్తిః' (కాలాగ్నిరుద్ర) మకారము తమోరూపము, ద్యులోకము, పరమాత్మయొక్క జ్ఞానశక్తి అని నిద్రాస్థితుడైన ఈశ్వరుని ద్యులోకవర్తిగను, బరమాత్మ యొక్క జ్ఞానశక్తిగ నుపనిషత్తు యొనర్చియున్నది. అట్లే కైవల్యోపనిషత్తుగూడ, 'సుషుప్తికాలే సకలే విలీనే తమోభిభూత స్సుఖరూప మేతి' (13) జీవుడు సుషుప్తికాలమున సర్వము లయమొందగా అజ్ఞానముచే నావరింపబడి సుఖము బొందుచున్నాడు అని వచించియున్నది. అనగా సుషుప్తిగత ప్రాజ్ఞుడు సుఖస్వరూపుడై ఆనందమయుడై యుండియు గ్రహింపజాలని స్థితిలో నుండుటచే దమోగుణవిశిష్టత్వము అతనికి గలిగినది గాని, యథార్థమున నతడు తురీయమునకు సన్నిహితుడు గాన, జాగ్రత్తులోవలె దీర్ఘవస్థూలరూప అన్యథాజ్ఞానమును గాని, స్వప్నగతమైన సూక్ష్మ అన్యథా జ్ఞానముగాని నొందక, వాడు సూక్ష్మాతి సూక్ష్మకారణమైయున్న అజ్ఞానముచే నావ

రింపబడి యుండినట్లు తాత్పర్యము. అతడు ఆనందమయుడై సుఖస్వరూపుడై యుండుటచేతను, దరీయుడైన బ్రహ్మమునకు సన్నిహితుడుగ నుండుటచేతను, అతడు జ్ఞానేచ్ఛాక్రియా శక్తులలో, కారణమైన జ్ఞానశక్తిగ నుండుటచేతను, అస్థూల సూక్ష్మమాయాపరివృతుడై మాత్ర ముండుటచేతను, శుద్ధుడై అచంచలుడై 'సత్త్వాత్ సంజాయతే జ్ఞానం' అనునట్లు జ్ఞానసన్నిహితమైన సత్త్వగుణప్రధానుడే యని తాత్పర్యము. అందుచే స్థితికారణుడై జీవపోషణభారమును వహించు విష్ణువునకు ఇచ్ఛాశక్తిప్రధానమై కార్యోన్ముఖమైన రజోగుణము ఉచితము. అదేవిధముగ జీవుల బరబ్రహ్మమునకు అన్యథాజ్ఞానముద్వారమున దూరమునకు గొంపోయి సర్వవిధముల అహంకార మమకారముల ముంచి సుఖదుఃఖాదుల నిరికించిన బ్రహ్మ తామసగుణుడని వ్యక్తము. ఈవిషయ మింకను ముందుగ్రంథమున సందర్భోచితముగ రాగలదు, చూచెదముగాక.

పైవిధముగ మాండూక్యోపనిషత్తు ప్రత్యక్షాక్షరమగు ఓంకారమును గ్రహించి, అదియే సర్వముగ జిత్రించి, అనగా త్రికాలబద్ధమైన ఆబ్రహ్మస్తంభపర్యంత సృష్టిని, త్రికాలాతీతమైన నిర్గుణ నిరాకారబ్రహ్మమునుగా రూపొందించి, అదియే బ్రహ్మముగా దెలియ, ఆబ్రహ్మము ఆత్మేతరము గాదనుచు, బ్రహ్మము పరోక్షమై యింద్రియాతీతమై యుండుటచే బ్రత్యక్షమైన స్థూలసూక్ష్మకారణ శరీరత్రయ విశిష్టమైన యీ ఆత్మను బ్రదర్శించి, అదియే పూర్వోక్త బ్రహ్మముగ మహావాక్యము ద్వారమున ఉపదేశించి, అది మననవాక్యమగుటచేత మనన విధానమునకై నిత్యానుభూతమైన అవస్థాదుల విమర్శించి,

ఓంకారమునగల చతుష్పాదములవలె నవస్థల ఆత్మపాదముల నన్వయించి మాండూక్య సాధనావిధానమైన మననపూర్వక వివేకమార్గమునకు నాందిని బాడియుండుట విదితము. ఇచట జాగ్రత్తులోని విశ్వవిరాట్టులు ప్రథమతః 'అయమాత్మా బ్రహ్మ' వాక్యమున వాచ్యార్థమై యొప్పార. స్వప్నావస్థగల తైజస హిరణ్యగర్భులు లక్ష్యార్థమై యుందురు. మరల వారు వాచ్యార్థమై యుండ, నిద్రావస్థగల ప్రాజ్ఞ ఈశ్వరులు వారికి లక్ష్యార్థములై వెల్గొందుదురు. అంత నా ప్రాజ్ఞేశ్వరులకు దురీయాత్మలు లక్ష్యములై క్రమన్యాయమున స్థూలమునుండి పర బ్రహ్మమునకు ఉపనిషత్తు సాధకుని గొంపోవుచున్నది. ఈవిధానము అత్యంత వివేకవంతమై బాహ్యోపకరణశూన్యమై యొప్పారుచు సామాన్యప్రజ్ఞునికి భయావహమై ఉత్తమునికి ప్రౌఢమార్గమై సుగమమై సులభమై యుండును. అందుచే సర్వేతరమార్గములకంటె నీమార్గము వక్రగమనముగాక, సూటిమార్గమై సరాసరి బ్రహ్మమునే జేర్చును గాన నతిముఖ్యమును ఉత్కృష్టమును అపేక్షణీయమునై యున్నది. అదెట్టిలో యిక జాగ్రదవస్థతో బ్రారంభించి గ్రహింప యత్నించెదము గాక.



# మాండూక్య మంత్రము

> జాగరితస్థానో బహిష్ప్రజ్ఞః సప్తాంగ
> ఏకోనవింశతిముఖః స్థూలభుగ్వైశ్వానరః
> ప్రథమః పాదః

జాగ్రదవస్థా స్థితుడగు వైశ్వానరుడు ప్రథమ పాదము. అతడు బాహ్యప్రజ్ఞగలిగి, సప్తాంగములను, పందొమ్మిది ముఖములను గలిగి స్థూలవస్తువుల అనుభవమును గలిగియుండును.

'జాగ్రన్నిద్రాంతః పరిజ్ఞానేన బ్రహ్మవిద్భవతి' (మండల బ్రాహ్మణ. 2-3) జాగ్రదవస్థనుండి నిద్రావస్థవరకు గల విషయ పరిజ్ఞానమువలన సాధకుడు బ్రహ్మవిదుడు కాగలడు అనుటచే ప్రథమతః జాగ్రత్తును గూర్చిన మీమాంస ప్రారంభము. ప్రణవాత్మకముగ 'అకారే జాగ్రద్విశ్వః' (పరమహంస పరివ్రాజక) 'అకారమాత్రం విశ్వః స్యాత్' (అక్షి. 44) 'పూర్వస్యామాత్రా జాగర్తి' (అథర్వశిఖ. 3) 'అకారో జాగ్రతి' (యోగచూడామణి.) 'అకారస్థూలాంశే జాగ్రద్విశ్వః' (వరాహ. 4-1) అను ఉపనిషద్వాక్యములరీతి అకార స్థానము జాగ్రత్తువ కన్వయము. అది ప్రథమము. 'స ఏవ మాయాపరిమోహితాత్మా శరీరమాస్థాయ కరోతి సర్వం। స్త్రీయన్నపానాది విచిత్రభోగైః స ఏవ జాగ్రత్పరితృప్తి మేతి॥' (కైవల్య. 12) పూర్వోక్తచందము.ఆపరమాత్మయే మాయచే మోహింపబడి అంతఃకరణమునుగలవాడై శరీరస్థుడై సర్వకార్యముల నాచరించును. వాడే జాగ్రదవస్థయందు అన్నపానాది విచిత్రభోగములచే తృప్తినొందుచున్నాడు. 'తత్తద్దేవతాగ్రహాన్వితైః శ్రోత్రాది జ్ఞానేంద్రియైః శబ్దాద్యర్థవిషయ గ్రహణ

జ్ఞానం జాగ్రదవస్థాభవతి' ఆదేవత శ్రోత్రాది జ్ఞానేంద్రియ ముల గ్రహించి, తదర్థములైన శబ్దాదుల జ్ఞానము నార్జించుట జాగ్రదవస్థ యగును. 'తత్ర భ్రూమధ్యం గతో జీవ ఆపాద మస్తకం వ్యాప్య కృషి శ్రవణా ద్యఖిలక్రియా,కర్తా భవతి' అచట జీవుడు భ్రూమధ్యస్థుడై శరీరమునంతటి నావరించి, సర్వ కర్మల కర్తయగును. 'తత్తత్ఫలభుక్ చ భవతి లోకాంతర గతః కర్మార్జితఫలం స ఏవ భుంక్తే' (2) ఆయాఫలితముల భోక్తయగును. మరియు లోకాంతరముల గర్మార్జిత ఫలముల గూడ నతడే బొందును అని పైంగలోపనిషత్తు జాగ్రదవస్థను వర్ణించును. 'జాగ్రతి ప్రవృత్తో జీవః ప్రవృత్తిమార్గాసక్తః। పాపఫల నరకాది మాంస్తు, శుభకర్మఫల స్వర్గఫల మస్త్వితి కాంక్షతే'(2-4)జాగ్రత్ప్రవృత్తినున్న జీవుడు ప్రవృత్తిమార్గాను సక్తుడై నరకాది పాపఫలములను, స్వర్గాదిపుణ్యఫలములను గోరుచుండును అని మండల బ్రాహ్మణము తెలుపును. 'విజ్ఞా నాత్మా చిదాభాసో విశ్వో వ్యావహారికో జాగ్రత్ స్థూలదేహాభి మానీ కర్మభూరితి చ విశ్వస్య నామ భవతి' (2) విజ్ఞానాత్ముడై చిదాభాసుడైన విశ్వుడు వ్యావహారికుడై స్థూలదేహాభిమాన కర్మరతుడగును. అతనికి విశ్వుడని నామము అని పైంగలము గూడ వచించుచున్నది.

'చతుష్పాదంతర్వర్తినో ఽంతర్జీవబ్రహ్మణశ్చత్వారి స్థానాని నాభి హృదయ కంఠ మూర్ధసు జాగ్రత్స్వప్న...' (పర బ్రహ్మ. 1) నాలుగుపాదములయం దంతర్వర్తియైన బ్రహ్మము నకు స్థానములు నాలుగు గలవు. అవి నాభి హృదయ కంఠ శిరములు, 'బ్రహ్మాణం నాభౌ' (నృ. ఉ. 2) 'నాభిస్థానే స్థితం

విశ్వం' (బ్రహ్మవిద్య. 15) 'నాభి కందాత్సమారభ్య యావత్ హృదయగోచరం । జాగ్రద్వృత్తిం విజానీయాత్' (త్రిశిఖ బ్రాహ్మణ. 148) నాభినుండి హృదయమువరకు గోచరించు వానిని జాగ్రద్వృత్తియని ఎరుంగవలెను అని కొన్ని ఉపనిషత్తులు విశ్వునికి నాభిస్థానము నొసంగియున్నవి. 'బ్రహ్మణో హృదయ స్థానం' (బ్రహ్మవిద్య. 41) అనియు గలదు. కాని స్థూలసృష్టి ననుభవింప స్థూలేంద్రియములే యుపయుక్తములు గాన, వానిలోనైనను ముఖ్యమైన శిరస్థ నేత్రేంద్రియముగాన, 'అకారో జాగ్రతి నేత్రే వర్తతే సర్వ జంతుషు' (యో. చూ. 74) 'నేత్రస్థం జాగరితం' (నా.ప. 5-1) 'నేత్రస్థం జాగరితం విద్యాత్' (బ్రహ్మ. 24) 'జాగ్రన్నేత్రద్వయోర్మధ్యే హంస ఏవ ప్రకాశతే' (యో. చూ. 82) 'దక్షిణాక్షిముఖే విశ్వో...' (మాం. కా. 1-2) మొదలగు మంత్రములు విశ్వునికి నేత్రము స్థానముగ గ్రహించుటయు గలదు. 'సర్వత్ర వర్తతే జాగ్రత్' (త్రిశిఖబ్రాహ్మణ. 15) అని వచింపబడియున్నను, నేత్రమే జాగ్రత్తునకు ముఖ్యస్థానముగ గ్రాహ్యము. అనగా బుద్ధీంద్రియములే దానికి స్థానమని తాత్పర్యము.

అట్లు నేత్రాదీంద్రియ విశిష్టుడగుటచే విశ్వుడు 'బహిః ప్రజ్ఞః' అనబడెను. దానినే 'స్థూలప్రజ్ఞః' అని నృసింహోత్తరతాపిని, 'జాగరితః స్థూలః స్థూలప్రజ్ఞో హి విశ్వభుక్' (8-7) జాగ్రత్తు స్థూలము. విశ్వభోక్త స్థూలప్రజ్ఞుడే యని నారదపరివ్రాజకము తెలుపును. బాహ్యము స్థూలమనుట సహజమే గదా! యోగచూడామణికూడ 'విరాడ్విశ్వః స్థూలశ్చాకారః' (77) విరాడ్విశ్వులకు స్థూలాకారము అని వాకొనినది.

స్థూలమైన వానికి సహజముగ 'స్థూలం తర్పయతే విశ్వం' (మాం. కా. 1-4) అనురీతి స్థూలపదార్థములే తృప్తిసొసంగును. కాన నితడు 'విశ్వో హి స్థూలభుక్ నిత్యం' (మాం. కా. 1-3, యో. చూ. 73) 'స్థూలత్వాత్ స్థూలభుక్త్వాచ్చ' (నృ. ఉ. తా. 1, నా. వ. 8-6) 'శబ్దాదీన్విషయాన్ స్థూలాన్యదోపలభతే తదాత్మనో జాగరణం' (సర్వసార) శబ్దాదివిషయముల నెప్పుడు గ్రహించుచున్నాడో అప్పుడు ఆత్మకు జాగ్రదవస్థ అనురీతి స్థూలవిషయభోక్తయగుచున్నాడు.

ఈ అనుభవకార్యమునకై అతనికి 'ఏకోనవింశతి ముఖ' ములు చెప్పబడియున్నవి. 'మన ఆది చతుర్దశ కరణైః' అనుచు జ్ఞానేంద్రియ దశకముతో అంతఃకరణచతుష్టయమును జేర్చి చతుర్దశకరణములుగ సర్వసార చిత్రింప, 'జ్ఞానేంద్రియ కర్మేంద్రియాంతఃకరణ చతుష్టయం చతుర్దశకరణయుక్తం జాగ్రత్' (5) అనుచు శారీరకోపనిషత్తు దాని వివరించినది. కాని వానికి బంచవాయువులగూడ మేళవించి 'జ్ఞానకర్మేంద్రియైః జ్ఞానవిషయైః ప్రాణాది పంచవాయు మనోబుద్ధిచిత్తాహంకారైః స్థూలకల్పితైః సోఽపి స్థూలప్రకృతి రిత్యుచ్యతే' (యో. చూ. 72) జ్ఞానవిషయములగు జ్ఞానకర్మేంద్రియములతోడను, స్థూలకల్పితములగు ప్రాణాది పంచవాయు మనోబుద్ధిచిత్తాహంకారములతోడను గలసినది స్థూలప్రకృతి యనుబడును అనురీతి పందొమ్మిది అనుభవమార్గముల నిట ఉపనిషత్తుపొందుబరచినది. ముఖములనగా ఉపలబ్ధికి ద్వారములని పేరు. అనగా వీనిద్వారమున విశ్వుడు స్థూలవస్తుచయదర్శన మార్గమున అనుభవమును గడించుచున్నాడు.

ఇట్టి అనుభవము గడింప నతనికి 'సప్తాంగ' ములు కూర్పబడియున్నవి. ఈ వైశ్వానరునకు ద్యులోకము శిరము, సూర్యుడు నేత్రము, వాయువు ప్రాణము, ఆకాశము దేహము, జలము మూత్రస్థానము, పృథివి పాదములు, ఆహవనీయాగ్ని ముఖముగ ఛాందోగ్యము వివరించును. (5-12-1) అనగ బంచమహాభూతములు ద్యులోక సూర్యులుగలసి సప్తాంగ ములుగ నీవైశ్వానరున కేర్పడుచున్నవి. ఈ విధముగ మనస్సుచే యోచింపబడదగు ద్యులోకపర్యంతసృష్టి అంతయు వైశ్వానర స్వరూపమని తాత్పర్యము.

ఈతని 'విశ్వే చ తే నరాశ్చ విశ్వానరాః। విశ్వాన్ నరాన్ భోక్తృత్వేన వ్యవస్థితాన్ ప్రతి అనేకధా ధర్మాధర్మ కర్మానుసారేణ సుఖదుఃఖాది ప్రాపణాదయం కర్మఫలదాతా వైశ్వానర శబ్దతో భవతి' సుఖదుఃఖాదికము ననుభవించుటకు భోక్తలుగ నేతెంచిన సకలజీవుల వివిధధర్మ కర్మల ననుసరించి సుఖదుఃఖాదికము బొందించు కర్మఫలదాత వైశ్వానరు డనం బడును. మరియు 'విశ్వశ్చాసౌ నరశ్చ విశ్వానరః, స ఏవ వైశ్వానరః సర్వపిండాత్మా' నరసమూహమంతయు విశ్వానర మనంబడును. విశ్వానరుడే వైశ్వానరుడు. అతడే సర్వ పిండాత్మయగు సమష్టిరూపుడైన విరాట్టు. ఈ నిర్వచనములు సమష్టిస్వరూపునికి అన్వయించియున్నవి. కాని యీమంత్రమున గల వైశ్వానరుడు వ్యష్టిరూపుడై విశ్వు డనబడుచున్నాడు. అనగ స్థూలమైన విశ్వము ననుభవించు వాడగుటచే విశ్వుడని వచించుట యుక్తము.

ఇచట ప్రథమపాదము అనుటచే నితరపాదములకంటె నిది ప్రథమజనితముగగాక, జాగ్రదావస్థనుండియే యితర అవస్థల గ్రహించుకొనుటకు సాధ్యమగుచుండుట కారణముగ నతనికి ప్రథమస్థానము లభించెను. అంతమాత్రమున నది స్వప్నాదిత్రయముకంటె శ్రేష్ఠమనిగాని అగ్రజమనిగాని భావింప రాదు. యథార్థమున క్రమత్వము ననుసరించినచో, దురీయ మనబడు తటస్థపాదము ప్రథమమును ఉత్తమమును అయి యుండవలెను. అందు అనిర్వాచనీయవిధానమున మాయచే అజ్ఞానము ఆరోపింపబడి బ్రజ్ఞానఘనుడై ఆనందపాదమగుచు ద్వితీయపాదముగ నగుచున్నాడు. అంత నా అజ్ఞానము అన్యథాజ్ఞానరూపమునుదాల్చి సంస్కారమై ఉద్భూతమై, సువిద్యానామమున దృతీయ పాద మగుచున్నాడు. అట నా అన్యథాజ్ఞానము స్థూలమై జాగ్రత్తుగ మారి అవిద్యా పాదమగుటచే నిది చతుర్థపాదముగనుండుట ఉచితము. కాని సాధకుడు ప్రథమతః దీనియందుండి తటస్థపాదమున కెగబ్రాక వలసియుండుటచేతను, అతనికి యీపాదము సన్నిహితమై నిత్యానుభవసిద్ధమై యుండుటచేతను, బూర్వోక్తరీతి నిదియే సాధనరంగపాదమై దీనిద్వారమున అన్యములు వ్యక్తమగుటచే దీనికి శాస్త్రము ప్రథమపాదముగ నామకరణ మొసంగి యున్నది.

పూర్వగ్రంథమున జాగ్రదధిష్ఠానదేవతవిషయము చర్చింప బడియున్నది. 'ప్రణవస్య వా పూర్వా మాత్రా పృథివ్యకారః స ఋగ్భిర్ ఋగ్వేదో బ్రహ్మా...ప్రథమపాదో భవతి'(నృ.పూ. 2-1; అథర్వశిఖ) ప్రణవముయొక్క ప్రథమమాత్ర పృథివీ

అకారము అయి ఋగ్వేద బ్రహ్మ లగుచున్నది అని అకార స్థానమున, విశ్వస్థానమున బ్రహ్మ బ్రహ్మపరముగ నన్వయమని బూర్వము వినియున్నాము. 'సర్వాణి బృంహాయతీతి బ్రహ్మ' (అథర్వశిఖ) సకలప్రాణులను మరల సృజించుటచేత బ్రహ్మ అని వ్యుత్పత్తి. 'ధాతా చ సృష్టౌ' (యో. చూ. 72) అతని కార్యము సృష్టియనియు విదితము. ఈ విషయమును బ్రహ్మ విద్య 72, నృసింహోత్తరతాపినీ 3, ధ్యానబిందు 10, మొదలైన యుపనిషత్తులు వాకొనియున్నవి. అంత గొన్ని ఉపనిషత్తులు 'బ్రహ్మాణం రక్తగౌరాభం' (ధ్యానబిందు. 31) 'పద్మాసనస్థః రక్తాంగీ'(శాండిల్యా. 1-6)యనుచు అభివర్ణించుచు, నాబ్రహ్మకు 'రజోగుణప్రధానై' (త్రి.మ. నా. 6) 'అకారో రాజసో రక్తో బ్రహ్మ చేతన ఉచ్యతే' (యో. చూ. 75) 'అకారః పీతవర్ణః స్యాద్రజోగుణ ఉదీరితః' (ధ్యానబిందు. 12) 'ప్రథమా రక్తా పితామహ ద్బ్రహ్మదైవత్యా'(అథర్వశిఖ) 'రాజసమాయాత్మికో బ్రహ్మ' (పాశుపతబ్రహ్మ. 1) 'బ్రహ్మణి రాజసే' (కృష్ణ) మొదలగు వాక్యములు బ్రహ్మనుగూర్చి రక్తవర్ణునిగను, రాజస గుణోపేతునిగను వర్ణించియుండుట విదితము. కాని పూర్వము మనముగ్రహించి యున్నట్లు అవిద్యాపాదవిశిష్టుడైన, అన్యథా జ్ఞానప్రపూరితుడైయున్న చతుర్ముఖునికి దమోగుణమునే అన్వ యించుట ఉచితమని తోచెడిని. స్థూలత్వకార్యత్వాదిలక్షణ ములు సృష్ట్యాదికప్రవృత్తులు, తమోలక్షణములేగదా! మరియు రక్తపీతముల బ్రస్తావన గార్హస్థ్యమునగల పసుపుకుంకుమలవలె సంసారప్రవర్ధకములుమాత్రమే అయి, తురీయవిదూరములు గదా! అట్టి ప్రవృత్తికిరక్తవర్ణము బాహ్యతః ఉచితమే యగు

చున్నది. కాని గుణలక్షణముల ననుసరించి వర్ణము నన్వయించుచో జతుర్ముఖునికి రజోగుణప్రధానముగాన కృష్ణవర్ణమే సహజమగును.



## నాలుగవ మంత్రము

స్వప్నస్థానోఽన్తః ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతి ముఖః
ప్రవివిక్తభుక్ తైజసో ద్వితీయః పాదః

స్వప్నస్థానుడును, అంతః ప్రజ్ఞుడును సప్తాంగుడును ఏకోనవింశతిముఖుడును సూక్ష్మభోక్తయునైన తైజసుడు ద్వితీయపాదము.

'ద్వితీయా మాత్రా స్వప్నం' (అథర్వశిఖ) 'ద్వితీయాంతరిక్షం స ఉకారః' (అథర్వశిఖ, నృ. పూ. 2-1) అను చందముగ ఓంకారము ద్వితీయమాత్రయైన ఉకారము ననుసరించి అవస్థాదుల స్వప్నము, జీవులలో తైజసుడు, దేవతలలో విష్ణువు ద్వితీయస్థానమున వర్ణితము. జాగ్రన్నిద్రాదులకు నిది 'సంధ్యావస్థ' అనియు, 'తస్య వా ఏతస్య పురుషస్య ద్వే ఏవ స్థానే భవత ఇదం చ పరలోక స్థానం చ; సంధ్యం తృతీయం స్వప్నస్థానం' ( బృ. 4-3-9 ) ఇహపరము లనెడు లోకములు రెండు పురుషునకు గలవు. స్వప్నస్థానము తృతీయమై రెండింటి మధ్య భాసిల్లును అని బృహదారణ్యకము తెలుపుచున్నది. ఇచట జాగ్రత్తులోని స్థూలేంద్రియాది స్థూలవిషయములుగాని, సుషుప్తిలోని అనిర్వచనీయ నిర్వికార

త్వముగాని లేక, 'యథా విద్య స్తథా స్మృతిః' (మాం. కా. 2-16) ఎట్లు జ్ఞానమో తదనుగుణ స్మృతి యను నట్లు పూర్వస్మృతిబద్ధానుభవములలో మునిగియుండుటయే స్వప్నావస్థయగుచున్నది. కాని అట జీవుడు 'అంతఃకరణ చతుష్టయ సంయుక్తః స్వప్నః' (శారీరక) అనునట్లును. 'తద్వా సనాసహితైఃచతుర్దశకరణైఃశబ్దాద్యభావేఽపి వాసనామయాఞ్ శబ్దాదీన్ స్తాత్కాలికాన్ ప్రతిభాసమానా న్యదోపలభతే తదా స్వప్నం' (సర్వసార) శబ్దాదివిషయము లభావమైనను, తత్కాలమునందు గలిగియున్న వాసనామయమైన శబ్దాది కమును జాగ్రదవస్థయొక్క వాసనతో గూడియున్న చతుర్దశ కరణములచేత గ్రహించుట స్వప్నమనంబడును అనురీతిస్థూలాను భవములు లేక, స్థూలేంద్రియరహిత, ప్రవృత్తుల మహిమచే నింద్రియదశకముతో గూడిన అంతఃకరణ చతుష్టయ బలమున వాసనాదృశ్యముల గల్పించి, స్వప్నమున 'స్వప్నే తు జీవ స్సుఖదుఃఖ భోక్తా' (కైవల్య. 12) అనునట్లు సుఖదుఃఖభోక్త యగుచున్నాడు. 'సూక్ష్మనాడీషు సంచరో బుద్ధేః స్వప్నః ప్రజా యతే' (వరాహ. 2-61) సూక్ష్మనాడుల సంచరించు బుద్ధికి స్వప్నము గలుగుచున్నదని వ్యక్తము. అనగా నదియే కారణము. 'అత్రైష దేవః స్వప్నే మహిమానమనుభవతి। యత్ దృష్టందృష్ట మనుపశ్యతి, శ్రుతం శ్రుతమేవార్థ మనుశృణోతి దేశదిగం తరైశ్చ ప్రత్యనుభూతం పునఃపునః ప్రత్యనుభవతి దృష్టం చాదృష్టం చ శ్రుతం చాశ్రుతంచానుభూతం చాననుభూతం చ సచ్చాసచ్చ సర్వం పశ్యతి' (ప్రశ్న. 4-5) అంత నామనస్సు స్వప్నములో మహిమ ననుభవించును. చూచినదాని జూచుట,

వినిన విషయముల మరలవినుట, దేశాంతరముల బూర్వమనుభ వించినవాని ననుభవించుట జరుగును. ఈజన్మలో గోచరములు అగోచరములైన పూర్వజన్మానుభూతులు శ్రుతాశ్రుతములు, భోగ్యాభోగ్యములు, అన్నియు నతనిచే గాంచబడును. 'తస్మిన్ సంధ్యే స్థానే తిష్ఠన్నేతే ఉభే స్థానే పశ్యతి ఇదం చ పరలోక స్థానం చ। అథ యథాక్రమోఽయం పరలోకస్థానే భవతి తమాక్రమమాక్రమ్యోభయాన్పాప్మన ఆనందాంశ్చ పశ్యతి; స యత్ర ప్రస్వపితి, అస్య లోకస్య సర్వావతో మాత్రా మపాదాయ స్వయం విహత్య, స్వయం నిర్మాయ, స్వేన భాసా స్వేన జ్యోతిషా ప్రస్వపితి; అత్రాయం పురుషః స్వయం జ్యోతి ర్భవతి' (బృ. 4-3-9) ఆలోకద్వయ సంధిలో నుండి జీవుడు ఇహపరముల రెండింటిని గలయజూచును. పరమున కవసరమైన పరికరముల గ్రహించి, అందలి సుఖదుఃఖముల గాంచును స్వప్నమున, జాగ్రద్వాసనల గొన్నింటి గైకొని, స్థూలశరీర మును బ్రక్కనుంచి, స్వప్నశరీరమును గల్పించుకొని, స్వ ప్రకాశమున బ్రకాశించుచు స్వప్నము ననుభవించును. ఆయవ స్థలో జీవుడు జ్యోతిరూపుడేయగును. 'స సార్వభౌమవ ద్వ్యవ హారాచ్ఛ్రాంతోఽంతర్భవనం ప్రవేష్టుం మార్గమాశ్రిత్య తిష్ఠతి। కరణోపరమే జాగ్రత్సంస్కారోత్థ ప్రబోధవద్ గ్రాహ్యగ్రాహక రూపస్ఫురణం స్వప్నావస్థా భవతి। తత్ర విశ్వ ఏవ జాగ్రద్ వ్యవహారలోపా న్నాడీమధ్యం చరం స్తైజసత్వమవాప్య వాసన రూపకం జగద్వైచిత్ర్యం స్వభాసాభాసయన్యథేప్సితం స్వయం భుంక్తే' (పైంగల. 2) జీవుడు సార్వభౌముని చందము వ్యవ హారములవలన అలసి, అంతఃపురమును బ్రవేశింప మార్గమున

నుండును. కరణములన్నియు ఉపరమింప, జాగ్రత్తులోని సంస్కారములు ప్రబోధితములై దృగ్దృశ్యములై స్వప్నావస్థ గలుగును. అచట విశ్వుడే జాగ్రద్వ్యవహారము లేకుండుటచే, నాడీమధ్యమున దిరుగుచు, తైజసత్వమును బొంది, వాసనా రూపమైన జగత్తుయొక్క వైచిత్ర్యమును ఇష్టప్రకారము స్వయముగ ననుభవించును. 'తదు తేవ మహారాజో భవతి, ఉతేవ మహాబ్రాహ్మణః ఉతేవోచ్చావచం నిగచ్ఛతి; స యథా మహారాజో జానపదాన్ గృహీత్వా స్వే జనపదే యథా కామం పరివర్తేత, ఏవమేవైష ఏతత్ప్రాణాన్ గృహీత్వా స్వే శరీరే యథా కామం పరివర్తతే' (బృ. 2-1-18) అచ్చట జీవుడు మహారాజుగనో బ్రాహ్మణోత్తముడుగనో అయినట్లుండి తదనుగుణ హెచ్చుతగ్గుల ననుభవించును. మహారాజు ప్రజల గొని తన రాజ్యమున యథేచ్ఛగా సంచరించు నటుల, ప్రాణాది అంతరింద్రియముల గ్రహించి తన శరీరములో నతడు యథాకామముగా పరివర్తించును. 'స్వప్నేన శరీరమభిప్రహత్యా సుప్తః సుప్తా నభిచాకశీతి । శుక్రమాదాయ పునరైతి స్థానం హిరణ్మయః పురుషః ఏకహంసః॥' (బృ. 4-3-11) ఏకుడైదిరుగు హిరణ్మయపురుషుడు, స్వప్నములో జాగ్రత్ శరీరమును ప్రక్క నుంచి, తాను జాగ్రతి వహించి, ప్రకాశమైన యింద్రియ ప్రవృత్తుల వెంటగొని సుప్తుల దిలకించును. మరల జాగ్రతకు అరుదెంచును. ఇటుల స్వప్నగతానుభవములు ఉపనిషత్తులచే వర్ణింపబడియున్నవి.

అనగ 'గ్రహణాజ్జాగరితవత్తద్ధేతుః స్వప్న ఇష్యతే । తద్ధేతుత్వాత్తు తస్యైవ స జ్జాగరిత మిష్యతే॥' (మాం. కా.

4—37) స్వప్నమున గ్రహణము జాగ్రదనుభవమువలె నుండు టచే స్వప్నానుభూతుల జాగ్రత్కార్యములుగ భావనము గలదు. అందుచే జాగ్రదనుభవములు స్వప్నస్థునికి సత్యములవలె భాసించును అని కారిక. అనగ నిచట స్వప్నదృశ్యముల యొక్కయు జాగ్రదవస్థయొక్కయు సత్యాసత్యత్వములు విచారింపబడియున్నవి. ఆవిషయము ముందు గ్రహించెదము గాక! కాని జాగ్రత్తులోవలె 'స్వప్నే తు జీవ స్సుఖదుఃఖ భోక్తా' (కైవల్య. 12) స్వప్నములో జీవుడు సుఖదుఃఖభోక్త యగుచున్నాడు. కాని పూర్వోక్తవిధానమున బాహ్యకరణముల నుపయోగింపక నీతడు కేవలము అంతఃకరణముద్వార స్వకల్పిత సూక్ష్మేంద్రియములద్వార అనుభవించు చుండుట సిద్ధము. కావున నితని 'అంతః ప్రజ్ఞః' అని సర్వోపనిషత్తులు ఏకగ్రీవముగ పలికియున్నవి. ఆస్థితిని 'సూక్ష్మ ప్రజ్ఞః' అనుచు నృసింహోత్తరతాపిని విశ్వునియొక్క స్థూలప్రజ్ఞతో బోల్చుట ఉచితమేయగును.

ఇతనికి విశ్వునికివోలె నడే సప్తాంగములును ఏకోనవింశతి ముఖములుగూడ విరాజిల్లును. కాని విశ్వుని ముఖాంగములు బాహ్యప్రవృత్తములై, స్థూలములై స్థూలవిషయగ్రహణము గావింప. నీతైజసుని అంగముఖాదికములు కేవలము అంతరములై, సుసూక్ష్మములై ప్రవృత్తిరూపములుగ మాత్రిముండును. అనగ వాని కెట్టి స్థౌల్యమును లేక, అంతఃప్రవృత్తములై యుండును. జాగ్రదవస్థలోని వ్యావహారికలోకము ననుభవింప దత్సమసత్తనుగల వ్యావహారికేంద్రియము లవసరమగుచున్నవి. ఆ వ్యావహారిక మంతయు నీశ్వరకల్పితము.

అందుచే నీవ్యవహారము స్థూలము. కాని స్వప్నావస్థగల దృగ్దృశ్యము లన్నియు జీవకల్పితములు, ప్రాతిభాసికము లన బడును. వానికి వ్యావహారికసత్తా లేకుండుటచే వానితో వ్యావహారి కేంద్రియ సంబంధము కానఅతయు నుండజాలదు. వ్యావహారి కేంద్రియాదులయొక్క ప్రవృత్తులే కారణములైె సంస్కారములకు మూర్తిమత్వము నొసంగిన మనస్సు, సర్వ కర్తయై దృగ్దృశ్యములు రెండును తానే యగుచు అచట అనుభవకారణ మగుచున్నది. అనగా మనస్సు తనలో గల సంస్కారసహాయమున నీదృశ్యముల 'స్వమాయయా కల్పిత విశ్వలోకే' (కైవల్య. 12) తనమాయచే గల్పింపబడిన లోక ముల ననుభవించుచున్నదని తాత్పర్యము. కావున అనుభవ మున కుపకరణములైయున్న అంగకరణాదు లన్నియు విశ్వునికి వలె తైజసునకుగూడ గలుగుచున్నవి. అందుచేత అనగ సూక్ష్మేంద్రియములద్వార అస్థూలవిషయానుభవము నతడు గావించు చుండుటచేత నతనిని 'ప్రవివిక్త భుక్' అనియు, 'సూక్ష్మ భుక్' (నా. ప. 8-10, నృ. ఉ. 1) 'తైజసః సూక్ష్మశ్చ' (యో.చూ. 75) మొదఃగురీతుల శ్రుతులు దెలిపి యున్నవి. 'ప్రవివిక్తం తు తైజసః' (మాం. కా. 1-4) 'తైజసః ప్రవివిక్త భుక్' (మాం. కా. 1-3) అనియు కారిక.

పైవిధముగ సర్వమును 'స్వమాయయా' కల్పించు కొని, పార్శ్వములగల జాగ్రన్నిద్రావస్థల దిలకించుచు, సంధి నుండుచు, సంస్కారమూలమున జాగ్రత్తును, అస్థూలత్వమున సుషుప్తిని గ్రహించుచునుండు యీ సూక్ష్మప్రజ్ఞాశక్తిని తైజస నామమున ఉపనిషత్తులు వ్యవహరించెను. 'ఈశాజ్ఞయా

సూత్రాత్మా వ్యష్టి సూక్ష్మ శరీరం ప్రవిశ్య మన అధిష్ఠాయ తైజసత్వ మగమత్ । తైజసః ప్రాతిభాసికః స్వప్నకల్పిత ఇతి తైజసస్య నామ భవతి॥' (పైంగల. 2) ఈశాజ్ఞచే ఆత్మ వ్యష్టి శరీరమును ప్రవేశించి, మనస్సు నధిష్ఠించి, తైజసత్వమును బొందును. ఆ తైజసుడు ప్రాతిభాసికుడు కల్పితుడు కాన తైజసుడు అని నామము గలదు. చంద్రాంశమైన మనస్సునే తన రూపముగా గలిగి, 'అంతఃప్రజ్ఞస్తు తైజసః' 'మనస్యంతస్తు తైజసః' (మాం.కా. 1-1,2) అని వ్యవహరింపబడిన యీతడు కేవలము 'ఉకార శ్చంద్ర సంకాశః' (బ్రహ్మవిద్యా. 10) అను చందము తేజోమూర్తియై యొప్పారుటచే తైజసు డన బడుటయు సముచితమే. అత డచట 'స్వయంజ్యోతి' (బృ. 4-3-14), 'పరంజ్యోతి' (పరబ్రహ్మ), 'విద్యుమతి' (అథర్వశిఖ) అని పిలువబడియున్నాడు. అవును, తన అపూర్వశక్తి సామర్థ్యములతో, అనగ జాగ్రదవస్థలో నభావమైన శక్తి సంపన్నతతో నతడు సృష్టి స్థితి లయకర్త అగు బ్రహ్మ విష్ణు మహేశ్వరుల శక్తుల మూడింటిని గ్రహించి, తత్తుల్యముగ సృష్టిని గల్పించి, పోషించి, అనుభవించి, పిమ్మట ఉపసంహారము చేయుచుండుటచే నీ ద్వితీయపాద విశిష్టమూర్తి అపూర్వశక్తి యుక్తు డగుచున్నాడు. 'న తత్ర రథా న రథయోగా న పంథానో భవంతి; అథ రథాన్ రథయోగా న్పథః సృజతే; న తత్రానందా ముదః ప్రముదో భవంతి, అథానందాన్ ముదః ప్రముదః సృజతే;... స హి కర్తా' (బృ. 4-3-10) అచట రథ తురగ మార్గములు లేవు. వానిని అతడు సృజించెను. అచ్చట ఆనంద మోద ప్రమోదములు లేవు. వాని

నతడు కల్పించెను. అతడే కర్త అనిగదా ఉపనిషత్తు. ఈశక్తి యతని స్వభావజన్యమైనప్పటికిని, జాగ్రదవస్థలో నది స్థూల దేహేంద్రియాదులచే నావరింపబడి, విస్మరింపబడి అభావమ్ముగ నుండ, వానినుండి విడివడిన చిత్తము యిట తన శక్తిని స్మరించి, సృష్టి స్థితి సంహార ప్రవృత్త మగుచున్నది. మరల నీశక్తి సుషుప్తిలో అజ్ఞాతమై అవ్యక్తమై బీజరూపముదాల్చి అంతర్గత మగుచున్నది. కాన స్వప్నస్థపురుషుడు కొంతవరకు దన తురీయ లక్షణముల వ్యక్తము చేయుననియు ననవగును. అందుచే తేజశ్శాలి, తేజోవంతుడు, శక్తివంతుడు అను పర్యాయ పదములచే తైజసుడు అనంబడును. అది ఎంతయు సమంజసము. కాని ఆశక్తి కించిన్మాత్ర కాలవ్యవస్థితమై యుండి, జాగ్రత్సుషుప్తముల నంతరించి, 'వైతథ్యం సర్వభావానాం స్వప్న ఆహు ర్మనీషిణః' (మాం. కా. 2-1) స్వప్నదృశ్యములు దేహస్థములై పరిమితస్థలముల నుండుటచే మిథ్యలనియు ప్రాతిభాసికములనియు బండితులందురని కారికా వచనము.

ప్రాజ్ఞునిలోని ప్రజ్ఞానఘనమే సంస్కారరూపమై, అది తైజసునికి సూక్ష్మరూపమున స్వప్నస్థితిదాల్చి, క్రమమున నది విశ్వునికి స్థూలరూపమున జాగ్రత్తును గల్పించుచున్నది. కాన విశ్వతైజసులు ప్రథమతః కార్యరూపులై,తర్వాత గార్యకారణ పరంపరకు ఉత్తరోత్తరమూలముగ గార్యకారణము లగు చుండుట విదితము. ఆవిషయమున నిర్వాదు సమానులే. మరియు 'అదీర్ఘత్వాచ్చ కాలస్య గత్వా దేశాన్న పశ్యతి। ప్రతిబుద్ధశ్చ వై సర్వస్తస్మిన్ దేశే న విద్యతే॥' (మాం. కా. 2-2) అల్ప కాలమున స్వప్నపురుషుడు దేహాంతరము నరిగి దృశ్యముల

ననుభవించుట దుర్లభము. ప్రబుద్ధుడైనప్పుడు అతడు దేశాంతరమున లేడు. అంతియగాక 'న తత్ర రథా న రథయోగా' (బృ. 4-3-10) అనుకీతి నట దృశ్యము లభావములు, మిథ్యాస్వరూపములుగదా అని విమర్శించి చూచినను, 'స్వప్నజాగరితస్థానే హ్యేక మాహు ర్మనీషిణః । భేదానాం హి సమత్వేన ప్రసిద్ధేనైవ హేతునా॥' (మాం.కా. 2-5) పై కారణములచే స్వప్న జాగ్రితలు రెండును సమానమే అని బుద్ధిమంతులు వాకొందురు. ఎందుచేనన 'అంతఃస్థానాత్తు భేదానాం తస్మా జ్జాగరితే స్మృతం। యథా తత్ర తథా స్వప్నే సంవృతత్వేన భిద్యతే॥' (మాం.కా. 2-4) ఎట్లు స్వప్నదృశ్యములు మిథ్యలగుచున్నవో అట్లే, జాగ్రత్ దృశ్యములు అని చెప్పబడుచున్నవి. కాని స్వప్నగతము లంతరములు, జాగరితకులు సంవృతత్వములు మాత్రము. యథార్థదృష్టితో యోచించుచో రెండును అజ్ఞానకార్యములే గదా. కాని స్వప్నము అంతరము. బాహ్యము జాగ్రత్తు. కాని యీబాహ్యాంతర భేదము జాగ్రిదనుభూతి నున్నవానికి గోచరముగాని, నిష్పక్షపాతమున స్వప్నపురుషుని స్థానమునుండి యోచించుచో స్వప్నగతములుగూడ బాహ్యము లగుచున్నవి జాగ్రిదవస్థలోని శరీరమును బరిమాణముగ గొనినమాత్రమే స్వప్నము అంతరము. కాని యిట్టి మరియొకడు స్వప్నమున ఉండి తద్గత దృశ్యముల, దన యంతరమునగాక బాహ్యముననే అనుభవించుచుండుటచే నవి అతనికి బాహ్యములే యగుచున్నవి. అటులే దేశకాల వ్యవస్థలుగూడ పరిగణింపబడవలెను. స్వప్నదృశ్యముల నాయా దేశకాలములనుండి వ్యవహరింపక, ప్రస్తుతము

మనకు అనుభూతమైన జాగ్రత్తాదృష్టి యోచించుటచే నవి బహుస్వల్పములనో లెగానబడునుగాని, స్వప్న పురుషుని దృష్టిలో నచటగూడ విశాల నగరాదులు, అంతరాళగ్రహాదిక సంచారము, అభివృద్ధ్యాదిక సూచకమగు సంవత్సరాదిక కాలప్రమాణములును గోచరములే. కావున సమస్తాకదృష్టితో నిట బరిశీలనముగావించుట ముఖ్యము. అనగ వ్యావహారికమును వ్యావహారిక దృష్టితోడను, ప్రాతిభాసికమును ప్రాతిభాసిక దృష్టితోడను విమర్శించినచో రెండునూ యథార్థములే యగుచున్నవి. అట్లుకాక జాగ్రత్తుతో స్వప్న మంతమగును గదా అనిన. అట్లే జాగ్రత్తు స్వప్ననిద్రాదులతో నంతమగుటయు విస్మరింపరాదు. అనగ నొక యవస్థ రెండవదానితో నంత మగుట సహజమేగదా. అటులే దృశ్యప్రయోజనము గూడ బరవస్థావతరణముతో నంతరించుచున్నది. కావున 'అద్వయం చ ద్వయాభాసం మనః స్వప్నే న సంశయః । అద్వయం చ ద్వయాభాసం తథా జాగ్రన్న సంశయః॥' (మాం. కా. 3-30) అద్వయమైన చిత్తము స్వప్నములో నానాత్వముగ గోచరించుట యథార్థమే కాని అటులే జాగ్రత్తులోగూడ జిత్తము వివిధముగ నిశ్చయముగ గానుపించును. జాగ్రత్తులోగాని స్వప్నమునగాని యీనానాత్వ మంతయు జిత్తేతరము గాక చిత్తములోనే యిమిడి యున్నది. ఎందుచేనన 'మనసో హ్యమనీభావే ద్వైతం నైవోపలభ్యతే' (మాం. కా. 3-31) మనస్సు లేనప్పుడు ద్వైతోపలబ్ధి లేదుగదా. ఈవిధముగ జాగ్రత్తువలెనే స్వప్నముఁగూడ 'అన్యథా గృహ్ణతః' (మాం. కా. 1-15) ఆత్మవస్త్వజ్ఞానముచే నన్యథా గ్రహణస్థితియే

యగుచున్నది అని తాత్పర్య సంగ్రహము. ఈవిషయమును ఉపనిషత్తుల ననుసరించి తన అజేయ విమర్శాయుధమున గౌడ పాదాచార్యుడు కారికలలో జాగ్రత్స్వప్నముల రెండింటి శోధించి, రెండింటియొక్క నైజప్రకృతుల దీర్మానించి, సమాన మిథ్యాత్వముల బ్రకటించియున్నాడు. అది అవశ్య పఠితవ్యము మంతవ్యము.

ఇక స్వప్నస్థితుడైన తైజసునిస్థాన మెచ్చట అని విచారించెదముగాక. 'ఉకారః కంఠతః స్వప్నే' (యో. చూ. 761) 'కంఠే స్వప్నం సమావిశేత్' (బ్రహ్మ. 24, నా. ప. 5-1) 'కంఠే విష్ణుస్సమాశ్రితః' (బ్రహ్మవిద్య. 41) 'కంఠస్థం స్వప్నవర్తనం' (త్రి. బ్రా. 149) అను వచనములు తైజసునికి గంఠమునే వాసస్థానముగ నిర్ణయించినవి. 'ఉకారే హృది సంస్థితః' (బ్రహ్మవిద్య. 69) 'ఉకారం విష్ణుం హృదయే' (నృ. ఉ. 3) అను రెండువచనములు మాత్రము అతనికి హృదయస్థానము నొసంగియున్నవి. కాని 'తా వా అస్యైతా హితానామ నాడ్యో'(4-3-20)అతనిలో హితానామక నాడులు గలవనియు, నవియే సంస్కారమూలములనియు బృహదారణ్యకము దెల్పుచు, అచ్చటనే స్వప్నము వ్యక్తము అని వచించుచున్నది. అంతియగాక జాగ్రత్స్వప్నములు క్రమముగా నిద్ర ఆత్మలయందు లయించి హృదయమును జేరుననియు శాస్త్ర వచనములు. కాన నేత్రస్థమైన విశ్వుడు మార్గమున గంఠగతుడై స్వప్నానుభవమునొందు నట్లు దోచును. అట్లైన బ్రహ్మచే సృజింపబడిన సృష్టిని బోషించు భార మూనువానికి హృదయస్థాన ముచితముగాన, నిద్రావస్థలో విశ్రాంతిగ ఆత్మరతికొఱకై

గల ప్రాజ్ఞుని కా యవకాశ మొసంగబడియున్నది. కావున గంఠస్థానమే తైజసుని స్థానముగ ఉపనిషత్తాత్పర్యము.

తైజసస్థానమున కధిష్ఠానదైవముగ 'ఉకారం విష్ణుం' (నృ. ఉ. 3) 'విష్ణు ర్జనార్దనం ఉకారే' (ధ్యానబిందు. 11) 'ద్వితీయా విద్యుమతీ కృష్ణా విష్ణుదైవత్యా' (అథర్వశిఖ) 'ఉకార స్సాత్త్విక శ్శుక్లో విష్ణుః' (యో. చూ. 78) 'ఉకారే విష్ణుః' (బ్రహ్మవిద్య. 72) 'విష్ణుశ్చ భగవాన్ దేవ ఉకారః పరికీర్తితః' (బ్రహ్మవిద్య. 7) అను వాక్యములరీతి తైజసుడు విష్ణువని వ్యక్తము. ఆతనినే 'తైజసో భూతరాడయం। హిరణ్యగర్భః' (నా. ప. 8-10) 'తైజసో హిరణ్యగర్భో ద్వితీయః పాదః' (నృ. ఉ. 1) 'హిరణ్యగర్భ స్తైజసః సూక్ష్మశ్చ ఉకారః' (యో. చూ. 77) అను హిరణ్యగర్భనామమునగూడ బేర్కొనియున్నవి. హిరణ్యగర్భుడన ప్రకాశస్వరూపుడనుటయేగాక, జాగ్రత్సృష్టికి గారణాంశములగు సంస్కారముల ధరించియున్న వాడనియు నర్థము. అందుచే సుషుప్తిగత బీజసంస్కారముల గ్రహించి, సూక్ష్మత్వము వాని కొసంగి, క్రమమున స్థూలరూపమున జాగ్రత్తును జిత్రించువాడనియు నన్వయము. ఇట్టి మహాత్కార్యమునకు హృదయము ప్రధానమగుటచే నతనికి బూర్వము హృదయముగూడ నివాసముగ జెప్పబడియున్నది. వానికి 'ఉకారః సాత్త్వికః శుక్లో...' (ధ్యానబిందు. 13) అను సత్వగుణము తదనుగుణ శుక్లవర్ణము ఆపాదింపబడినది. కాని రజోగుణలేశమున్నగాని, స్థితికార్యముగాని, తైజసుడు ప్రదర్శించు సర్వశక్తిత్వముగాని సిద్ధముకాదు గావున సత్వాంశముగాక రజోంశమునే విష్ణువున కన్వయించుట ఉచి

తము. పౌరాణికముగనైన బ్రహ్మేశ్వరులకంటె విష్ణువునకే స్థితి బాధ్యతా భారముండుటచే నవతారముల ధరించి, సంహార కార్యముల నీతడు గావించియుండుట విదితము. అందుచే నీతనికి రజోగుణమే అభివర్ణిత ముత్తమము. ఈ విధముగ స్వప్నవ్యవహార మగ్నుడైన తైజసనామక జీవుడు ద్వితీయపాద మున వ్యవహరించుచున్నాడు.



## అయిదవ మంత్రము

యత్ర సుప్తో న కంచన కామం కామయతే
న కంచన స్వప్నం పశ్యతి తత్సుషుప్తం।
సుషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞానఘన
ఏవానందమయో హ్యానందభుక్ చేతోముఖః
ప్రాజ్ఞః తృతీయః పాదః

ఎచ్చట ఎట్టి కామ్యమును సుప్తుడు గోరుట లేదో, ఎచ్చట స్వప్నమునుగూడ గాంచుట లేదో అది సుషుప్తి. సుషుప్తిస్థాన మును ఏకీభూతుడును, ప్రజ్ఞానఘనమును, ఆనందమయుడునై ఆనందభోక్తయు జేతోముఖుడును అయిన ప్రాజ్ఞుడే తృతీయ పాదము. 'ప్రణవాత్ప్రభవో బ్రహ్మా ప్రణవాత్ప్రభవో హరిః। ప్రణవాత్ప్రభవో రుద్రః ప్రణవో హి పరో భవేత్ ॥' (యో. చూ. 76) ప్రణవమునుండి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు జని తము. ప్రణవము సర్వాతీతము అను ప్రకారము ప్రణవ జన్య మైన బ్రహ్మవిష్ణుల పిమ్మట రుద్రప్రస్తావన ప్రారంభము. 'తృతీయా సుషుప్తిః' (అథర్వశిఖ) అనురీతి నిది తృతీయమై,

'ప్రాజ్ఞః కారణబద్ధస్తు' (మాం. కా. 1-11) కారణబద్ధమై, 'కారణావ్యాకృత ప్రాజ్ఞశ్చ మకారః' (యో. చూ. 75) కారణ అవ్యాకృతరూపుడైన ప్రాజ్ఞుడు మకారమున కన్వయించును. 'ఈశాజ్ఞయా మాయోపాధిరవ్యక్తసమన్వితో వ్యష్టి కారణశరీరం ప్రవిశ్య ప్రాజ్ఞత్వ మగమత్। ప్రాజ్ఞోఽవిచ్ఛిన్నః పారమార్థికః సుషుప్త్యభిమానీతి ప్రాజ్ఞస్య నామ భవతి॥' (పైంగల.2) ఈశాజ్ఞాబద్ధుడై మాయోపాధిగల్గి, అవ్యక్తముతో గూడిన జీవుడు వ్యష్టిశరీరమును ప్రవేశించి ప్రాజ్ఞత్వమును బొందును. ప్రాజ్ఞుడు అవిచ్ఛిన్నుడు పారమార్థికుడు, సుషుప్తి అభిమానియగుటచే ప్రాజ్ఞనామ మతనికి గలిగెను. సుషుప్తి కాలమున నేమియు దెలియకున్నను, అతఃపూర్వవిషయముల ఉత్తర విషయముల నెరింగిన వాడగుటచే ప్రాజ్ఞుడనియు, జాగ్రత్స్వప్నాదుల యింద్రియాదిక జన్య విశేషజ్ఞానముండి యీయవస్థలో అది లేకుండుటచే ప్ర + అజ్ఞ = ప్రాజ్ఞ అనియు, జాగ్రత్స్వప్నములందు బాహ్యవస్తుజ్ఞానము తద్వాసనా జన్య జ్ఞానము గలదు. సుషుప్తి యందు కేవల ప్రజ్ఞప్తిమాత్రమే యుండుటచే నతడు ప్రాజ్ఞు డనబడెను.

ప్రాజ్ఞనిర్వచనమున 'ద్వైత స్యాగ్రహణం' (మాం. కా. 1-13) ద్వైతమును గ్రహింపక పోవుట యని గలదు. దాని వివరణమే 'యత్ర సుప్తో' అని వివరింపబడియున్నది. 'తథా జీవోఽపి జాగ్రత్ స్వప్నప్రపంచే వ్యవహృత్య శ్రాంతోఽజ్ఞానం ప్రవిశ్య స్వానందం భుంక్తే' (పైంగల. 2) అట్లు జీవుడు గూడ జాగ్రత్స్వప్నప్రపంచ వ్యవహారముచే నలసినవాడై, అజ్ఞానము నాశ్రయించి స్వకీయానందము ననుభవించును అని

వచనము. ఈవిషయమునే 'తద్యథాస్మిన్నాకాశే శ్యేనో వా సుపర్ణో వా విపరిపత్య శ్రాంతః సంహత్య పక్షౌ సంలయాయైవ ధ్రియతే, ఏవ మేవాయం పురుష ఏతస్మా అంతాయ ధావతి యత్ర సుప్తో న కంచన కామం కామయతే, న కంచన స్వప్నం పశ్యతి' (బృ. 4-3-19) గగనమున నెగురుచున్న పక్షి అలసినదై పక్షములు విప్పి, తనగూటి దిశకు ఎట్లు పయనమగునో అట్లు యీ అనంతాత్మ, కామ స్వప్నములు లేని యీసుషుప్తికొరకు బర్వెడును. అనగ 'శ్రమనిర్వారణార్థం... సుషుప్త్యవస్థా భవతి' (ధ్యానబిందు. 94, 96) శ్రమనివారణమునకై సుషుప్తి యవస్థయని తాత్పర్యము. ఎప్పుడు 'ప్రాణం మనసి సహ కరణైః సంప్రతిష్ఠాప్య ధ్యాతా రుద్రః' (అథర్వశిఖ. 3) సూక్ష్మశరీరమునందలి తత్త్వములను ఇంద్రియములను మనస్సులో జక్కగ నిలిపి ధ్యానించువాడు రుద్రుడనియు 'చతుర్దశకరణోపరమాత్ విశేషవిజ్ఞానాభావా ద్యదా శబ్దాదీన్విషయా న్నోపలభతే తదాత్మనః సుషుప్తం' (సర్వసార) ఇంద్రియాది చతుర్దశకరణములు లేకుండుటచేతను, జాగ్రదాది విశేషజ్ఞానము అభావమనుటచేతను, శబ్దాదిక వృత్తులుగూడ నెప్పుడు లేవో అప్పుడు సుషుప్తి అని అంతఃకరణచతుష్టయ సమేతముగా దశేంద్రియవిరామమే నిద్రావస్థ అని తెలుపబడియున్నది. అగుట.జాగ్రదాది వ్యవహారమువిశ్రాంతి నొంద 'స యథా సోమ్య వయాంసి వాసో వృక్షం సంప్రతిష్ఠంతే।ఏవం హ వై తత్సర్వం పర ఆత్మని సంప్రతిష్ఠంతే' (ప్రశ్న. 4-7) వృక్షమున వసించ బక్షులటకు జేరు విధమున సర్వము పరమాత్మను జేరుట సంభావ్యమేగదా. అట్లు 'సుషుప్తి కాలే. సకలే విలీనే

తమసావృతే। స్వరూపం మహదానందం భుంక్తే విశ్వవివర్జితః॥' (వరాహ. 2-62) సకలము లయమై నిద్రాసమయమున అజ్ఞానముచే సర్వమావృతమై యుండుటచే, విశ్వవివర్జితమై అమితానందమును జీవు డనుభవించును. 'సుషుప్తికాలే సకలే విలీనే తమోఽభిభూత స్సుఖరూపమేతి' (కైవల్య. 12) సుషుప్తి కాలమున సకలము లయించి తమస్సుచే నావరింపబడి సుఖ స్వరూపమును బొందుచున్నాడు.

'చిత్తైకకరణా సుషుప్త్యవస్థా భవతి' (పైంగల. 2) చిత్తముయొక్క ఐక్యతయే సుషుప్త్యవస్థ యగును అను విషయమును వివరించుచు, 'యథా గార్గ్య మరీచయోఽర్కస్యాస్తం గచ్ఛతః। సర్వా ఏతస్మిం స్తేజోమండల ఏకీభవంతి। తాః పునః పునరుదయతః ప్రచరన్త్యేవం హ వై తత్సర్వం పరే దేవే మన స్యేకీభవతి॥' (ప్రశ్న. 4-2) సూర్య తేజము, అస్తమయ కాలమున తేజోమండలమున నేకమై ఉదయకాలమున బునః బహిర్గతమగునట్లు యీ యింద్రియ విషయాదికము మనస్సుతో నిద్రాకాలమున లయమొందును. అందుచే 'తేన తర్హ్యేష పురుషో న శృణోతి న పశ్యతి న జిఘ్రతి న రసయతే న స్పృశతే। నాభివదతే నాదత్తే నానందయతే న విసృజతే నేయాయతే స్వపితీత్యాచక్షతే॥' (ప్రశ్న. 4-2) ఆకాలమున నతడు ఆలకింపడు, అవలోకింపడు, అఘ్రాణింపడు, ఆస్వాదింపడు, స్పృశింపడు, మరియు, ప్రసంగింపడు, గ్రహింపడు, ఆనందింపడు, విసర్జింపడు, చలింపడు నిద్రించు చున్నాడని చెప్పబడును. 'యత్రైతత్పురుషః సుప్తః స్వప్నం న కంచన పశ్యత్యథాస్మిన్ ప్రాణ ఏవైకధా భవతి, తదైనం వాక్సర్వై

ర్నామభిః సహాప్యేతి చక్షుః సర్వైః రూపైః సహాప్యేతి శ్రోత్రం సర్వైః శబ్దైః సహాప్యేతి మనః సర్వై ర్ధ్యానైః సహాప్యేతి ' (కౌషీతకి. 3-3) పురుషుడు నిద్రించు నప్పుడు, ఎట్టి స్వప్నమును గాంచడు. అత డాసమయమున ప్రాణలో లయించియుండును. అప్పుడు వాక్కు తన నామములతోడను, నేత్రము రూపములతోడను, కర్ణము శబ్దములతోడను, చిత్తము భావములతోడను అందు లయించును. ' కామం కామయతే యావద్యత్ర సుప్తో న కించన । స్వప్నం పశ్యతి నైవాత్ర తత్సుషుప్త మపి స్ఫుటం॥ ' (నా. ప. 8-11) సుషుప్తిలో జాగ్ర దవస్థావిషయమైన కామత్వాదులు లేవు, స్వప్నదృశ్యత్వము గూడ అచట లేకుండుట విదితము అని ఉపనిషత్తులు వివరించి యున్నవి. 'నాఽత్మానం న పరాంశ్చైవ న సత్యం నాపి చానృతం । ప్రాజ్ఞః కించన సంవేత్తి...॥ ' (మాం. కా. 1-12) ఆత్మనుగూర్చిగాని అనాత్మనుగూర్చిగాని, సత్యమునుగురించి గాని అసత్యమునుగురించి గాని ప్రాజ్ఞు డెరుంగడు. ' ద్వైత స్యాగ్రహణం తుల్య ముభయోః ప్రాజ్ఞ తుర్యయోః ' (మాం. కా. 1-13) ద్వైతము నెరుంగకుండుట ప్రాజ్ఞ తురీయు లకు సమానము అనియు కారికావచనము. ' స్వప్ననిద్రా యుతావాద్యౌ ప్రాజ్ఞస్త్వస్వప్న నిద్రయా' (మాం. కా. 1-14) విశ్వతైజసులు స్వప్ననిద్రాయుతులు. ప్రాజ్ఞుడు స్వప్నరహిత నిద్రాయుక్తుడు.

మరియు ' స్వప్నాంతం మే సోమ్య విజానీహీతి । యత్రైతత్పురుషః స్వపితి నామ సతా సోమ్య తదాసంపన్నో భవతి। స్వమపీతో భవతి తస్మాదేనం స్వపితీత్యాచక్షతే స్వం

వ్యాపీతో భవతి।' (ఛాం. 6-8-1) వత్సా సుషుప్తినిగూర్చి నానుండి నేర్వుము. ఎప్పుడు పురుషుడు 'స్వపితి' నామమును ధరించునో అప్పుడు అతడు సద్దైక్యమున సంపన్ను డగు చున్నాడు. అతడు తనను బొందుచున్నాడు. అందుచే నతడు 'స్వపితి' నామమున బరగును. 'స యదా స్వపితి ప్రాణమేవ వాగప్యేతి ప్రాణం చక్షుః ప్రాణం శ్రోత్రం, ప్రాణం మనః' (ఛాం. 4-3-3) పురుషుడు నిద్రించు నప్పుడు ప్రాణలో వాక్చక్షుశ్శోత్రిమనములు లయించును. 'తద్యత్రైతత్సు ప్తః సమస్తః సంప్రసన్నః స్వప్నం న విజానాత్యాసు తదా నాడీషు సృప్తో భవతి తన్న కశ్చన పాప్మా స్పృశతి తేజసా హి తదా సంపన్నో భవతి' (8-6-3) పురుషుడు నిద్రించుకాలమున సమస్తవృత్తులు క్రియాశూన్యములై విశ్రాంతి నుండును. అతనికి అప్పుడు స్వప్నములేదు. అతడు నాడులలో నిమిడి యుండును. అప్పుడతనికి నేపాప మంటజాలదు. అతడు అప్పుడు తేజోరూపుడు సంపన్నుడు అనియు ఛాందోగ్యము వివరింప, 'యత్రైష ఏత త్సుప్తోఽభూద్య ఏష విజ్ఞానమయః పురుషః తదేషాం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞానమాదాయ య ఏషోంత ర్హృదయ ఆకాశస్తస్మింఛేతే; తాని యథా గృహ్ణాత్యథ హైత త్పురుషః స్వపితి నామ తద్గృహీత ఏవ ప్రాణో భవతి, గృహీతా వాక్, గృహీతం చక్షుః. గృహీతం శ్రోత్రం గృహీతం మనః' (2-1-17) విజ్ఞానమయుడగు పురుషుడు నిద్రింప విజ్ఞానముద్వార యింద్రియవిషయముల సంగ్రహించి, హృదయమున గల ఆకాశమున నతడుండును. వానిని గ్రహింపగ నతనిని 'స్వపితి' అందురు. అచట ఘ్రాణ, వాక్,

చక్షుః శ్రోత్రి మనసాది యింద్రియములు గ్రహింపబడును అని బృహదారణ్యక శ్రుతియు స్వాపితిస్వరూపమును వివరించెను. కౌషీతకముకూడ 'అథాస్మిన్ ప్రాణ ఏకైకథా భవతి తథైనం వాక్ సర్వైర్నామభిః సహాప్యేతి...' (4-20) అంత నతడు ప్రాణములో లయింపబడును. వాక్కు తననామముతో నందు ప్రవేశించును అనుచు బూర్వమంత్రార్థములను అనువదించి యున్నది. అట్లు సర్వవిషయలయము కాగ 'స యదా తేజ సాభిభూతో భవతి । అత్రైష దేవః స్వప్నా న్న పశ్యత్యథ తదైతస్మింశరీరే ఏతత్సుఖం భవతి॥' (ప్రశ్న. 4-6) పురుషుడు సుషుప్తిలో దేజస్సులో ముంచివేయబడగ నతడు స్వప్నముల గాంచడు. అప్పుడు అతనికి సుఖప్రాప్తిగలుగును అని ప్రశ్నో పనిషత్తు ఒక్కమాటలో వచింప, కాని అట్టి సుఖముగలదని గ్రహింప జాలక, 'ఇమాః సర్వాః ప్రజా అహరహర్గచ్ఛంత్య ఏతం బ్రహ్మలోకం న విందంత్యనృతేన హి ప్రత్యూఢాః' (ఛాం. 8-3-2) మానవులు అహరహము నిద్రలో నీసుఖ స్వరూపమును జేరుచున్నను, అనృతముచే మోసగింపబడిన వారై యీ బ్రహ్మలోకమును గ్రహింపజాలకున్నారు అని ఛాందోగ్యము ప్రజానీకమును బాపము దలచినది.

'అథ యదా సుషుప్తో భవతి; యదా న కస్యచన వేద హితా నామ నాడ్యో ద్వాసప్తతిః సహస్రాణి హృదయాత్ పురీతత మభిప్రతిష్ఠంతే' (బృ. 2-1-19) గాఢనిద్రలో నుండ, అది దేనిని గ్రహింపని స్థితిలో నున్నవేళ, హృదయాది శరీరపర్యంతము గల హితానాడు లనబరగు డెబ్బదిరెండువేల నాడులద్వార అది తిరోగమించును. అటులే సుబాలాది

యుపనిషత్తులుగూడ వచించుచున్నవి. అందుచే నీ సుషుప్తి కాలమున 'న కంచన కామం కామయతే' అనుచు సర్వజాగ్ర ద్విషయ ప్రవృత్తులను, 'న కంచన స్వప్నం పశ్యతి' అని సర్వ సూక్ష్మవిషయములను, ఉద్భూతసంస్కార పుంజమును మంత్రము నిరాసమొనరించియున్నది. తద్వివరణార్థమై యచట సర్వజాగ్రత్స్వప్న ప్రవృత్తులు హృదయాకాశమధ్యము నగల సర్వాతీత పురుషునిలో లయించి ఏకీభూతమై యున్నవని ఏకీభూతపదము నుపయోగించియున్నట్లు సువిస్పష్టము.

ఈ విధముగ నేకమైయున్న చిత్తసంస్కారములు ప్రవృత్తి రహితములై యున్నవనుటకు 'ప్రజ్ఞానఘన' పద ముపయుక్త మగుచున్నది. 'ఘనప్రజ్ఞస్తథా ప్రాజ్ఞ' (మాం. కా. 1–1) అని కారికాకారుడు ప్రాజ్ఞుని ఘనప్రజ్ఞునిగ వర్ణించుచు, 'బీజ నిద్రాయుతః ప్రాజ్ఞః' (మాం. కా. 1–13) అనివచించుచు, భవిష్యజ్జాగ్రత్స్వప్న సంస్కారములు ఇచ్చట బీజరూపమున నున్నట్లు తెలిపియున్నాడు. 'ప్రజ్ఞయా వాచం సమారుహ్య వాచా సర్వాణి నామాన్యాప్నోతి ... ప్రజ్ఞయామనః సమా రుహ్య మనసా సర్వాణి ధ్యానాన్యాప్నోతి' (3–6) ప్రజ్ఞను బొందిన వాక్కుచే నతడు వాక్కుద్వార అఖిల నామముల బొందుచున్నాడని సర్వేంద్రియముల ప్రజ్ఞాధీనత్వమును వచించి, మనస్సు ప్రజ్ఞను బొందుటచే నామనస్సుచే బురుషుడు సర్వ భావనల జేయుచున్నట్లు చెల్పుచు, ప్రజ్ఞయొక్క సర్వాధిష్ఠా నత్వమును కౌషీతకము వివరించియున్నది. ఆప్రజ్ఞయే లేకున్న సర్వేంద్రియములు అశక్తములనియు నాయుపనిషత్తు తర్వాతి మంత్రమున వివరించును. అట్టి స్థితిలో 'ప్రజ్ఞానఘనవాన్

సుఖీ' (8-13)అని నారదపరివ్రాజకము వచింప, 'అయమాత్మా నంతరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ' (4-5-13) బాహ్యాభ్యంతరములు లేని ఆత్మ ప్రజ్ఞానఘనమని బృహదారణ్యకము స్తుతించుచున్నది. ఇచ్చట 'ఏవ' అను పదము సుషుప్తిలో బ్రహ్మేతరముల నన్నింటిని నిరాకరించుచున్నది. అనగ అచట నొక ప్రజ్ఞానమే యుండును గాని, సర్వద్వైతము అభావమని నిర్ధారణము. కాని సంస్కారములు బీజరూపమున నుండి, మరల ఉద్భూతములై, స్వప్నజాగ్రత్కారణములై యొప్పారుటచేతను, ద్వైతరాహిత్య స్థితియైనను నిద్రాస్థితునికి అననుభూతమై, అవ్యక్తమై, అగ్రాహ్యమై యుండుటచే, తమోరూప అజ్ఞానావృతుడై యుండుటచే నతడు తురీయుని వలె బ్రజ్ఞాస్వరూపుడు అని యనుటకు వీలులేదు. స్వప్నజాగ్రద్రూప విక్షేపములకు, అనగా అన్యథాజ్ఞానమునకు గారణమైన ఆవరణ మాయావిశిష్టుడై అజ్ఞానరూపుడై యుండుటచే,నితడు మాయాశబలితుడుగనే గ్రాహ్యము. ఈ అర్థవివరణమునకు గూడ 'ఇవ' పదముపయుక్తమనియు దాత్పర్యము.

అయినను నిర్విషయత్వము అను స్థితి అట నుండుటచేత 'ఆనందశ్చ తథా ప్రాజ్ఞః' (మాం. కా. 1-4) 'ఆనందభుక్ తథా ప్రాజ్ఞః' (మాం.కా. 1-3) అనియు గౌడపాదాచార్యుడు వచింప, 'ఆనందభుక్ తథా ప్రాజ్ఞః' (యో. చూ. 72) 'ఏకీభూతః సుషుప్తస్థః ప్రజ్ఞానఘనవాన్ సుఖీ' (నా. ప. 8-12) 'స్వానందం భుంక్తే' (పైంగల. 2) 'మహదానందం భుంక్తే విశ్వవివర్జితః' (వరాహ.2-62) 'తమోభిభూతః సుఖరూపమేతి' (కైవల్య. 1-13) 'ఐక్యాత్ ఆనందభోగాచ్చ' (నా. ప. 8-7)

'ఐక్యాదానందభుక్త్వాచ్చ' (నృ.ఉ.తా. 1) అనుచు సర్వోపనిషత్తులు ప్రాజ్ఞుని ఆనందమయునిగను, ఆనందభోక్తగను వర్ణించియున్నవి. 'ఆనందం నామ, సుఖచైతన్య స్వరూపోఽపరిమితానంద సముద్రోఽవశిష్ట సుఖస్వరూప శ్చానంద ఇత్యుచ్యతే' (సర్వసార) ఆనందమనగ సుఖచైతన్యస్వరూపము, అపరిమితానంద సముద్రము, అవశిష్ట సుఖస్వరూపము అను నర్థము ఇచట నుపయుక్తముకా దనుటకు ఉపనిషత్తు 'మయ' శబ్దము నుపయోగించినది. ఈ మయట్ప్రత్యయము ప్రాచుర్యార్థము వికారార్థములని అర్థద్వయముగ నుపయుక్తము. కేవల బ్రహ్మ విషయమున వికారార్థము గ్రాహ్యము. అనగ ఆనందస్వరూపమే యగుట అట ఆనందేతరము లేశమాత్రమైన యుండుట దుర్లభమగుచున్నది. ప్రాజ్ఞునిస్థితి అట్లుకాదు. అట అభావవిషయముల వలన శ్రమలేకుండుట విశ్రాంతి యనబడుచు సుఖమని ఆనందమని వచింపబడియున్న దేగాని, తదంతర్గతమున బ్రహ్మానఘున శబ్ద మీమాంసలో వచింపబడిన తెరంగు భావి అవస్థాద్వయ కారణమైన సంస్కారపుంజముయొక్క యునికిచే నిట వికారార్థ గ్రహణము అననుకూలమగుచున్నది. కాన, విశ్వ తైజసులకు గల సుఖదుఃఖాదికములేని అభావస్థితిలో ప్రాజ్ఞుడుండుటచే వారికంటె నధికతర సుఖస్వరూపుడనుటకు ఆనందమయ ఆనందభుక్ శబ్దము లుపయోగింపబడియుండుటచే ప్రాచుర్యార్థమే గ్రాహ్యము అని తాత్పర్యము. అనగ ఎక్కువ ఆనందముగలవాడని యర్థము. అట్టి ఆనందమునే అనుభవించుచుండుటచే నాతని నానందభుక్ అనుటయు నేర్పడినది. ఆనంద భోక్త ఆనందస్వరూపుడు కాడుగదా. అందుచే మయ శబ్దము

యొక్క అర్థమును ఇట 'భోక్త' శబ్దము నిశ్చయించుచున్న దనియు నననగును.

ఈ యర్థమునే అన్వయించుచు బృహదారణ్యకశ్రుతి శ్యేనాదిక ఉదాహరణము నొసంగి విశ్రాంతికొరకు విశ్వతైజస రూపజీవుడు ప్రాజ్ఞుడగుచున్నాడని వచించి (4-3-19), విషయాదులు హితనాడుల లయించునని అన్వయించి, (4-3-20), విషయాభావమును ద్వైతాభావముచే నభయత్వము నొందు ననియు (4-3-21), నచట సర్వవిభేదములు లేని విస్మృతి గలిగి యుండుననియు (4-3-22), నటగల ప్రాజ్ఞుడు సర్వదృక్కగు ఆత్మగనే నిశ్చయించి (4-3-23), ద్వైతముండిననే దృగ్దృశ్యములుగాన నట సర్వద్వైతాభావమును ప్రతిపాదించి, 'సలిల ఏకో ద్రష్టాద్వైతో భవతి' (4-3-32) ఉదకమువలె నది నిర్మలమనియు అద్వైతమనియు జెప్పినది. తర్వాత 'ఏష బ్రహ్మలోకః' ఇదియే అతని బ్రహ్మలోకము. 'ఏషాస్య పరమాగతిః ఏషాస్య పరమా సంపత్,ఏషోఽస్య పరమో లోకః,ఏషోఽస్య పరమ ఆనందః,ఏతస్యైవాఽనందస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవంతి' (4-3-32)ఇది అతని పరమ గమ్యము. అతని పరమ సంపద. పరమానందము. ఈ ఆనంద లేశముపై సర్వేతరభూత జాలములు జీవించును అని అభివర్ణించియున్నది. ప్రాజ్ఞ దాస్థితిలో సర్వసంబంధరహిత సుఖస్వరూపుడై యుండునని తాత్పర్యము. ఈఆనందస్థితినే తర్వాత మంత్రమున ననువదించి వివరించియున్నది. ప్రాజ్ఞ తురీయములలో ద్వైతాభావము సామాన్యమైయుండుట, స్వప్నమైయుండుట, నిరూపురును ఆనందమున నుండుటయు సమానమే యగుచున్నది. కాని తురీయుడు ఆనంద

స్వరూపుడై యుండ ప్రాజ్ఞుడు ఆనందమయుడై యుండును. అందుచే విశ్వతైజసాకార జీవుడు పొందగల గతి, స్థితి, సంపద, ఆనందము అనుభవము యింతటితో పూర్తియగుటచే నిది యింత శ్రేష్ఠముగ వర్ణింపబడియున్నది. ఇచట ప్రాజ్ఞుడు అన్యథా జ్ఞానమును వర్జించి, తురీయుని జ్ఞానసముపార్జనము గావింపక నున్న సంధ్యావస్థలోనున్న అజ్ఞానరూపుడగుటచే సంస్కార బీజములుగలిగి విశ్వత్వ తైజసత్వములను, ద్వైతరాహిత్యముచే దురీయత్వలక్షణములను బొంది వీనికంటె నుత్తముడుగను అతని కంటె నల్పుడుగను నుండుట గమనార్హము. తురీయమున గతులు, ఆనందములు, లోకములు నాబడు సర్వనానాత్వములు శూన్యములుగదా. కాని ప్రాజ్ఞునిలో అవ్యక్త వాసనారూప మున స్పష్టములే. లేకున్న ప్రాజ్ఞుడుగూడ ముక్తుడై మరల జేతో ముఖత్వమునకు గారణభూతుడు కాకుండవలయును గదా! అందుచే బృహదారణ్యకవాక్యములుగూడ అతీత తురీయస్థితి కన్వయింపబడక, అద్వైతలక్షణముల దాత్కాలికముగ గలిగి యున్న ప్రాజ్ఞునకే అన్వయింపబడవలయునని గ్రాహ్యము.

'పునశ్చ జన్మాంతర కర్మయోగా త్స ఏవ జీవః స్వపితి ప్రబుద్ధః' (కైవల్యా. 14) మరల జన్మాంతర కర్మసంబంధము వలన ఆజీవుడు నిద్రనుండి మేల్కొనుచున్నాడు. 'విజ్ఞానే స్పందమానే వై నాఽభాసా అన్యతో భువః' (మాం.కా.4-51) విజ్ఞానము పరిస్పందన మగునప్పుడు దృశ్యములు పరస్థానము నుండి గలుగుటలేదనునట్లు, 'యథా స్వప్నే ద్వయాభాసం స్పందతే మాయయా మనః । తథా జాగ్రత్ ద్వయాభాసం స్పందతే మాయయా మనః॥' (మాం.కా. 3-29) స్వప్నమున

మాయాప్రాబల్యమున జిత్తము ద్వైతదృశ్యముల బ్రదర్శించు నట్లు, జాగ్రదవస్థలోగూడ మాయానియమితమై మనస్సు ద్వైతమును గన్పింపజేయుననురీతి, స్వప్న జాగ్రత్తులు రెండును మాయాకల్పితములు. అనగ అజ్ఞానజనితములగుట స్పష్టము గాన, ప్రాజ్ఞస్థితిలోగల ప్రజ్ఞానఘనరూప సంస్కారపుంజమున, బూర్వసంస్కారప్రాభవమున సంకలన మేర్పడి జీవుడు ప్రబుద్ధు డగుచున్నాడని విదితము. కావున 'స యదా ప్రతిబుధ్యతే యథాగ్నేర్జ్వలతో సర్వాదిశో విస్ఫులింగా విప్రతిష్ఠేరన్నేవమే వైతస్మాదాత్మనః ప్రాణా యథాయతనం విప్రతిష్ఠంతే ప్రాణేభ్యో దేవ దేవేభ్యో లోకాః.' (కౌ. 3–3, 4–20) పురుషుడు మేల్కాంచు నప్పుడు, ప్రజ్వలించుచున్న అగ్నినుండి మిణుగురులు వివిధ దిక్కు లకు బ్రసరించునట్లు ఆత్మనుండి సర్వప్రాణములు తమ స్థాన ముల జేరును. వానినుండి వాని అధిష్ఠానదేవతలు, వానినుండి లోకములు బయల్వెడలును. 'స యథోర్ణనాభి స్తంతు నోచ్చ రేత్ యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చరంతి, ఏవమేవ' (బృ. 2–1–20) సాలెపురుగునుండి తంతువు లుద్భవించునట్లు అగ్నినుండి అల్పమైన విస్ఫులింగము లుదయించునట్లు అనియు బృహదారణ్యకాది శ్రుతులు ప్రాజ్ఞునుండి స్వప్నజాగ్రత లావిర్భ వించు విధానమును వివరించియున్నవి. 'పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి స్వప్నాయైవ' (బృ. 4–3–15) మరల విలోమక్రమమున నతడు పూర్వస్థితియైన స్వప్నమున కేతెం చును. మరల 'స వా ఏష ఏతస్మిన్ స్వప్నాంతే రత్వా చరిత్వా। దృష్ట్వైవ పుణ్యం చ పాపం చ। పునః ప్రతిన్యాయం ప్రతియోన్యాద్రవతి బుద్ధాంతాయైవ' (బృ. 4 – 3 – 34)

స్వప్నములో సంచరించి అనుభవించుచు, పుణ్యాపాపముల దర్శించుచు, విలోమక్రమమున దనపూర్వస్థితియగు జాగ్ర దవస్థకు జీవు డరుదెంచెను అను వాక్యములవలన అజ్ఞాన బద్ధత్వముననున్న ప్రాజ్ఞుడు ప్రబుద్ధసంస్కారరూపుడై సూక్ష్మ విషయేంద్రియములకు దృగ్దృశ్యములు తానైయున్న తైజ సుడై, సూక్ష్మానుభూతులలో దృప్తిగాంచనేరక స్థూలవిష యేంద్రియముల నాశ్రయించి, విశ్వుడై పరిణమించుచున్నట్లు విదితమగుచున్నది. విశ్వ తైజసప్రాజ్ఞుల నెడు గ్రమము విలోమ పద్ధతిని బ్రాజ్ఞ తైజస విశ్వులగుచుందురు. ఈక్రమము సహజ మును సత్యమునైయున్నను స్వప్నస్థితిని గుర్తింపకయే విశ్వు నుండి ప్రాజ్ఞునకును, మరల ప్రాజ్ఞునుండి విశ్వునకును అరుదెంచి నట్లు భావించెదరు కాని ఎల్లరకు యీక్రమము అనుభవసిద్ధము.

ప్రాజ్ఞునిలో నీ యవస్థాత్రయ లక్షణములు మూడును స్పష్టముగ గోచరము. ఆస్థితుల జేతోముఖ, ప్రజ్ఞానఘన, ఏకీభూత పదములే సూచించుచున్నవి. చేతోముఖత్వము సృజింప, ప్రజ్ఞానఘనత్వము సంస్కారముల ధరించును. సృష్టి విషయముల, సంస్కారములుగ బరిణమింపజేసి ఏకీభూతత్వము లయింప జేయుచున్నది. అందుచే నీ మూడు అవస్థలలో గుణత్రయముగూడ నిమిడియున్నది. సృష్టికారణ చేతోముఖ త్వమున దామసము, ప్రజ్ఞానఘనత్వమున రాజసము, ఏకీభూత త్వమున సత్వము వ్యక్తము. ఇచ్చట ఈగుణములు అవ్యక్తములై యుండుటచే 'త్రిగుణ సామ్యావస్థ' అను అవ్యాకృత నిర్వచనము సఫలమగును.

'హితా నామ నాడ్యో ద్వాసప్తతి సహస్రాణి హృదయాత్పురీతత మభిప్రతిష్ఠంతే' (బృ. 2-1-19) హృదయమునుండి శరీరపర్యంతము వ్యాపించియుండు డెబ్బదిరెండు వేలనాడు లనబడు హితానాడులద్వార అది పునరాగమనము జేయును. 'హితా నామ హృదయస్య నాడ్యో' (కౌ. 4-19) హృదయమునగల హితానామక నాడులు అని వచింపబడుట చేతను, హితానాడులు హృదయస్థములని విదితము. వానిలో జీవుడు సుషుప్తికాలమున విలీనమగుచున్నాడని పూర్వమంత్రములద్వార గ్రహించియున్నారము. అందుచే ప్రాజ్ఞునిస్థానము హృదయమనియే స్పష్టము. అందుచేతనే 'సుషుప్తం హృదయస్థం' (నా.ప. 5-1) 'సుషుప్తిం హృదయస్థం తు'(బ్రహ్మ 24) 'మకారః హృది సుప్తితః' (యో. చూ. 76) 'ఆకాశే చ హృది ప్రాజ్ఞః' (మాం. కా. 1-2) అనియు వచనములు పలుకుచున్నవి.

'చతురాత్మా ప్రాజ్ఞ ఈశ్వర స్తృతీయః పాదః' (నృ. ఉ. తా. 1) 'రుద్రా...తృతీయః పాదో భవతి' (నృ. పూ. తా.2', నృ.ఉ.తా.1)'మహేశ్వరః మకారః'(ధ్యానబిందు. 12) 'ప్రాణం మనసి సహాకరణైః సంప్రతిష్ఠాప్య ధ్యాతా రుద్రః' (అథర్వశిఖ. 3) ఇంద్రియముల మనస్సునందు నిలిపి ధ్యానించువాడు రుద్రుడు. 'మకార స్తామసః కృష్ణో రుద్రశ్చేతి తథోచ్యతే' (యో. చూ. 78) మకారము తామసమై కృష్ణమై రుద్రుడని వచింపబడును 'మకారే సంస్థితో రుద్రః' (బ్రహ్మవిద్య. 72) 'ఈశ్వరః పరమో దేవో మకారః పరికీర్తితః' (బ్రహ్మవిద్య. 7) 'చతురాత్మేశ్వరః ప్రాజ్ఞః' (నా. ప. 8-13)

అను శ్రుతివచనసంచయము మకారస్థానమున నిద్రావస్థలో ఈశ్వరుడు అనగ రుద్రుడు అధిష్ఠానదేవతగ నుండును అని వచించుచున్నది. 'ఈశ్వర ఇతి చ బ్రహ్మైవ స్వశక్తి ప్రకృత్యాభిధేయ మాశ్రిత్య లోకాన్ సృష్ట్వా ప్రవిశ్యాంతర్యామిత్వేన బ్రహ్మాదీనాం బుద్ధీంద్రియ నియంతృత్వాదీశ్వరః' (నిరాలంబ. 2) ఈశ్వరుడు అనగ బ్రహ్మమే. తన శక్తియగు ప్రకృతిచే ఈశ్వరనామమును ధరించి, లోకముల సృజించి, అందంతర్యామియై ప్రవేశించి, బ్రహ్మాదులకు బుద్ధికిని ఇంద్రియములకును నియామకుడై యుండువాడు ఈశ్వరుడు అని ఈశ్వర నిర్వచనము. అనగ సర్వనియంత యని తాత్పర్యము. 'యః సర్వాన్ లోకాన్ ఈశతే ఈశనీభిః జననీభిః చ పరమశక్తిభిః అభిత్వా శూరణో౽ నుమో దుగ్ధా ఇవ ధేనవః। ఈశానమస్య జగతః స్వర్దృశ మీశాన మింద్ర తస్థుష ఇతి తస్మా దుచ్యతే ఈశానః' (అథర్వశిర. 4-3) సర్వలోకములను సృజించు పరమశక్తులుగల నియమనశక్తులచే నెవడు పరిపాలించు చున్నాడో, 'ఓ దేవా రుద్రా ఈజగత్తునకు అధిపతివై, స్థావరమగు జగత్తునకు అధిపతి అయిన వాడును, స్వయంప్రకాశకుడును అయిన నిన్ను స్తుతించెదను. పాలు పితుకబడని ఆవు వంటి వాడవు గాన ఈశానుడవు, అను వాక్యములును, 'యస్సర్వాన్ లోకాన్ సంభక్షం స్సంభక్షయత్యజస్రం సృజతి విసృజతి వాసయతి తస్మా దుచ్యతే మహేశ్వరః' (అథర్వశిర. 4-6) ఎవడు లోకముల ఉపసంహరించుకొనుచున్నాడో, సదా సృజించుచు, సంహరించుచు, పాలించుచున్నాడో అతడు మహేశ్వరుడు అనియు ఈశ్వరశబ్దము నిర్వచింపబడియున్నది.

అటులే 'ఈశానః శంభు ర్భవో రుద్రః' (మైత్రాయణి. 5-8) అనునట్లు ఆతడే రుద్రపదమునగూడ వ్యవహార్యము గాన రుద్ర శబ్దమునుగూడ ఉపనిషత్తులు ఉపయోగించియున్నవి. చిత్తమున ఇంద్రియముల లయింపజేసి ధ్యానించువాడు రుద్రుడని నిర్వచనము. అటులే విస్పష్టముగ అథర్వశిరముగూడ 'ఇమం లోకం ఈశతే ఈశనీయు ర్జననీయుః ప్రత్యఙ్ జనా స్తిష్ఠతి సంయుగ స్వాంతకాలే సంహృత్య విశ్వాభువనాని గోప్తా తస్మాదుచ్యత ఏకో రుద్రః' (4-2) ఈలోకముల పాలించును. నియమన శక్తిగలవాడు సృష్టిశక్తిగలవాడు సర్వాంతరుడై యుండును. యుగాంతకాలమున నీవిశ్వభూతముల దనయందు ఉపసంహరించుకొని, సంరక్షించుటచే రుద్రుడు అనబడుచున్నాడు అనియు నిర్వచించియున్నది.

అందుచేత 'పరాత్పరతరం బ్రహ్మ యత్పరాత్పరతరో హరిః । పరాత్పరతరో హీశ స్తస్మా త్తుల్యో ఽధికో న హి॥' (శరభ. 29) సర్వాధికుడు బ్రహ్మ. అతనికంటె నధికుడు హరి. అతనికంటె శ్రేష్ఠుడు ఈశ్వరుడు. అతనికి దుల్యుడుగాని అధికుడుగాని లేడు అని శరభము ప్రకటించును. అట్టి స్థానమునకెట్టి పాపము లభావములని 'అపహత పాప్మా హ్యేష బ్రహ్మలోకః' (ఛాం. 8-4-1) ఘోషించి అదియే బ్రహ్మలోకము అనగ కైవల్యముగ ఛాందోగ్యము వచించును. అదియే సత్యమనియు నది వచించును (8-3-3). అందుచే 'తద్వా అస్యైత దాప్తకామ మాత్మకామ మకామం రూపం శోకాంతరం' (4-3-21) సర్వకామముల బొంది, ఆత్మస్వరూపుడై కామరహితుడై, శోకాంతరమును బొందినదియే ఆస్థితియనియు

నదియే పరమానందాది లక్షణములు గలదనియు (4-3-32) బృహదారణ్యకము వివరించుచు. అందుచే సుషుప్తికాలమున బుద్ధి పరమేశ్వరసంబంధమును బొంది, 'నిత్యబోధస్వరూపా భవతి' (94) అని ధ్యానబిందువు బోధించి స్థిరపరచుచున్నది. కావున 'త్రిలోచనం శుద్ధస్ఫటిక సంకాశం నిష్కలం పాప నాశనం' (32) త్రిలోచనుడు, శుద్ధస్ఫటిక ప్రకాశము గల వాడును, నిష్కలుడును, పాపనాశకుడును అని ధ్యానబిందు ధ్యానించుచు, ఈశ్వరుని వర్ణించియున్నది. అట్లు 'శుభాశుభా శుక్లా' శుభాశుభములు లేక బరిశుద్ధమైన శుక్లవర్ణమైనవాడు రుద్రుడని అథర్వశిఖ ప్రతిపాదింప, 'మాయా సా త్రివిధా ప్రోక్తా సత్వ రాజస తామసీ' అని వచించి, 'ప్రోక్తా సాత్వీ చ రుద్రే' రుద్రునియందుగల మాయ సాత్వికముగ గృష్ణోపనిషత్తు స్పష్టపరచియున్నది.

ఇట్లు సుషుప్తి అవస్థ అవస్థాత్రయములో దురీయమున కతిసన్నిహితముగ నుండుటచే వాని యన్నింట ముఖ్యమును, ఉత్తమస్థానము నధిష్ఠించి సంస్తుతుల కాకరమై యున్నది. అదియే సర్వాధారమై సృష్టి స్థితి లయ శక్తుల అవ్యక్తముగ ధరించి, సర్వకారణమై, కార్యత్వ మలినరాహిత్యముచే బరిశుద్ధమై, సుఖదుఃఖాపేక్షశూన్యత్వమున ఆనందమయమై విరాజిల్లుట గాంచనగును. అందుచే గొందరు Sleep is Samadhi సుషుప్తి సమాధియే అనియు భ్రాంతి నొంద నిది అవకాశ మొసంగుచున్నది.

—•—

# ఆ జీ వ మం త్ర ము

> ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోంతర్యా
> మ్యేష యోనిః సర్వస్య ప్రభవాప్యయౌ
> హి భూతానాం.

ఇదియే సర్వేశ్వరుడు. ఇదియే సర్వజ్ఞుడు, ఇది సర్వాంత ర్యామి, ఇదియే సర్వకారణము. దీనినుండియే సర్వ ముద యించి పర్యవసానమున నిందే అస్తమించును.

ఇంతవరకు మీమాంసింపబడిన ప్రాజ్ఞుడే, పూర్వావస్థ గల అన్యథాజ్ఞానాదిక విక్షేపరహితుడై, తన సహజావస్థ నుండు టచే నధికతర నిర్మలత్వము భాసింప, బూర్వ విశ్వతైజసులకుగల సర్వావధుల నధిగమించి సర్వశక్తిసంపన్నుడై, విరాజిల్లుటచే 'ఏష సర్వేశ్వరః' అన బడియుండెను. జాగ్రత్స్వప్నములందు గల 'నివృత్తేః సర్వదుఃఖానా మీశానః ప్రభు రవ్యయః' (మాం. కా. 1-10) సర్వదుఃఖము లుపశమింప నీశానుడు ప్రభువు అయి అవ్యయు డగుచున్నాడు. 'సర్వాన్ లోకా నీశత ఈశనీభిః' (శ్వే. 3-1) పాలించు తనశక్తిచే లోకముల బాలించువాడు. 'యః సర్వాన్ లోకాన్ సంభక్షం స్సంభ క్షయత్యజస్రం సృజతి విసృజతి వాసయతి తస్మా దుచ్యతే మహేశ్వరః' (అథర్వశిర. 4-5) ఎవడు సకలలోకములను దన యుదరమునందు జేర్చుకొనుచు, నెడతెగక లోకముల నన్నిం టిని సృష్టిస్థితిలయముల నొనర్చుచున్నాడో వాడు మహేశ్వ రుడు. 'ఈశానం భూతభవ్యస్య' (కఠ. 1-4-5) 'య స్సర్వాన్ లోకాన్ ఈశత ఈశనీభిః జననీభిః పరమశక్తిభిః' (అథర్వ శిర. 4-3) అను నిర్వచనముల సర్వభూతకోటుల జీవన పోషణ

సంహారణ కార్యశాసనకర్త ఈశ్వరుడని వ్యక్తము. అట్టి శక్తి యుక్తుడుగావున సర్వేశ్వరుడు అనియు ప్రశస్తము. అనగా ఈ సృష్టి స్థితి లయ కర్మశీలత్వమే ఐశ్వర్యమనియు, 'సర్వైశ్వర్య సంపన్నః సర్వేశ్వరః' (అథర్వశిఖ. 3) అట్టి సర్వైశ్వర్యముల గూడిన వాడు గావున సర్వేశ్వరుడనియు బ్రతీతి. 'ఆత్మశక్త్యా చ మహాత ఈశతే తస్మా దుచ్యతే మహేశ్వర ఇతి' (శాండిల్య. 3-1-1) తనశక్తిచే గొప్పగ శాసించువాడగుటచే మహేశ్వరు డనియు శాండిల్య వివరణము. 'యో వేదాదౌ స్వరః ప్రోక్తో వేదాంతే చ ప్రతిష్ఠితః। తస్య ప్రకృతి లీనస్య యః పరః స మహేశ్వరః॥' (2-18) ఎవడు వేదాదియందు స్వరముల బలికెనో, వేదాంతముల నెవడు ప్రతిష్ఠించెనో, సర్వము ప్రకృతిలో లీనమగుచుండ బరమై ఎవడుండునో వాడు మహేశ్వరు డనియు శుకరహస్యము బోధించుచున్నది. 'యో దేవానాం ప్రభవ శ్చోద్భవశ్చ విశ్వాధిపో రుద్రో మహర్షిః। హిరణ్యగర్భం జనయామాస పూర్వం' (3-4) విశ్వాధిపతియు సర్వజ్ఞుడును, దేవతల సృజించి ప్రకాశము నొసంగినవాడును, పూర్వము హిరణ్యగర్భుని సృజించినవాడునైన రుద్రుడు 'మహాప్రభుర్వై పురుషః సత్యస్యైష ప్రవర్తకః। నిర్మలా మిమాం ప్రాప్తి మీశానో జ్యోతి రవ్యయః॥' (3-12) మహాప్రభువు యథార్థమున నాతడే ప్రవర్తకుడు. నిర్మలుడు, సర్వేశానుడు, జ్యోతి అవ్యయుడు. 'సర్వస్య ప్రభు మీశానం సర్వస్య శరణం బృహత్' (3-17) సర్వప్రభువు అనియు ఈశానుడనియు, ఎల్లరకు శరణ్యుడనియు నందురు. 'భువనస్య గోప్తా విశ్వాధిపతిః సర్వభూతేషు గూఢః' (4-15) భువనపాలకుడు, విశ్వాధి

పతి, సర్వభూతాంతర్యామి; 'ఈశ్వరాణాం పరమం మహేశ్వరం తం దేవతానాం పరమం చ దైవతం పతిం పతీనాం పరమం పరస్తా ద్విదామ దేవం భువనేశ మీడ్యం' (6-7) ఈశానులకు ఈశానుడు, దేవాధిదేవుడు, సర్వోత్తముడు ప్రకాశస్వరూపుడు, భువనపాలకుడు, 'స కారణం కరణాధిపాధిపో' (6-9) కారణుడు సర్వకారణకారణుడు, అని పలు తెరంగుల శ్వేతాశ్వతరము సర్వేశ్వరుని నుతించియున్నది. అటులే 'ఏష లోకపాల ఏష లోకాధిపతి రేష లోకేశః' (కౌ. 3-8) 'స ర్వేషాం భూతానా మధిపతిః, స ర్వేషాం భూతానాం రాజా, తద్యథా రథనాభౌ చ రథనేమౌ చారాః స ర్వే సమర్పితాః ఏవమేవాస్మి న్నాత్మని సర్వాణి భూతాని...... సమర్పితాః' (బృ. 2-5-15) సర్వభూతముల అధిపతి, రాజు, రథనాభమునందు అరలు అనగా ఆకులు అనుసంధింపబడి యున్నట్లు ఆత్మలో సర్వభూతములు ఆధారపడియున్నవి. 'సర్వస్యేశానః సర్వస్యాధిపతిః --- ఏష స ర్వేశ్వరః ఏష భూతాధిపతిః ఏష భూతపాలః' (బృ. 4-4-22) అనియు, 'సృజతి విసృజతి వాసయతి' (నృ. పూ. తా. 2-3) అనియు సర్వోపనిషత్తులు అతని లక్షణముల గొనియాడుచు వివరించియున్నవి. 'ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః' (బృ. 3-8-9) ఈ అక్షరు ప్రశాసనమున సూర్యచంద్రులు తమస్థానముల బదిలముగనుందురు. 'భీషాస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః। భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ మృత్యుర్ధావతి పంచమః॥' (తై. 2-8), 'భయా దస్యాగ్ని స్తపతి భయా త్తపతి సూర్యః। భయా దింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి

పంచమః'(కఠ.6-3)అతనియొక్క భయముచే అగ్ని దహించును, సూర్యుడు ప్రకాశించును, ఇంద్రుడు వాయువు పంచమునైన మృత్యువు వ్యవహరించును అని అక్షర ప్రశాసన విధానమును ఉపనిషత్తులు క్రోడీకరించి వివరించినవి. మరియు నాతని 'ఏకో దేవ ఆత్మశక్తిప్రధానః సర్వజ్ఞః సర్వేశ్వరః సర్వభూతాంత రాత్మాధివాసః' (శాండిల్య. 2-0) అనియు వర్ణించియున్నది శాండిల్యోపనిషత్తు.

'యః స ఈశ్వర ఇత్యుక్తః సర్వజ్ఞత్వాదిభి ర్గుణైః'(సరస్వతీ రహస్య. 17) సర్వజ్ఞత్వాది లక్షణములుగలవాడే ఈశ్వరుడు అనురీతి బూర్వోక్త నిద్రావస్థాధిష్ఠాన పురుషుని 'యః సర్వజ్ఞః సర్వవిత్' (ముండక. 2-2-7)'యః సర్వజ్ఞః సర్వవిద్యస్య జ్ఞాన మయం తపః' (ముండక. 1-1-9) సర్వజ్ఞత్వ సర్వవిదత్వాది గుణవిశిష్టునిగ వర్ణించియున్నది. అనగ సర్వజీవుల సృష్టి స్థితి లయకర్తయై యుండుటచే, వతనికి సర్వజీవుల పుట్టుపూర్వో త్తరము లన్నియు దెలిసియుండుటచే సర్వజ్ఞుడని నామము గలిగెను. అంతియగాక నతనిలో జీవుల సంస్కారములన్నియు బీజరూపమున నుండుటచే నా పేరు సార్థకమగుచున్నది. అటుల సృష్టి స్థితి లయములతోగూడిన సర్వసృష్టియొక్క విషయము త్రికాలముల గ్రహించియుండి 'కాలకాలః' (శ్వే. 6-16) కాలమునకు నాథుడైయుండుటచే విశ్వవిదుడు అని ప్రతీతి గలిగినది.

మరియు నాతని నంతర్యామి అనియు నుపనిషత్తు వచించియున్నది. 'ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా।కర్మాధ్యక్షః సర్వభూతాధివాస స్సాక్షీ

చేతా కేవలో నిర్గుణశ్చ॥' (బ్రహ్మ. 19) అద్వితీయుడును, స్వయంప్రకాశుండునగుపరమాత్మసకలభూతములందు గూఢమై వ్యాపించియున్నాడు. అతడు సమస్తభూతములలోపల నున్న ఆత్మస్వరూపుడై కర్మాధిపతియై సర్వభూతములయం దధిష్ఠించి నివసించియుండువాడును, సాక్షియు, చైతన్యస్వరూపుడును, నిర్గుణుడునై యున్నాడు అని బ్రహ్మోపనిషత్తు వర్ణింప 'సర్వజ్ఞం సర్వగం శాంతం సర్వేషాం హృదయే స్థితం।' (యోగశిఖ. 3-21) అని యోగశిఖ స్తుతింప, 'కూటస్థా ద్యుపహిత భేదానాం స్వరూపలాభే హేతుర్భూత్వా మణిగణే సూత్రమివ సర్వక్షేత్రేషు యదానుస్యూత అంతర్యమయన్ ప్రకాశతే హ్యాత్మా సోంతర్యామీ' (సర్వసార) తనతోగూడి యుండు కూటస్థాదులతో భేదగ్రహణ కారణముగ, సకల దేహములందు మణులలో దారమువలె లోపలనుండి నియామకుడుగ ప్రకాశించు ఆత్మయే అంతర్యామి అనబడును అని సర్వసార వివరించుచున్నది. అంతర్యామిత్వమును సవివరముగా వర్ణించుచు 'యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అంతరః, యం పృథివీ న వేద, యస్య పృథివీ శరీరం, యః పృథివీ మంతరో యమయతి ఏష త ఆత్మాంతర్యా మ్యమృతః' (బృ. 3-7-3) ఎవడు పృథివిలో నుండి, పృథివితో నంతరుడై, పృథివిచే దెలియబడక నుండెనో, పృథివియే ఎవని శరీరమో, అంతరమునుండి పృథివి నెవడు నియమించునో, అంతర్యామియో అతడే ఆత్మయని 13 మంత్రములద్వార అంతర్యామిత్వమును వర్ణించి పర్యవసానమున 'యః సర్వేషు భూతేషు తిష్ఠన్...' (3-7-15) అను మంత్రమున ఆత్మయొక్క సర్వాంత

ర్యామిత్వమును గూర్చి వివరించియున్నది. అంతర్యామియై
యున్నను, ఆయాభూతముల లేక జీవుల పాపపుణ్యములు
యితనికి అంటవు అని పూర్వమే గ్రహించియున్నారము. విశ్వ
తైజసులు ఆయాయవస్థల బొందిన సుఖదుఃఖాదికము పుణ్య
పాపములు ఇట సంపూర్ణముగ ప్రాజ్ఞునికి లేవు. కాని చేతో
ముఖత్వమున మరల వానిని తైజస విశ్వులకు ఒప్పగించి తన
తటస్థస్థితిలో ప్రాజ్ఞు డుండిపోవుట సహజము.

ఈ ప్రాజ్ఞుడు 'ఏష యోనిః సర్వస్య ప్రభవాప్యయౌ
హి భూతానాం' అని మాండూక్యము. యథార్థమున జీవా
ధిష్ఠానమై జీవావస్థలకు గారణమై యొప్పు ప్రాజ్ఞుడు సర్వభువన
ముల సృజించి, పెంచి, లయింపజేయుచున్నాడా అను సంశ
యము గోచరము. కాని పూర్వోక్తచందము మంత్రముల
వ్యష్టి సమష్టిరూపముల నన్వయించుకొనుట యుక్తము. అనగా
బై వాక్యమున 'ఏష యోనిః సర్వస్య' అనుట ప్రాజ్ఞుని విష
యమున స్వప్నజాగ్రత్తులలో గల సర్వమునకు నతడే కారణ
మని గ్రాహ్యము. కాని అదే మంత్రమున ప్రాజ్ఞుని దైవభావ
మున నవలోకింప ఈశ్వరుడగుచున్నాడు. అతడు సర్వసృష్టి
స్థితి లయముల కధినాథుడని పూర్వము చూచియున్నాము.
అతడు సమష్టిస్వరూపుడగుటచే కేవలము వ్యష్టిరూప జీవుని
యందుగల అవస్థాదులకు, అందుగలుగు సర్వేంద్రియవిషయము
లకు మాత్రమేగాక, సర్వజీవసృష్టికి అనగ సర్వచరాచర
సృష్టికి, అనగ 'ఈక్షణాది ప్రవేశాంతా' (మహా. 4-73) అను
వాక్యరీతి సర్వసృష్టికి గారణభూతుడగుటచే, 'ఏష యోనిః
సర్వస్య' అనబడుట సహజమగుచున్నది. కాన మాండూక్య

మునగల మంత్రములన్నింటి నిట్లు వ్యష్టి సమష్టిరూపమున ప్రత్యేకముగ నన్వయించుకొనుచు గ్రహించుకొనినచో నెట్టి సంశయములు వాటిల్లవు. ఈవిధానముగ బూర్వ మంత్రములనే గాక ముందుమంత్రములగూడ నన్వయించుకొందురుగాక. అందుచే నీప్రాజ్ఞ ఈశ్వరులు ఎట్లు సర్వసృష్టి స్థితి లయకర్తలుగ నున్నారో గ్రహింపయత్నించెదముగాక.

పూర్వము 'సుషుప్తిస్థాన ఏకీభూత' అను పదవివరణమున, 'చిత్తైకకరణా సుషుప్త్యావస్థా భవతి' (పైంగల. 2) 'అంతస్తమసి లీయతే' (మహో. 5-19) అంతరమున తమస్సులో లయించును 'తమోఽభిభూతః' (కైవల్య. 11-3) మొదలగు వాక్యములు సుషుప్త్యవస్థారహస్యము బలికి, సర్వవృత్తులు తమస్సునో లయించును అనుటచే మరల నీవృత్తులు చేతోముఖములగుట కది ఆధారము. అజ్ఞానరూపమునగల ఆ తమమే కారణముగ దోచుటచే 'నైవేహ కించనాగ్ర ఆసీత్ మృత్యునైవేద మావృత మాసీత్' (బృ. 1-2-1) సృష్టికి బూర్వము యిచట నెద్దియును లేదు. అంతయు మృత్యువుచే నావరింపబడియుండెను అనియు, 'అసదేవేద మగ్ర ఆసీత్తత్సదాసీత్త త్సమభవత్' (ఛాం. 3-19-1) ప్రథమమున నిదియంతయు నసత్తు. ఆయసత్తు సత్తుగ నయ్యెను. 'అసద్వా ఇద మగ్ర ఆసీత్। తతో వై సదజాయత' (తై 2-7) సృష్టికి బూర్వము అసత్తు గలదు, దానినుండి సత్తు జనించెను. 'అసద్వా ఇద మగ్ర ఆసీత్' (సుబాల. 3) 'తస్మాత్తమః సజ్జాయతే' (సుబాల: 1) ఆతమము నుండి సత్తు ఉదయించెను అనుచు ఉపనిషత్తులు అసత్తునుండి సత్తు పుట్టొందినట్లు లిఖించియున్నవి. ప్రాజ్ఞస్థితిలో దురీయత్వ

మును విస్మరింపజేయుచున్న అజ్ఞాన మొండు గల్గుటచే నా
యవస్థ తమావృతావస్థగ బరిగణింపబడుట సువిదితము. తమ
మనుట అసత్తుగ నన్వయించుటయు సహజము. కాన నది
మృత్యువనియు నన్వయింపబడియున్నది. జాగ్రత్స్వప్న దృశ్య
ములు గాని, తురీయలక్షణములుగాని గోచరింపని యవస్థ
యగుటచే నది అసత్తుగ దోచుట సామాన్యమే గదా. అనగ
ప్రస్తుత ప్రత్యక్షముగనున్న భూతాత్మక సృష్టియు నందభావము
గదా. ఈనామరూపాత్మకములసత్తుగ భావించుచో నీద్వయము
లేనిది కాన ఆస్థితి అసత్తుగ బరిగణనము నొందుట ఉచితమే
గదా. కాని జాగ్రత్తునుంచి స్మరించి చూచినగాని అందేమియు
దోచని ఆ అభావస్థితిలోనుండి మరలజేతోముఖముగ ప్రథమతః
చతుర్దశకరణము లుదయించి స్వప్నమును, ఆటనుండి
స్థూలములైన యింద్రియాదులతో గూడిన జాగ్రత్తుఆవిర్భవించు
చుండుటచే నీ యవస్థాద్వయ దృశ్యములన్నియు నా తిమిర
రూప అసత్తు నుండియే జనించుచుండుట స్పష్టము. ఆ యస
ద్రూప తమస్సులో నీ యవస్థావృత్తులన్నియు నేకీభూతమై
ప్రజ్ఞానఘనరూపమున నిమిడియుండుట విస్మరింపరాదు. కాన
నవి పూర్వకర్మానుసారముగ నుద్భూతములై మరల అవస్థలకు
గారణమగుచున్నవి. అందుచే నీ సంస్కారములే యవస్థలకు
సాక్షాత్కారణముగ అనగ నుపాదానత్వమును వహింప, నీసత్తు
సహకారికారణముగమాత్ర మగుచుండుట గమనార్హము.
అందుచే నసత్తు సాక్షాత్తు ఉపాదానకారణముగ సృష్టికి గార
ణము కానొల్లదనుట స్పష్టము. ఆ కారణముననే పూర్వావస్థా
వృత్తులు నశించినట్లు గాక 'విలీయంతే' 'అప్యయ' 'అభిభూయ'

'లయ' మొదలైన శబ్దములుమాత్రము ప్రయోగింపబడుట గమనము. లయించుట అనగ నశించుటకాక, రూపాంతరము నొంది యుండుటయేయగును.

కావున నీ సంశయము ఛాందోగ్యముననే గలిగి 'కథ మసతః సజ్జాయే తేతి' (6-2-2) అసత్తునుండి సత్తు ఎట్లుద్భవించును? అని ప్రశ్నించుకొని, 'సత్త్వేవ సోమ్యేద మగ్ర ఆసీ దేకమేవా ద్వితీయం' ప్రథమమున నిది అద్వితీయమైన ఏకమైన సత్తుగనే యున్నది అని సమాధానము నా యుపనిషత్తు ఒసంగియున్నది. అటులే 'సదేవ సోమ్యేద మగ్రే ఆసీత్' (1) అనియు పైంగలము బోధించుచున్నది. ఆసత్తే ఆత్మయను నన్వయమున 'ఆత్మా వా ఇదమేక ఏవాగ్రే ఆసీన్నాన్య త్కించన మిషత్' (1-1-1) ఆత్మయే మొదట ఉండెను. మరేమియు లేదు అని ఐతరేయము, 'ఆత్మైవేద మగ్రే ఆసీత్' (1-4-1) ఆత్మయే ప్రథమమున గలదని తెలిసికొనుము అని బృహదారణ్యకము గూడ బోధించును. ఈ ఆత్మయే బ్రహ్మ మనుచు 'తత్...సనాతన మేకమేవాద్వితీయం బ్రహ్మ' (పైంగల. 1) 'బ్రహ్మ వా ఇదమగ్ర ఆసీత్' (బృ. 1-4-10) అనియు నుపనిషత్తులు అన్వయించియున్నవి. ఈ విధమున సృష్టికి బూర్వముగల సదంశము 'అస్తి భాతి ప్రియం రూపం నామంచే త్యంశ పంచకం। ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయం॥' (సరస్వతీరహస్య. 24) సచ్చిదానంద రూపనామములు పంచ అంశములనియు, నందు సచ్చిదానందములు బ్రహ్మరూపమై యుండ, రూపనామములు జగత్తుగ నిర్ణయింపబడి యుండుటచే సత్ సచ్చిదానంద లక్షణములు

గలది అని తాత్పర్యము. సుప్తకాలమున నామరూపములు ఘనస్వరూపములై అందు లయించియుండి, మరల జేతో ముఖము లగుచున్నవని తాత్పర్యము. అట్టి వ్యష్టి సంస్కార ముల ననేకముల గలిగి సమష్టిరూపమున నున్నవాడే యీశ్వ రుడు గదా. అతడే సగుణబ్రహ్మము. అనగా సమష్టిసంస్కార రూపుడే మహేశ్వరుడు అని పూర్వమే గ్రహించియున్నారము. అతడే యీస్థితి కధిష్ఠాత యయి సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాది లక్షణసంపన్నుడు. అతని నుండియే సర్వముయొక్క ప్రాదు ర్భావము.

ఈసృష్టికార్యమును వివరించుచు. మాండూక్యోపనిష త్తాత్పర్యము ననుసరించి, మకార మాత్రావశిష్టుడైన ఈశ్వరుడే ఓంకారస్వరూపు డగుటచే 'ఓంకార ప్రభవా దేవా ఓంకార ప్రభవాః స్వరాః । ఓంకారప్రభవం సర్వం త్రైలోక్యం సచరాచరం॥' (ధ్యానబిందు. 16) ఓంకారమునుండి సర్వము త్రైలోక్యమైన సచరాచరము ఉద్భవించినవని ధ్యానబిందు వచింప, 'బ్రహ్మణ స్సర్వభూతాని జాయంతే పరమాత్మనః' (4-5) సర్వభూతములును బరమాత్మ యగు బ్రహ్మమునుండియే జనితము అని యోగశిఖయు తెలుపుచున్నది. అటులే పైంగలము 'తస్మాదాత్మన ఆకాశ స్సంభూతః ఆకాశా ద్వాయుః వాయోరగ్నిః అగ్నే రాపః అద్భ్యః పృథివీ॥' ఆత్మనుండి ఆకా శము, దానినుండి వాయువు, దానినుండి అగ్ని, అగ్నినుండి ఉదకము, ఆపస్సునుండి పృథివి జనితము అని తైత్తిరీయక పాఠము (2-1) వలె తెలుపుచున్నది. ముండకశ్రుతి గూడ 'ఏతస్మా జ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణి చ । ఖం

వాయుర్జ్యోతి రాపః పృథివీ॥' (2-1-3) అని తదనువాదము జేయుచున్నది.

అదెట్లు సంభావ్యము అని ప్రశ్నించుకొని వచించినట్లు 'సేయం దేవ తైక్షత' (6-3-2) 'తదైక్షత బహుస్యాం ప్రజాయే యేతి । తత్తేజో సృజత' (6-2-3) నేను నానాత్వము నంది జనించెదగాక అని అది సంకల్పించెను. అది అగ్నిని సృజించెను అని ఛాందోగ్యము; 'సోకామయత బహుస్యాం ప్రజాయే యేతి । స తపో తప్యత। స తపస్తప్త్వా। ఇదం సర్వ మసృజత। యదిదం కిం చ॥'(2-6) నేను నానాత్వము నగుదునుగాక అని అతడు సంకల్పించెను. అతడు తప మాచరించెను. తపస్సు జేసి సర్వమును సృజించెను అని తైత్తిరీయము గూడ తెలుపుచున్నది. 'సర్వభూతాంతరాత్మా ఏకం రూపం బహుధా యః కరోతి' (1-5-12) తన ఏకత్వమును బహుధా కృత మొనర్చినవాడే సర్వభూతాంతరాత్మ యనియు కాఠకము వచించు చున్నది. 'రూపం రూపం ప్రతిరూపో బభూవ।' (2-5-19) ప్రతిరూపానుగుణ్యముగ నతడు మార్పుచెందెను అని బృహదారణ్యకము తెలుపుచు, 'అహం వావ సృష్టి రస్మి అహం హీదం సర్వమసృక్షీతి' (1-4-5) నేనే యీసృష్టిని, నేనే దీనిని సృజించితిని అనియు వచించుచున్నది. అనగా నాతడు సృజించి, అందు రూపరూపానుగుణముగ ప్రవేశించి, దాని గ్రహించి యుండెనని పైవాక్యముల తాత్పర్యము.

'మాయోపాధి ర్జగద్యోనిః సర్వజ్ఞత్వాది లక్షణః' (అధ్యాత్మ. 30) అనురీతి సృష్టికారణమైన ఈశ్వరుడు మాయోపాధి గలవాడై, 'మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం

తు మహేశ్వరః ' (శ్వే. 4-10) ప్రకృతియే మాయ అనియు నా మాయగలవాడే మహేశ్వరుడని గ్రహింపుము అను వాక్యమువోలె 'శుద్ధ సత్వ ప్రధానాయాం మాయాయాం బింబితో వ్యాజః । సత్త్వప్రధానా ప్రకృతి ర్మాయేతి ప్రతి పాద్యతే ' (సరస్వతీరహస్య. 14) శుద్ధసత్త్వ ప్రధానాంశమై ప్రకృతి నామమున బరగు మాయచే 'మాయయానావృతాః ' (పాశుపతబ్రహ్మ.33) నావరింపబడి, అయినను దాని స్వాధీనము గావించి, అనగ ' స్రష్టుకామో జగద్యోని స్తమోగుణ మధిష్ఠాయ సూక్ష్మతన్మాత్రాణి భూతాని స్థూలీకర్తుం సోకామ యత ' (పైంగల. 1) జగత్కారణుడైన మహేశ్వరుడు తమో గుణమైన శుద్ధమాయను అధిష్ఠించి, తన్మూలమున సూక్ష్మముగ నున్న తన్మాత్రలను స్థూలముగావింప సంకల్పించెనని స్పష్టము. ఈవిషయమును త్రిపాద విభూతిమహానారాయణము ' తస్మా త్పరబ్రహ్మణో ఽధస్తనపాదే సర్వకారణే మూలకారణావ్య క్తావిర్భావో భవతి । తస్మాదేవ సచ్ఛబ్దవాచ్యం బ్రహ్మవిద్యా శబలం భవతి। తతో మహత్॥' (2) ఆ పరబ్రహ్మమునుండి, సర్వకారణమైన క్రిందిపాదమునుండి మూలకారణమైన అవ్యక్త మావిర్భవించెను. దానినుండి అవిద్యాశబలితమైన సత్ వాచ్య బ్రహ్మము జనించెను. అతనినుండి మహత్ పుట్టెను అని వివరించియున్నది. ఈసృష్టి యంతయు బరబ్రహ్మమునుండిగాక మాయాశబల బ్రహ్మము నుండియే జనితము అనియు, నా బ్రహ్మము ' సత్ ' నామమున బరగుననియు స్పష్టపరచినది. కావున సృష్టియంతయు మాయావికారమే యని అనుచు 'తస్మాదత్రాన్నరూపేణ జాయతే జగదావళిః' (33) అందుచే

ప్రకృతి అనగ మాయారూపమున నే జగత్తులు జనించుచున్నవి అని రుద్రహృదయోపనిషత్తు వివరించియున్నది. అట్లు 'బ్రహ్మణోవ్యక్తం, అవ్యక్తాన్మహత్' (త్రిశిఖిబ్రాహ్మణ. 3) 'తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్, తన్నామరూపాభ్యాం ఏవ వ్యాక్రియత' (బృ. 1-4-7) ఈవిశ్వము పూర్వము అవ్యాకృతముగ నుండెను. అది నామరూపాత్మకముగ నొనరించెను అనియు నుపనిషత్తులు వానిని సృష్టితత్త్వమును సవివరముగ వివరించియున్నవి.

కేవలము సృష్టియొక్క ఆవిర్భావమును మాత్రమేగాక తిరోభావస్థితులగూడ 'యతో వా ఇమాని భూతాని జాయంతే। యేన జాతాని జీవంతి। యత్ప్రయంత్యభిసంవిశంతి। తద్విజిజ్ఞాసస్వ' (తై. 3-1) ఎచటనుండి యీభూతజాల ముద్భవించుచున్నది ? దేనివలన నది పోషింపబడుచున్నది ? దేనిలో లయించుచున్నది ? 'యతశ్చోదేతి సూర్యో ఽస్తం యత్ర చ గచ్ఛతి' (కఠ. 1-4-9) సూర్యు డెచట ఉద్భవించును ఎచట అస్తమించును అని ప్రశ్నించుకొని, 'తద్బ్రహ్మేతి' అదియే బ్రహ్మము అని నిశ్చయించినవి. అటులే 'నారాయణాదేవ సముత్పద్యంతే। నారాయణాత్ప్రవర్తంతే। నారాయణే ప్రలీయంతే'(2) అని నారాయణోపనిషత్తు, 'యశ్చ విశ్వం సృజతి విశ్వం బిభర్తి విశ్వం భుంక్తే స ఆత్మా' (2-0) ఏది విశ్వమును సృజించునో, విశ్వమును భరించునో, విశ్వమును లయింపజేయునో అది ఆత్మ అని శాండిల్యోపనిషత్తు, 'ఈశ్వరచైతన్యమాసీత్। స స్వాధీనమాయః సర్వజ్ఞః సృష్టిస్థితిలయానామాది కర్తా జగదంకురరూపో భవతి స్వస్మిన్ విలీనం సకలం జగదావిర్భా

వయతి' (1) ఈశ్వరచైతన్యము గలదు. అతడు స్వాధీన మాయకుడై సర్వజ్ఞుడై సృష్టిస్థితి లయాదికమునకు గర్తయగు జగదంకురరూపమును దాల్చును. అతనిలో సర్వము లయించి ఆవిర్భవించును అని పైంగలము బోధించుచున్నది. 'యస్మిన్ సర్వమిదం ప్రోతం బ్రహ్మ స్థావరజంగమం। తస్మిన్నేవ లయం యాంతి స్రవంత్యః సాగరే యథా॥' (17) ఎవరు స్థావరజంగమాత్మకసృష్టికి ప్రోతమో ఆబ్రహ్మములో సర్వము, సాగరములో నదులు లయించునట్లు లయించునని మంత్రికోపనిషత్తు తెలుప, 'సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలా నితి' (3–14–1) సర్వము బ్రహ్మమాత్రము, అచ్చటయే పుట్టి లయించుచున్నది అని సూత్రప్రాయముగ ఛాందోగ్యము వచించినది. కావున కేవలము సృష్టిమాత్రముగాక స్థితి లయములును బరమేశ్వర గమ్యములే యని ఉపనిషత్తుల తాత్పర్యము.

ఈ విషయమునే సోదాహరణముగ 'యథా సుదీప్తాత్ పావకాద్విస్ఫులింగాః సహస్రశః ప్రభవంతే సరూపాః' (ముం. 2–1–1) ఎట్లు ప్రజ్వలించు అగ్నినుండి అదేరూపముగల సహస్రాధికమిణుగురులుద్భవించునట్లు; 'స యథాగ్నే రభ్యాహితాత్ పృథగ్ధూమా వినిశ్చరంతి' (బృ. 2–4–10) తడికట్టెలతో బ్రజ్వలింపజేసిన అగ్నినుండి ధూమము పుట్టొందునట్లు 'స యథోర్ణనాభి స్తంతునోచ్చరేత్, యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చరంతి' (బృ. 2–1–20) సాలెపురుగు దారముల సృజించునట్లు అగ్నినుండి స్వల్పమైన కణము లుదయించునట్లు అని కొన్ని యుపనిషత్తులు వచింప, స్థితి లయముల గూడ నన్వయింప ముండకశ్రుతి 'యథోర్ణనాభిః సృజతే

గృహ్ణాతే చ। యథా పృథివ్యా మోషధయః సంభవంతి' (1-1-7) ఎట్లు సాలెపురుగు తంతువుల సృజించి లయించుకొనుచున్నదో, ఎట్లు పృథివినుండి ఓషధు లుదయించుచున్నవో యని విశాలమైన ఉదాహరణములతో వివరించియున్నది.

పూర్వగ్రంథము ననుసరించిచూడ శుద్ధమాయా శబలిత బ్రహ్మమే యీసృష్టికార్య మగ్నితనొంజుచున్నదని విదితము. అయిన నీమాయాస్వరూప మిట్టిదని దోచుట సముచితము. 'తమః శబ్దేనావిద్యా' (శ్రీ. మ. నా. 4) తమస్సు అనగ నవిద్య అనియు. 'మాయా చ తమోరూపానుభూతి స్తదేత జ్జడం మోహాత్మక మనంత మిదం' (నృ. ఉ. తా. 9) మాయ అనగ దమోరూపము అది జడము, మోహాత్మకము అనంతము అని నిర్వచనము. మాయ అనంతమైనచో ముక్తి ఎట్లు అను ప్రశ్న రాగలదు. కాని యిట అంతవంతమగు వ్యష్టిమాయగాక, అనంతమైన సమష్టిమాయయే చెప్పబడియున్నది. ఈమాయాశక్తి 'శక్తిద్వయం హి మాయాయాం విక్షేపావృతి రూపకం॥'(17)విక్షేపశక్తిర్లింగాది బ్రహ్మాండాంతం జగత్సృజేత్ । అంతర్దృగ్దృశ్యయోర్భేదం బహిశ్చ బ్రహ్మసర్గయోః॥ (18) ఆవృణోత్యపరా శక్తిః సా సంసారస్య కారణం' (సరస్వతీరహస్య. 19) విక్షేపావరణరూపములుగ మాయలో ద్వివిధశక్తులు గలవు. విక్షేపశక్తి బ్రహ్మాండాంతమైన జగత్సృష్టిని గావించును. దృగ్దృశ్యముల భేదము అంతరముగను, బ్రహ్మసర్గలకు భేదము బాహ్యముగను గలుగును. ఆవరణరూప అపరాశక్తి సంసారకారణము అని ఈవచనము. 'సంకోచ వికాసాత్మక మహామాయా విలాసాత్మకం ఏవ' (౩) మహా

మాయ సంకోచవికాసములుగలదై విలాసాత్మకముగనున్నది అనియు త్రిపాదవిభూతిమహానారాయణము నిర్వచించును. బ్రహ్మమునకు సకళ నిష్కళ సకళనిష్కళాత్మకముగ త్రివిధ రూపములు గలవు అని వచించుచు, నిష్కళమైనది సత్యమనియు, ద్వితీయము 'మూలాప్రకృతి ర్మాయా లోహిత శుక్ల కృష్ణా। తయా సహాయవాన్ దేవః' (3-0) మూలప్రకృతియు త్రిగుణాత్మకయు అయిన మాయాసహాయము పొందు దేవుడు సకళనిష్కళాత్మక మనియు, 'అకామయత బహుస్యాం ప్రజాయేయ' అని సంకల్పించుచు సర్వైశ్వర్యసంపన్నుడు, సర్వవ్యాపి, మాయావి, మాయతో క్రీడించువాడు సకల రూపుడు అని శాండిల్యము తెలుపుచు బ్రహ్మముపై మాయా ప్రభావమును వ్యక్తపరచుచున్నది.

ప్రథమమున నీమాయ వ్యవహరింపబడినట్లు గోచరించి నను, 'అజయ్యా వైష్ణవీ మాయా వ్యజేన సా జితా పురా' (కృష్ణ. 7) వైష్ణవమాయ అజేయమైనది బ్రహ్మదేవునిచేగూడ అజేయము, 'వైష్ణవీ మహామాయా' (త్రి. మ. నా. 6) అని వచించుచు, నీ 'మాయా సా త్రివిధా ప్రోక్తా సత్వరాజసతామసీ' (కృష్ణ. 5) అనబడు త్రిగుణాత్మకమాయ వైష్ణవశక్తిగ జేసి, 'సమస్తబ్రహ్మాండ సమష్టి జననీం వైష్ణవీం మహామాయాం నమస్కృత్య' (త్రి. మ. నా. 6) సమస్త బ్రహ్మాండములకు సమష్టిజననియు వైష్ణవశక్తియు అయిన మహామాయకు నమస్కరించి అనియు, 'హృదయే చైతన్యరూపిణీం నిరంజనాం త్రికూటాఖ్యాం స్మితముఖీం సుందరీం మహామాయాం సర్వ సుభగాం' (త్రిపురతాపిని. 1) అనియు ఉపనిషత్తులు మహా

మాయాస్వరూపమును, బ్రహ్మశక్తిగనే అన్వయించి మ్రొక్కినవి. 'య ఏతాం మాయాం శక్తిం వేద స పాప్మానం తరతి' (నృ. పూ. తా. 3-0) ఎవడు యీ మాయాశక్తిని గ్రహించుకొనునో వాడు పాపములనుండి విముక్తి గాంచుననియు బోధించినవి. 'త్రిశక్తి మాయాస్వరూపో నాన్యో మదస్తి' (పాశుపతబ్రహ్మ. 1) త్రివిధశక్తితో గూడిన మాయ నాకన్యముగాక నాదియే అని దాని స్థితిని బ్రహ్మేతరముకాదని తీర్మానించుటకై, 'పరమార్థతో న కించిదస్తి క్షణశూన్యానాది మూలావిద్య విలాసత్వాత్' (త్రి. మ. నా. 3) పారమార్థికముగ ఏమియు లేదు. క్షణమైనలేని అనాదిమూలావిద్యా విలాసమునగాక 'నాస్తి మాయా చ వస్తుతః' (పాశుపతబ్రహ్మ. 45) వస్తుతః మాయ లేదనియు జిత్రింపబడియున్నది.

ఈ అవిద్యాప్రభావముననే 'ప్రకాశతే స్వయం భేదః కల్పితో మాయయా తయోః' (అన్నపూర్ణ. 4-33) మాయాకల్పితమై జీవేశ్వరులకు భేదము ప్రకాశించుచున్నది. అదియే 'ఉపాధి పర జీవయోః' (అధ్యాత్మ. 32) జీవేశ్వరుల కుపాధియై, 'దుర్బోధం కుహాకం తస్య మాయయా మోహితం జగత్ దుర్జయా సా సురైః సర్వైః' (కృష్ణ. 12) ఆపరమేశ్వరుని మాయాస్వరూపము దుర్బోధ్యమయినది. ప్రపంచము యీ మాయచే మోహితమైనది. ఆమాయ దేవతలచేతను జయింపరానిది అగుటచే, 'మాయాసంబంధతః చ ఈశో జీవోఽవిద్యావశ స్తథా' (కఠరుద్ర. 39) మాయాసంబంధముచేత ఈశుడును జీవుడు నవిద్యావశత్వమున నేర్పడుచున్నారు. యథార్థమున 'ఘటాకాశ మఠాకాశౌ మహాకాశే ప్రతిష్ఠితౌ। ఏవం మయి

చిదాకాశే జీవేశౌ పరికల్పితౌ॥' (వరాహ. 2-51) ఘటాకాశ మఠాకాశములు మహాకాశములో సుప్రతిష్ఠితమైయున్నట్లు, నాచిదాకాశములో జీవేశ్వరులు కల్పితము. 'యథాకాశో ఘటాకాశో మఠాకాశ ఇతీరితః। తథా భ్రాంతై ర్ద్విధా ప్రోక్తో హ్యాత్మా జీవేశ్వరాత్మనా॥' ( జాబాలదర్శన. 10-4, అన్నపూర్ణ. 5-77) ఎట్లు ఆకాశము ఘట మఠాకాశములుగ జెప్పబడుచున్నదో అట్లు భ్రాంతిచే జీవేశ్వరులని ద్విధా ఆత్మయే చెప్పబడుచున్నది. 'ఘటాకాశ మఠాకాశౌ యథాకాశ ప్రభేదతః। కల్పితౌ పరమా జీవ శివరూపేణ కల్పితౌ॥' (రుద్ర హృదయ. 43) 'మాయా తత్కార్యవిలయే నేశ్వరత్వం న జీవతా' (2-52) మాయా దానికార్యము నశింపగా జీవత్వము లేదు ఈశ్వరత్వముగూడ లేదు అని వరాహోపనిషత్తు వివరించి నది. కావున 'మాయాక్లృప్తౌ బంధమోక్షౌ న స్తః స్వాత్మని వస్తుతః' (ఆత్మ. 26) బంధమోక్షములు మాయాకల్పితములు. ఆత్మలో వస్తుతః లేవు అనియుగూడ మాయా తత్సంబంధ కార్యములు వస్తుతః అభావములనియు భ్రాంతిజన్యములనియు వివరింపబడెను.

'ఆభాసమాత్రమేవేదం న సన్నాస జ్జగత్రయం' (అన్నపూర్ణ. 5-33) ఇదియంతయు నాభాసమే. సత్తుగాని అసత్తుగాని జగత్రయముకాదు; 'మాయామాత్రం జగ త్కృత్స్నం' (జాబాలదర్శన. 10-12) సమస్తజగత్తు మాయా మాత్రము; 'ఉత్పద్యంతే విలీయంతే మాయామాతుత విభ్రమాత్' (కుండిక. 14) మాయా వాయుప్రభావమున బుట్టుచు లయించుచున్నది; 'అస్మాన్మాయా సృజతే విశ్వమేతత్ తస్మిం

శ్చాన్యో మాయయా సన్నిరుద్ధః' (శ్వే. 4-9) మాయా సహితుడై అతడు విశ్వమును సృజించెను. జీవుడు మాయచే దీనికి బద్ధుడై యుండును;'యద్ధరితం తన్మాయయా' (అవ్యక్త) మాయచే నది భరింపబడుచున్నది 'సకలా మాయయా చ' (త్రిపుర తాపినీ. 8) సర్వము మాయవలననే అని యుపనిషత్తులు మాయాజనితమే యీ జగత్తు అని ఉపదేశించి యున్నవి. అంతియగాక 'సత్యవ ద్భాతి తత్సర్వం రజ్జుసర్పవదాస్థితం' (రుద్రహృదయ. 134) రజ్జు సర్పమువలె నుండియు సత్పదార్థము వలె సర్వము గోచరించును. 'గంధర్వనగరోపమే కదలీగర్భవ న్నిస్సారే జలబుద్బుదవ చ్చంచలే' (సుబాల. 7) గంధర్వనగర సమానమై, కదలీగర్భమువలె నిస్సారమై, బుద్బుదమువలె చంచలమై సృష్టియున్నది 'యదిదం దృశ్యతే కించి త్తత్తన్నా స్తీతి భావయ। యథా గంధర్వనగరం యథా వారి మరుస్థలే॥' (అన్నపూర్ణ. 1-20) ఏది చూడబడుచున్నదో అది లేదని భావింపుము. గంధర్వనగరమువలె, ఎండమావులో నీరమువలె భ్రాంతి. 'దీర్ఘస్వప్న మిదం యత్తదీర్ఘం వా చిత్తవిభ్రమాత్' (వరాహ. 2-64) ఇది దీర్ఘమైన స్వప్నము. ఆదీర్ఘత్వము చిత్తభ్రాంతివలననే గలుగుచున్నది అని పలువిధముల సృష్టి యొక్క భ్రాంతిని ఉపనిషత్తులు నిరూపించియున్నవి. ఈవిషయ మును అన్నపూర్ణోపనిషత్తు పరిశీలించి, 'భ్రమ పంచవిధో భవతి తదేవేహ సముచ్యతే। జీవేశ్వరౌ భిన్నరూపావితి ప్రాథ మికో భ్రమః ॥ (1-13) ఆత్మనిష్ఠం కర్తృగుణం వాస్తవం వా ద్వితీయకః। శరీరత్రయసంయుక్త జీవః సంగీతృతీయకః॥ (14) జగత్కారణరూపస్య వికారిత్వం చతుర్థకః। కారణా ద్భిన్న

జగతః సత్యత్వం పంచమో భ్రమః॥ పంచభ్రమ నివృత్తిశ్చ తదా స్ఫురతి చేతసి ॥' (15) భ్రమ పంచవిధము లని చెప్పబడును. జీవేశ్వరులు భిన్నరూపు లనుట ప్రథమము. ఆత్మకు కర్తృత్వాదికము వాస్తవమనుట ద్వితీయము. జీవుడు శరీరత్రయోపేతుడై సంగముగలవా డనుట తృతీయము. జగత్కారణము వికారము పొందినదగుట చతుర్థము. కారణ భిన్నమగు జగత్తు సత్యమనుట పంచమము అని చక్కగ వివరించి యీపంచభేద నివృత్తిచే నాత్మ గోచరమని స్పష్ట పరచినది.

ఈవిషయముల గారికాకర్తుడైన గౌడపాదాచార్యుడు నిస్సంకోచముగ ప్రతిపాదించి తీర్మానించియున్నాడు. 'మనో దృశ్య మిదం ద్వైతం యత్కించి త్సచరాచరం। మనసో హ్యమనీ భావే ద్వైతం నైవోపలభ్యతే॥' (3-31) చరాచరాత్మకమైన ఈద్వైతమంతయు మనోదృశ్యము. మనసు అమనస్కమైనచో ద్వైతము అనుభూతముకాదు. 'నాఽఽకాశస్య ఘటాకాశో వికారావయవౌ యథా। నైవాత్మనః సదా జీవో వికారావయవౌ తథా॥'(3-7) ఎట్లు ఘటాకాశము మహాకాశముయొక్క వికారముగగాని భాగముగగాని లేదో, అట్లు జీవుడు ఆత్మ వికారముగగాని అవయవముగగాని లేడు. 'ఘటాదిషు ప్రలీనేషు ఘటాకాశోదయో యథా। ఆకాశే సంప్రలీయంతే తద్వజ్జీవా ఇహాఽఽత్మని॥' (3-4) ఘటాదులు లయింప ఘటాకాశము ఆకాశమున లయించు చందము ఆత్మలో జీవుడు లయించును. 'యథా భవతి బాలానాం గగనం మలినం మలైః। తథా భవ త్యబుద్ధానా మాత్మాఽపి మలినో మలైః॥' (3-8) బాలురకు

ఆకాశము మలినమైనట్లు దోచువిధాన, అజ్ఞులచే నాత్మ మలిన మైనట్లు భావింపబడును. 'అనిశ్చితా యథా రజ్జు రంధకారే వికల్పితా। సర్ప దారాదిభి ర్భావై స్తద్వ, దాత్మా వికల్పితః॥ (2-17) అనిశ్చయమైన రజ్జువు అంధకారములో సర్ప దార ములలోతె భావింపబడురీతి ఆత్మ భావింపబడుచున్నాడు. 'నిశ్చితాయాం యథా రజ్జ్వాం వికల్పో వినివర్తతే। రజ్జురేవేతి చాద్వైతం తద్వదాత్మ వినిశ్చయః॥' (12-19) రజ్జుత్వము నిశ్చయము కాగ వికల్పములు నివర్తించి అది నిర్వికారమైన త్రాడు అని గోచరించునట్లు, ఆత్మ నిశ్చయతత్వముగూడ నటులే యగును. 'స్వప్నమాయే యథా దృష్టే గంధర్వనగరం యథా।తథా విశ్వమిదం దృష్టం వేదాంతేషు విచక్షణైః॥'(2-31) స్వప్న భ్రాంతి,గగన నగరములవలె ప్రపంచమును వేదాంతులు గాంచెదరు. 'సంఘాతాః స్వప్నవత్సర్వే' (3-10) సంఘాతము లన్నియు స్వప్నతుల్యములు. 'ఆదావంతే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా। వితథైః సదృశాః సంతోఽపి తథా ఇవ లక్షితాః॥' (2-6) ఆద్యంతముల నభావమైనది మధ్యలోగూడ శూన్యమేయగును. విషయములు భ్రాంతి గోచరములు అయినను సత్యములని భావింపబడుచున్నవి. 'మోఽస్తు కల్పిత సంవృత్యా పరమార్థేన నాస్త్యసౌ' (4-73) భ్రాంతిమూలమున దోచున దంతయు యాథార్థమున లేదు అని కారికలలో బై యుపనిషద్భావముల మాత్రమే అదే పరిభాషలో నదే ఉపమానములతో గౌడపాదుడు స్పష్ట పరచియుండుట గమనార్హము. అనగ కారికాభావములు గౌడపాదకల్పితములుగాక ఉపనిషజ్జనితములే యని నిశ్చయము.

పైవిధముగా సర్వసృష్టియు కేవలము మాయాజన్యముగ నిశ్చయించి, అదియు నభావమే అని ముందు దీర్మానించుచున్నవి. 'భేద స్తయో ర్వికారః స్యాత్ సర్గో న బ్రహ్మణి క్వచిత్' (23) వికారమువలన మాత్రమే భేదము వానియందు గోచరము కాని బ్రహ్మములో సర్గము కొంచెముగాని లేదు అని సరస్వతీరహస్యము వచింప, 'బ్రహ్మ వ్యతిరిక్తం న కించిదస్తి' (త్రి. మ నా. 4) బ్రహ్మ భిన్నము అసలు లేదు అని మహానారాయణము దీర్మానించెను. ఎందుచే ననగ 'ఏకమేవాద్వితీయం నేహ నానాస్తి కించన' (3) అనియు మహానారాయణ వివరణము. మరియు 'తత్త్వదృష్ట్యా తు నాస్త్యేవ తత్త్వమేవాస్తి కేవలం' (పాశుపతబ్రహ్మ. 19) తత్త్వదృష్టితో జూచిన జగత్తు లేదు. తత్త్వమే యున్నది. 'తస్మా దద్వైత మే వాస్తి న ప్రపంచో న సంసృతిః' (జాబాల దర్శన. 10–3) అందుచే అద్వైతమే గలదు, ప్రపంచ సంసృతులు లేవు అనియు దెలుప, వాని వివరించుచు వరాహోపనిషత్తు న దేహో నేంద్రియ ప్రాణో న మనో బుద్ధ్యహంకృతి। న చిత్తం నైవ మాయా చ న చ వ్యోమాదికం జగత్ ॥ 'న కర్తా నైవ చ భోక్తా న చ భోజయితా తథా।' (3–19) దేహేంద్రియ ప్రాణ మనో బుద్ధి అహంకార చిత్తములు మాయ ఆకాశాదికము జగత్తులు లేవు. కర్త భోక్త భోజ్యములుగూడ నటులే అభావము అని బోధింప, 'నాస్తి చిత్తం న చావిద్యా న మనో న చ జీవకః।'(5–10)అని అభావములనే అన్నపూర్ణ అనువదించియున్నది. అదే విధముగ 'న జాయతే న మ్రియతే కించి దత్ర జగత్రయే। న చ భావవికారాణాం

సత్తా క్వచన విద్యతే॥' (4-120) జగత్త్రయమున జనించునది నశించునది కొంచెమేనియూ లేదు. భావవికారములకు సత్తా యిసుమంతయు లేదు అని మహోపనిషత్తు వచించును. ఈ విషయమునే మరియు నిస్సంశయముగ 'న నిరోధో న చోత్పత్తి ర్న బద్ధో న చ సాధకః । న ముముక్షు ర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా॥' (31, 8, 5-10) ఉత్పత్తి ప్రళయమును, బద్ధత్వము సాధకులును, ముముక్షు మోక్షములు పూర్తిగా లేవు ఇదియే పరమార్థము అని ఆత్మ, అవధూత, త్రిపురతాపినీత్యాది అనేక ఉపనిషత్తులు పర్యవసానవాక్యముల వచించియున్నవి. ఇదియే గౌడపాదప్రోక్త అజాతివాదమునకు ప్రాతిపదిక యని నిశ్చయము. గౌడపాదులును, 'న నిరోధ'(2-32)శ్లోకమునే ప్రతిపాదించి వివరించి నిర్ణయించినట్లు విస్పష్టము. 'భూతం న జాయతే కించి దభూతం నైవ జాయతే' (4-4) సత్తు మరల పుట్టదు. అసత్తు అటులే అసలు పుట్టొందదు. 'అశక్తి రపరిజ్ఞానం క్రమకోపోఽథ వా పునః । ఏవం హి సర్వథా బుద్ధైః అజాతిః పరిదీపితా॥' (4-19) సమాధానమొసంగ నశక్తతచే, విషయము తెలియకుండుటచే, కార్యకారణత్వ సంబంధ క్రమనిర్ధారణము దుస్సాధ్యమగుటచే, జ్ఞానులు సంపూర్ణ అజాతివాదముననే సుస్థిరులై యున్నారు. 'స్వతో వా పరతో వాఽపి న కించిద్వస్తు జాయతే । సదసత్సద సద్వాఽపి న కించిద్వస్తు జాయతే॥' (4-22) స్వతఃగాని పరతఃగాని ఎద్దియును జనింపలేదు. సత్తుగాని అసత్తుగాని, సదసత్తుగాని ఎద్దియు జనింపలేదు. 'అజాతస్యైవ సర్వస్య' (4-77) అటులే సర్వము అజాతమే. కావున, 'నాఽఽత్మ భావేన

నానేదం న స్వేనాపి కథంచన। న పృథఙ్ నాపృథక్కించిత్ ఇతి తత్త్వవిదో విదుః॥' (2-34) ఆత్మభావమునగాని ఆత్మేతరముగ గాని యీ నానాత్వము లేదు. అట్లే యిది బ్రహ్మభిన్నముగగాని భిన్నముగగాని లేదు అని తత్త్వవిదుల నిశ్చయము. 'న కశ్చి జ్జాయతే జీవః సంభవోస్య న విద్యతే। ఏతత్తదుత్తమం సత్యం యత్ర కించి న్న జాయతే॥' (4-71) ఎట్టి జీవుడును జనింపలేదు. అట్టి పుట్టుకకు కారణము గూడ నభావము. ఏదియు జనింపలేదనుటయే ఉత్తమ సత్యముగా గౌడపాదాచార్యవర్యుడు ఘంటాపథముగ నిస్సందేహముగ యుక్తియుక్తముగ ఉపనిషత్తాత్పర్యమును అనువదించి యున్నాడు. అందుచే నీ మాయావాదము గౌడపాదుని స్వకపోల కల్పనము గాదని గమనార్హము.



# ఏడవ మంత్రము

నాన్తఃప్రజ్ఞం న బహిష్ప్రజ్ఞం
నోభయతఃప్రజ్ఞం న ప్రజ్ఞానఘనం
న ప్రజ్ఞం నాప్రజ్ఞం।
అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ
మచింత్య మవ్యపదేశ్య మేకాత్మప్రత్యయసారం
ప్రపంచోపశమం శాంతం శివ మద్వైతం
చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః॥

తురీయుడు అంతఃప్రజ్ఞుడు గాడు, బహిష్ప్రజ్ఞుడు గాడు. ఉభయప్రజ్ఞుడును గాడు. ప్రజ్ఞానఘనుడును గాడు. ప్రజ్ఞా

ప్రజ్ఞుడుగూడ కాడు. అదృష్టము అవ్యవహార్యము, అగ్రాహ్యము అలక్షణము, అచింత్యము అవ్యపదేశ్యము ఏకాత్మప్రత్యయ సారము ప్రపంచోపశమము, శాంతము శివము అద్వైతమైనది చతుర్థముగ గ్రహింపబడును. అదియే ఆత్మ, అది విజ్ఞేయము.

ఈమంత్రముద్వార మాండూక్యము చతుర్థమైన తురీయుని బూర్ణావస్థావిదూరునిగ జిత్రించియున్నది. అవస్థా త్రయరాహిత్యమే సర్వజగద్రాహిత్యము. అనగ ప్రాజ్ఞునిలో ప్రధానముగనున్న అజ్ఞానము, తదంతర్గతమైయున్న సంస్కార రూప ప్రజ్ఞానఘనత్వము, అంత నది సూక్ష్మముకాగ నగు నన్యథాజ్ఞానరూప స్వప్నము, నదియు స్థూలాకృతివహింపనగు అన్యథాజ్ఞానరూప జాగ్రదవస్థాది త్రయము తురీయునియం దభావమనియే యీమంత్రము వివరించును. ఎన్నివిధములుగ నా యభావము సాధ్యమో వివరించి తుదకు అదియే అద్వైత మనియు, నదియే చతుర్థమనియు నామంత్రము తెలిపియున్నది. ఈమంత్రమున సర్వోపనిషద్గత బ్రహ్మనిర్వచనము లన్నియు, సూత్రప్రాయముగ సూచింపబడియున్నవి. అందుచే నీమంత్రము ముఖ్యమై బ్రహ్మమునుగూర్చి సర్వతోముఖ నిర్వచనరూపమై రాజిల్లుచున్న దనుట సముచితము.

ఇట్లు, అవస్థాత్రయవిదూరము అనుటతో సర్వశూన్య వాదము ఆపాదింపకుండుటకు ప్రపంచోపశమవాక్యానంతరము శాంత శివ మద్వైత పదము లుపయోగింపబడి అవస్థాత్రయే తరమైన అమనస్కతత్త్వ మొండు అట గలదను రహస్యమును సూచించుచున్నది. రజ్జు సర్పభ్రాంతిలో సర్పభ్రాంతి నిరాసము కాగ రజ్జువు గోచరించినను, రజ్జుజ్ఞానము లేకున్న మరల

తానిపై బుద్బుదమాలా దండాదిక(భ్రాంతి గలుగ నవకాశ మున్నట్లు, అవస్థాత్రయవిదూరమని గ్రహించినంతమాత్రమున అభావప్రజ్ఞమాత్రము గలుగుటగాని ఆత్మజ్ఞానము కాదనియు, నందుచే ఆత్మయందు అభావరూపమను భ్రాంతి కలుగకుండుటకు యీమంత్రము చాలజాగ్రత వహించి, అదృష్టాది వ్యతిరేక పదములతో, శాంత శివాది అనుకూల పదప్రయోగము గావించి, ఆత్మయొక్క సత్ అసత్ సదసత్ రూపత్రయమును నిరాకరించుట గాక, సదసద్విలక్షణత్వమును బ్రతిపాదించి, ఆత్మయొక్క అనిర్వాచ్య భావస్థితిని స్థాపించి యున్నది. కావున ద్వైతానుపలబ్ధిమాత్రముగాక ఆత్మోపలబ్ధి గూడ నిట అవసర మగుచున్నట్లు విదితము. దుఃఖనివృత్తి పరమానందప్రాప్తియే గదా సముచితనిర్ణయము.

అవస్థాత్రయమున తురీయము అధిష్ఠానరూపమున అంతర్గతమై యున్నను, అది అవిజ్ఞేయమై యొప్పారుటచే, ప్రథమతః దాని విస్మరణరూప అజ్ఞానము ఏర్పడి ప్రాజ్ఞస్థితి గలిగినట్లు గ్రహించి యున్నారము. అజ్ఞానకారణమున, అనగ అధిష్ఠానమునుగూర్చిన అజ్ఞానకారణము, రజ్జుజ్ఞానము లేమిచే సర్పాది వివిధరూప అన్యథాజ్ఞానము లుత్పత్తిల్లుచందము, ఆత్మపై స్వప్నాదిక అన్యథాజ్ఞానము లేర్పడి తైజస విశ్వాది భ్రాంతుల గలుగజేసి, తజ్జనిత అహం మమాదిపాశములబంధించి సంసృతిబద్ధునిగ నీయజ్ఞానము జీవుని గావించుచున్నది. అందుచే సర్వకల్పనావిదూరమనియు నీమంత్రము నిశ్చయించి, కల్పనల కధిష్ఠానమైన ఆత్మ సుస్థిరము అవిజ్ఞేయము అని నిర్ణయించి,

అది అద్వైతము శాంతము మంగళకరము అని బోధించి, తురీయుని అవాఙ్మానస గోచరత్వమును ప్రకటించియున్నది.

'నాంతః ప్రజ్ఞం' అంతః ప్రజ్ఞా ప్రధానుడైన స్వప్నావస్థా మూర్తియైన తైజసుడు తురీయము గాదు. అటులే 'న బహిష్ప్రజ్ఞం' బహిష్ప్రజ్ఞ గలిగి స్థూలభుగ్రూపముననున్న జాగ్రదవస్థాపురుషుడైన విశ్వుడును గాడు. ఉపనిషత్తు జాగ్రదవస్థతో బ్రారంభించి, దానిని ప్రథమపాదమని వ్యవహరించి, యిట నీమంత్రమున దానిని ద్వితీయముగ ద్రోసిపుచ్చి, పూర్వము ద్వితీయముగనున్న స్వప్నమును ప్రథమమున ప్రస్తావించుట గమనార్హము. అన్యథాజ్ఞానరూప స్థూల సూక్ష్మములలో తురీయునకు అజ్ఞానరూప నిద్రకు దర్వాత సూక్ష్మమైన స్వప్నమే సన్నిహితము కావున నది ముందు స్థానము నలంకరించి త్రోసివేయబడియున్నది. ప్రథమతః ఉద్భూతసంస్కార సూక్ష్మత్వమే నిరాస మొనర్పబడ నిక వానిస్థూలాకృతి వేరుగ నిరాకృతి నొంద నవసరము లేదని తాత్పర్యము. అటులే 'ఉభయతః ప్రజ్ఞం' అనగా స్వప్నజాగ్రదావస్థ అస నగును. జాగ్రత్తులోనుండి పూర్వస్మృతిజన్య దృశ్యములతో మగ్నత జెందియుండు స్థితిగూడ నిట త్యజింపబడియున్నది. మరల నీ మూడు ఉద్భూత సంస్కారములకు అనుద్భూతరూపుడైన ప్రజ్ఞానఘనుడును కాడని 'న ప్రజ్ఞానఘనం' అని నిరాకరింపబడినది. ఇంతటితో అవస్థాత్రయ నిరాసము జరిగినది. మరియు 'న ప్రజ్ఞం' అనుటచే పై అవస్థాత్రయవిలక్షణమైన సర్వజ్ఞత్వాది లక్షణములు గూడ నిట నభావము అని తీర్మానము. అయినచో నిక సర్వశూన్యమా అను సందేహము నివారింప,

'నా ప్రజ్ఞం' అని నిరాకరించి, అప్రజ్ఞారూపమైన జడత్వము గూడ బూర్వపక్షము గావింపబడియున్నది. అనగ సామాన్యముగ మనకు అనుభవవేద్యమైన ప్రజ్ఞారూపములన్నియు దురీయునిలో నభావములే యని మంత్ర పూర్వభాగము స్పష్టపరచియున్నది.

ఈ విషయమునే యింక విస్పష్ట మొనరింప మంత్రము యొక్క ఉత్తరభాగము ప్రారంభము. 'అదృష్టం' అనుటచే సర్వేంద్రియములకు నయనప్రధానము గాన నది గైకొనబడి, దాని వృత్తి తురీయుని విషయముల నశక్తము అని జ్ఞానేంద్రియ వృత్తుల నన్నింటిని ఉపనిషత్తు త్రోసిపుచ్చినది. జ్ఞానేంద్రియ వ్యవహారమునకు నతీతుడై యుండి క్రియారహితుడగుటచే నేవ్యవహారములును అతనిగూర్చి జరుగనేరవు గాన 'అవ్యవహార్యం' అనబడినది. అట్టివాడు కర్మేంద్రియములకు అతీతుడని వేరుగ జెప్పనవసరము లేదు కాన 'అగ్రాహ్యం' అనబడినది. పై నుదాహరింపబడిన చందము కర్మజ్ఞానేంద్రియాతీతుడై యుండుటచే బ్రత్యక్ష ప్రమాణబద్ధుడు కాడని విదితము. అయినచో అతని లక్షణముల నేర్చి గ్రహింప నుపయుక్తమగు అనుమానప్రమాణమునకు అతడు అందునా అన అట్టి లక్షణములు అతనికి లేవు అని 'అలక్షణం' అను పదము బోధించును. అట్లు ప్రత్యక్షానుమానముల కతీతుడగుటచే నత 'డచింత్యం' అనబడుచు, సర్వవిధ చింతనావిదూరుడని నిశ్చయింపబడినది. అట్టిచో నతనిగూర్చి గ్రహింప శబ్ద ప్రమాణము గలదుగదా అని తృప్తివహింప యత్నింప నదియు గాదని 'అవ్యపదేశ్యం' అని తెలుపబడియున్నది. అనగ

నెవ్విధముగనైన వివరింపబడుట కలవికాని వాడు అని అర్థము. అట్లైన నత డున్నట్లు ఎట్లు గ్రహించుట అను సంశయనివారణము నకై యతడు అధిష్ఠానముగ బూర్వగత జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలలో ఏకముగ సారభూతముగ నున్నాడని 'ఏకాత్మప్రత్యయ సారం' అని వచింపబడెను. అనగ నదియే లేకున్న యీ యవస్థాదులును అభావములే యగుచున్నవి. వాని లక్షణము లింకు లేశమాత్రమైనను లేకున్నను, వాని యునికి కాధారమైన అధిష్ఠానము తురీయుడై యున్నాడు. అట్లైన విశ్వ తైజస ప్రాజ్ఞ ధర్మములు యిసుమంతగనైన లేకున్న వాని కధిష్ఠాత యగుట దుర్లభముగదా! అందుచే విశేషలక్షణములలో వ్యత్యాస మున్నను, కొన్ని సామాన్యలక్షణములైన తురీయునం దుండు నను వాదమునకు సమాధానముగ 'ప్రపంచోపశమం' అని తెలిపి, సర్వవిధ ప్రపంచము అట ఉపశమనమే అని తీర్మానింప బడియున్నది. అనగ నిందు స్థూల సూక్ష్మకారణములైన అన్యథాజ్ఞానాజ్ఞానములును, సంస్కారబీజములును బూర్తిగ నభావము అని వచింపబడియున్నది. ఆవిధముగ నశాంతి కారణములైన సర్వప్రవృత్తులు అందు లేకుండుటచే సుఖదుఃఖ రూప సర్వద్వంద్వరహితుడై యుండుటను 'శాంతం' అని అనుకూల పదప్రయోగము ఇట గావింపబడియున్నది. అందుచే నిక నెట్టి వికారములు లేకుండుటచే వాని కవకాశముగూడ నభావమగుటచే 'శివం' మంగళప్రదము అని బోధింపబడి యున్నది. అనగ బునరావృత్తికారణ సర్వావకాశములు అట లేకుండుటచే నది నిత్య మంగళస్వరూపమే అగుచున్నది. అయిన నిక నిట నేమిగలదు? అచట 'అద్వైతం' ఒక్కటియే

గలదు. ఇతరములుండినగదా ఒక్కటియే యని నిర్దేశించుట. కాన నది అనిర్వాచ్యముగ నున్నది అని మాత్రము వచింపనగును. సజాతీయ విజాతీయ స్వగత విభేదరహితుడై అతడుండునని మాత్రము వచింప సాధ్యమేమో! అదియే చతుర్థమైన తురీయునిగా 'మన్యంతే' గ్రహింపబడును. అనగ నిట్లు శ్రవణ మననపూర్వకముగ పరోక్షముగ గ్రహింపుము అని ఆదేశము. అదియే ఆత్మసుమా అని యింతవరకు విచారింపబడిన అవస్థాత్రయవిదూరతత్త్వము అన్యముగ భావించి భ్రాంతినొందకుండుటకు ద్వితీయమంత్రస్థ 'అయ మాత్మా బ్రహ్మ' అను మహావాక్యములోని ఆత్మ పదమును మరల నిట అనువదించి, పూర్వము శ్రవణవాక్యమున 'తత్త్వమసి' లో బోధింపబడిన 'త్వం' పదము అట వాచ్యమై లక్ష్యముగ ఆత్మ పదమును గ్రహించియుండుటచే, ప్రస్తుత ఆత్మపదము అవస్థాత్రయ విదూరమైన తత్త్వముగ విశ్వ తైజస ప్రాజ్ఞవిచారణమున దెలిసియుండుటచే, నాయాత్మయే బ్రహ్మమనియు, నదియే 'అహం' అను లక్ష్యమును ముందుంచి, ప్రస్తుతాత్మను వాచ్యముగ గావించి, 'అహం బ్రహ్మాస్మి' అను నిదిధ్యాసన వాక్యరహస్యమును గ్రహించి,'స విజ్ఞేయః'అను రీతి నంతవరకు గ్రహింపసాధ్యమగు రహస్యము నెరిగించి, స్థితివాక్యమైన 'ప్రజ్ఞానం బ్రహ్మ' అను చతుర్థవాక్యమునకు పయనముసాగింపుమా అని మాండూక్యోపనిషత్తు ఉద్బోధించుచున్నది. 'అహం బ్రహ్మాస్మి' అను నిదిధ్యాసనవాక్యమే చరమవృత్తి యగుటచే నింతవరకే 'విజ్ఞేయత్వము' సాధ్యము గాన, అంతవరకు మాత్రము యీ మంత్రము సూచించుచున్నట్లు స్పష్టము. ఇక నీ భావముల

నితర శ్రుతు లెట్లు తెలిపియున్నవో గ్రహింప యత్నించెదము గాక.

'చతుర్థీ తురీయం' (అథర్వశిఖ) 'యావసానేస్య చతుర్థమాత్రా' (అథర్వశిఖ) అవసానమున అతని చతుర్థమాత్ర తురీయము అని నృసింహపూర్వతాపినీ మొదలగు ఉపనిషత్తులు గూడ వచించుచున్నవి. 'కేవల జీవయుక్తమేవ తురీయమితి' (శారీరక. 5) సర్వ విక్షేపావరణ మాయారహితమైన జీవరూప ఆత్మగలదియే తురీయమని శారీరకము, 'తురీయే కేవల పరమాత్మ సంబంధినీ భవతి నిత్యబోధస్వరూపా భవతి' (94) తురీయమున జీవుడు కేవలపరమాత్మ సంబంధమును బొంది సర్వమాయారహిత నిత్యబోధస్వరూపమే అగును అని ధ్యానబిందు, 'చతుర్థ శ్చతు ర్థాత్మాపి సచ్చిదేకరసో హ్యయం' (నా. ప. 8-16) నాలుగవ అవస్థలో దురీయుడు సచ్చిదేకరస స్వరూపుడై యుండును అని నారదపరివ్రాజకము దెలుపుచున్నవి.

పూర్వమే వచింపబడినచందము 'తురీయం మూర్ధ్ని సంస్థితం' (బ్రహ్మ. 24, నా. ప. 5-1) తురీయునిస్థానము నిస్సంకోచముగ శిరస్సుగ దీర్మానమే అయియున్నది. ఈ విషయమున నుపనిషత్తులన్నియు నేకవాక్యముగ దెలుపుచున్నవి.

అధికసంఖ్యాకమైన యుపనిషత్తులు మాండూక్యమంత్రమునే యథాతథముగ గైకొన ఒకించుక మార్పులతో గొన్ని స్వీకరించినవి. ఆ మార్పులు భాషలో గలవు గాని భావభేదము గానరాదు. 'నాంతః ప్రజ్ఞం న బహిష్ప్రజ్ఞం న స్థూలం

నాస్థూలం న జ్ఞానం నాజ్ఞానం నోభయతః ప్రజ్ఞ మగ్రాహ్య మవ్యవహార్యం స్వాంతః స్థితః' (9–20) అంతఃప్రజ్ఞగాని బహిష్ప్రజ్ఞగాని కాదు. అటులే స్థూలముగాని సూక్ష్మముగాని కాదు. జ్ఞానాజ్ఞానములును ఉభయమును కాదు. అది అగ్రాహ్యము అవ్యవహార్యము, స్వాంతస్థితము అని నారదపరివ్రాజకము గ్రహించెను. మరల నదే యుపనిషత్తు స్థలాంతరమున 'న స్థూలప్రజ్ఞ మన్వాహం । న సూక్ష్మప్రజ్ఞ మత్యంతం న ప్రజ్ఞం న క్వచి న్మునే । నైవాప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం న ప్రజ్ఞ మాంతరం॥ నాప్రజ్ఞమపి న ప్రజ్ఞాఘనం చాదృష్టమేవ చ। తదలక్షణ మగ్రాహ్యం యదవ్యవహార్య మచింత్య మవ్యపదేశ్య మేకాత్మప్రత్యయసారం ప్రపంచోపశమం శివం శాంత మద్వైతం చతుర్థం మన్యంతే స బ్రహ్మ ప్రణవః స విజ్ఞేయః॥' (8–20) అనియు వచించెను. అటులే సుబాల 'నాస్తి ద్వైతం కుతో మర్త్యం నాస్త్యమృతం కుతో నాంతఃప్రజ్ఞో న బహిష్ప్రజ్ఞో నోభయతఃప్రజ్ఞో న ప్రజ్ఞానఘనో న ప్రజ్ఞో నాప్రజ్ఞోఽపి నోవిదితం వేద్యం నాస్తి' (5) ద్వైతము లేదు, ఇక మర్త్యత్వమెట్లు ? అమృతత్వము లేదు యిక అంతఃప్రజ్ఞ బహిష్ప్రజ్ఞాదులెచట అని ప్రశ్నించినది. ఈవిధముగ సర్వేతరోపనిషత్తులు బ్రిథమమునసనే సూచింపబడినట్లు యీమంత్రభావమును స్వీకరించి యున్నవి.

తురీయునియందు అవస్థారూప సర్వ ద్వైత శూన్యత్వ ప్రతిపాదనమునకై 'ద్వైతస్యాగ్రహణం తుల్య ముభయోః ప్రాజ్ఞతుర్యయోః । బీజనిద్రాయుతః ప్రాజ్ఞః సా చ తుర్యే న విద్యతే॥' (మాం.కా.1–13) ద్వైతమును గ్రహింపకుండుట

ప్రాజ్ఞ తురీయులకు సమానమే కాని ప్రాజ్ఞుడు సంస్కారము లతో గూడియుండును. కాని తురీయునియందు అదిగూడ నభావము. అటులే 'కార్యకారణబద్ధౌ తావిష్యేతే విశ్వ తైజసౌ। ప్రాజ్ఞః కారణబద్ధస్తు ద్వౌ తౌ తుర్యే న సిధ్యతః॥' (మాం. కా. 1-11) విశ్వతైజసులు కార్య కారణ బద్ధులు. ప్రాజ్ఞుడు కేవలము కారణబద్ధుడు. కాని అవి తుర్యునిలో లేవు. అందుచే 'త్రిస్రోమాత్రాః పరస్తు సః' (అథర్వశిర. 3-0) తురీయుడు మూడుమాత్రలైన అకార ఉకార మకార ములకు అనగ విశ్వ తైజస ప్రాజ్ఞులకు అన్యుడు. అనగ 'అజాగ్ర త్స్వప్న నిద్రస్య యత్తే రూపం సనాతనం' (మహో. 5-50) జాగ్రత్స్వప్న నిద్రాదులులేని సనాతనమైన ఏరూపముగలదో అది తురీయము. అటులే 'అవస్థాత్రితయాతీతం తురీయం బ్రహ్మసంజ్ఞితం' (పంచబ్రహ్మ. 13), 'అవస్థాత్రయ భావా భావ సాక్షిస్వయం భావాభావ రహితం నిరంతర చైతన్య మాత్రం యదా తత్తురీయం' (సర్వసార) అవస్థాత్రయముల ఉనికిలేములకు సాక్షియై భావాభావము లేనిదై చైతన్యమాత్రమై యున్నదే తురీయము. 'అన్యథా గృహ్ణతః స్వప్నో నిద్రా తత్త్వమజానతః। విపర్యాసే తయోః క్షీణే తురీయం పద మశ్నుతే॥' (మాం. కా. 1-15) సత్యమును అన్యథాగ్రహించు టయే స్వప్నము. సత్పదార్థముయొక్క అగ్రహణము నిద్రా వస్థ. ఈరెండింటి విపర్యయసజ్ఞానము నశింప తురీయ మేర్ప డును. 'న నిద్రాం నైవ చ స్వప్నం తుర్యే పశ్యంతి నిశ్చితాః' (మాం. కా. 1-14) నిశ్చయజ్ఞానముగలవారు తుర్యమున నిద్రనుగాని స్వప్నమునుగాని గాంచరు. 'విశ్వశ్చ తైజసశ్చేతి

ప్రాజ్ఞశ్చేతి చ తే త్రయః ।' (3-21), 'విరాడ్ఢిరణ్యగర్భశ్చ ఈశ్వరశ్చేతి తే త్రయః । బ్రహ్మాండం చైవ పిండాండం లోకా భూరాదయః క్రమాత్ ॥' (3-22), 'స్వస్వోపాధిలయాదేవ లయంతే ప్రత్యగాత్మని' (యోగకుండలి. 3-23) విశ్వతైజస ప్రాజ్ఞులను ముగ్గురును; విరాట్ హిరణ్యగర్భ ఈశ్వరులు మువ్వురును, బ్రహ్మాండ పిండాండములును; భూరాదిలోకములును, స్వస్వోపాధి విలయానంతరము ప్రత్యగాత్మయందు అన్నియు లయించును. అప్పుడు ఆయాత్మ 'తతః స్థిమితగంభీరం న తేజో న తమ స్తతం ।' (3-24) 'అనాఖ్య మనభివ్యక్తం సత్కించి దవ శిష్యతే' (యోగకుండలి. 3-25) స్థిమితగంభీరమును, తేజస్సుగాని తమస్సుగాని గానిదియు, అనామకమై అనభివ్యక్తమై సన్మాత్రముగ నున్నది అని తురీయము సర్వావస్థా విదూరమని ఉపనిషత్తులు బోధించియున్నవి.

తురీయుని యితరలక్షణముల బోధించుచు, 'స పర్యగాచ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరం' (ఈశ. 8) అతడు సర్వవ్యాప్తము, ప్రకాశము, అశరీరుడు, అక్షయుడు, అస్నావిరుడు అనువాక్యములచే నతని కెట్టి రూపము లేదనియు, 'న సంధృశే తిష్ఠతి రూపమస్య న చక్షుషా పశ్యతి కశ్చనైనం' (శ్వే. 4-20) దృష్టిలో నతనికి రూపములేదు. నేత్రముతో నతని నెవరును గాంచలేరు అని అదృష్టపదార్థము వ్యక్తము. ఆవిషయమును 'అజాత మభూత మప్రతిష్ఠిత మశబ్ద మస్పర్శ' (సుబాల. 3) 'నాన్యోఽతోఽస్తి ద్రష్టృ, నాన్యదతోఽస్తి శ్రోతృ, నాన్యదతోఽస్తి విజ్ఞాతృ' (బృ. 3-8-11) అచట ఇదిగాక మరియొక ద్రష్టలేడు, శ్రోత లేడు విజ్ఞాత లేడు,

'యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి' (ఛాం. 7-24-1) దేనిని ఎవరును గాంచజాలరో, ఎవరును విన జాలరో, ఎవరును గ్రహింపజాలరో, 'అశబ్ద మస్పర్శ మరూపం' (కఠ.1-3-15, యోగకుండలి. 3-35) అది అశబ్దము, అస్పర్శము అరూపము, 'యద్వాచా నభ్యుదితం' (కేన. 1-4) ఏది వాక్కుచే నుచ్చరింపబడనేరదో, 'న తత్ర చక్షు ర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నో మనః' (కేన. 1-3) అట చక్షువులు చూడ నేరవు. వాక్కు వలుకలేదు. మనస్సు భావింపజాలదు అనుచు ఉపనిషత్తులు తురీయుడు సర్వేంద్రియాతీతమని వచించియు దృప్తిగాంచక, 'అఖిలప్రమాణాగోచరం బ్రహ్మ' (త్రి. మ. నా. 1) సర్వప్రమాణముల కతీతమనియు, 'అప్రమేయం' (అమృతబిందు. 9) అఖిలప్రమాజన్యజ్ఞానమున కతీతమనియు, 'సర్వానుభవ వినిర్ముక్తః సర్వధ్యాన వివర్జితః' (తేజోబిందు. 5-4) అనియు దెలిపియున్నవి.

మరియు 'యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్రం రూప వర్జితం।' (రుద్రహృదయ. 31, పాశుపతబ్రహ్మ. 28) 'మనో వాచోభి రగ్రాహ్యం' (మహా. 5-46) మనోవాక్కులకుగూడ అగ్రాహ్యము, 'తదపాణిపాద మచక్షుః శ్రోత్ర మజిహ్వ మశరీర మగ్రాహ్య మనిర్దేశ్యం। యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' (శాండిల్య. 2-0) అది కాళ్ళుచేతులు, నేత్ర కర్ణ ములు, జిహ్వ శరీరములు లేక అగ్రాహ్యము అనిర్దేశ్యము కాన నెటనుండి వాక్కు దేనిని పొందక మనస్సుతో సహా నివర్తించునో, 'యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుః శ్రోత్రం తదపాణిపాదం' (ముం. 1-1-6) అను

శ్రుతులు తురీయుని జ్ఞానేంద్రియ కర్మేంద్రియాగోచరత్వమును వివరించియుండెను.

కావున నది సహజముగ 'అలక్షణ మలక్ష్యం తదప్ర తర్క్యమనూపమం। అపారపార మచ్ఛేద్య మచింత్య మతి నిర్మలం॥ – – అప్రమాణ మనిర్దేశ్య మప్రమేయ మతీంద్రియం॥ అస్థూల మనణు ప్రహ్స్వ మదీర్ఘ మజమవ్యయం। అశబ్ద స్పర్శ రూప తదచక్షుశ్శ్రోత్ర నామకం॥' (యోగశిఖ. 3-19) అలక్ష ణమై, లక్ష్యముకానిదై, తర్కాతీతమై, ఉపమానరహితమై, అపారపారమై, అచ్ఛేద్యము, అచింత్యము అతినిర్మలమైనది. ప్రమాణ నిర్దేశ్య ప్రమేయములకతీతమై అతీంద్రియమైనది. స్థూలత్వ అణుత్వ ప్రహ్స్వత్వ దీర్ఘత్వములు లేక అజమై అవ్యయ మైనది. శబ్దస్పర్శ రూపములులేక, చక్షు శ్రోత్ర నామములు లేనిది ఆత్మ. 'సర్వవాచోఽవధి బ్రహ్మ' (తేజోబిందు. 51) వాగావధులకు అతీతము. 'నైవ చింత్యం న చాచింత్యం చింత మేవ తత్' (అమృతబిందు. 6) చింత్యముకాదు అచింత్యము గూడ కాదు. అదియే జ్ఞానస్వరూపము. 'అపాణిపాదోఽహ మచింత్యశక్తిః' (కైవల్య. 21) పాణిపాదములులేని అచింత్య మైన శక్తి అగు ఆత్మను నేను. 'అచింత్య మవ్యక్త మనంత రూపం శివం ప్రశాంతమమృతం' (కైవల్య. 6) 'అచింత్య మవ్యక్త మనంత మవ్యయం' (స్కంద. 15) అనురీతి అచిం త్యాదివిధమును శ్రుతులు వివరించి యున్నవి.

పైవిధముగ సర్వేంద్రియాతీతమై ఆత్మయుండ, నిక నట 'నిశ్శబ్దం పరమం పదం' (ధ్యానబిందు. 2) అనునట్లు నిశ్శబ్దమే రాజిల్లును. అనగ 'అవాసనత్వా త్సతతం యదా న మను తే

మనః। అమనస్తా తదోదేతి పరమోపశమప్రదా॥' (అన్న పూర్ణ. 4-48) వాసనలు లేకుండుటచే మనస్సు యోచింపక సదా యుండును. దానిచే పరమోపశమన ముదయించును. అందుచేతనే 'అమాత్రాఽనంత మాత్రశ్చ ద్వైతస్యోపశమః శివః' (మాం. కా. 1-29) అమాత్రమైన చివరిమాత్రయన ద్వైతముయొక్క ఉపశమనము అదియే శివము. అవును 'మనసో హ్యమనీభావే ద్వైతం నైవోపలభ్యతే' (మాం. కా. 3-31) మనస్సు అమనీభావముననున్నచో ద్వైతము గోచరింపదుగదా! అందుచేత 'చతుర్థ్యర్థమాత్రా...స ప్రపంచహీనోఽథ' (నృ. ఉ. తా. 3) చతుర్థమాత్రయన ప్రపంచహీనము 'ద్వంద్వాతీతో భవతి' (ధ్యానబిందు. 94) అనియు, 'జ్ఞేయవస్తుపరిత్యాగా ద్విలయం యాతి మానసం। మానసే విలయం యాతే కైవల్య మవశిష్యతే॥' (శాండిల్య. 1-7-23) తెలియబడు వస్తువులు బరిత్యజింపగ మనస్సు లయించును. మనస్సు లయింపగ కైవల్యమే సమకూరును. కావున 'బాహ్యాచింతా న కర్తవ్యా తథైవాంతర చింతకా। సర్వచింతాం పరిత్యజ్య చిన్మాత్ర పరమో భవ॥' (శాండిల్య. 1-7-20) బాహ్యచింతల జేయ రాదు. అటులే అంతరయోచనలుగూడ గూడవు. సర్వచింతల బరిత్యజించి, పరమైన చిన్మాత్రవు గమ్ము అనియు నుపని షత్తులు బోధించియున్నవి.

అట్టి నిర్విషయస్థితియే 'నిష్కళం నిర్మలం శాంతం సర్వాతీతం నిరామయం' (యోగతత్త్వ. 8), 'నిష్కళం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం' (శ్వే. 6-19), 'సర్వం శాంతం నిరాలంబం వ్యోమస్థం శాశ్వతం శివం'

(మహో. 5-45), 'అతీంద్రియం గుణాతీతం మనోలీనం యదా భవేత్ అనూపమం శివం శాంతం।' (నాదబిందు. 18) అని సర్వశాంతప్రదమైన స్థితిగ వర్ణితము. 'అజాచల మవస్తుత్వం విజ్ఞానం శాంత మద్వయం' (మాం. కా. 4-45) అజమై అచలమై వస్తుత్వములేని ప్రజ్ఞ శాంతము అద్వయము. 'సర్వాభిలాప విగతః సర్వచింతా సముత్థితః। సుప్రశాంతః...' (మాం.కా. 3-37) ఆత్మ సర్వశబ్దములకు, సర్వచింతనములకు అతీతము. అతిప్రశాంతము అని ఆత్మయొక్క శాంత స్థితిని ఉపనిషత్తులు వివరించియున్నవి.

ఆవిధమైన శాంతము శివంకరమైనదని తెలుపుటకు 'శివం' అని మంత్రము ఉపయోగించియున్నది. అటులే 'స భగవాన్ సర్వగతః శివః' (శ్వే. 3-11) 'జ్ఞాత్వా శివం శాంతి మత్యంతమేతి' (శ్వే. 4-14) శివంకరమైన ఆత్మను గ్రహించి పరమశాంతిని బొందును. 'యదా తమస్తన్న దివా న రాత్రి ర్న సన్న చాసచ్ఛివ ఏవ కేవలః' (శ్వే. 4-18) ఎప్పుడు అజ్ఞానము లేదో, అప్పుడు దివారాత్రములు అభావములు, సదసత్తులు లేవు, అప్పుడు కేవలమైన శివత్వ ముండును. 'నిర్మలం శివం' (నాదబిందు. 17) 'ఆకాశవ త్సర్వగతం సుసూక్ష్మం నిరంజనం నిష్క్రియం సన్మాత్రం చిదానందైకరసం శివం ప్రశాంత మమృతం తత్పరం చ బ్రహ్మ' (శాండిల్య.2-0) ఆకసమువలె సర్వగతము, సూక్ష్మము, నిర్మలము, నిష్క్రియము, సద్రూపము, చిదానందఏకరసము, శివము, ప్రశాంతము అమృతము పరము బ్రహ్మము. 'శివా శూన్యాశూన్య వివర్జితం' (శాండిల్య. 1-7-17) 'ఆత్మ సంజ్ఞః శివః శుద్ధ ఏక ఏవా

ద్వయః సదా' (ఆత్మ. 1) అని ఉపనిషత్తులు శివత్వమును అభి వర్ణించుటచే 'అద్వయతా శివా' (మాం. కా. 2-33) అద్వ యత్వమే శివము అనగ అత్యంత మంగళకరము, అనగ ఆనందము అని గౌడపాద నిర్ణయము.

ఈ విధముగ శివంకరమైన స్థితి 'అద్వైతః సర్వభావా నాం దేవ స్తుర్యో విభుః' (మాం. కా. 1-10) సర్వవిషయము లలో నిది అద్వైతము. అదియే తురీయము జ్యోతి స్వరూపము వ్యాప్తము. 'అజ మనిద్ర మస్వప్న మద్వైతం' (మాం. కా. 1-16) కావున 'బంధత్వ మస్తిచే న్మోక్షో బంధాభావే క్వ మోక్షతా। మరణం యది చేత్ జన్మ జన్మాభావే మృతి ర్న చ॥ త్వమిత్యపి భవేచ్చాహం త్వం నో చే దహమేవ న। ఇదం యది తదేవాస్తి తదభావా దిదం న చ' (తేజోబిందు. 5-25) బంధమున్నచో మోక్షముండును. బంధమేలేకున్న మోక్ష మెట్లు? మరణమున్న జన్మ. జన్మయే లేకున్న మృతి లేదు. 'త్వం' అనునది ఉన్న 'అహం' ముండును. 'త్వం' లేకున్న 'అహం' గూడ లేదు. ఇది యున్న అది యుండును. అదియే లేకున్న నిదియు గూడ అభావము. అట్లు గాన 'న మే బంధో న మే ముక్తి ర్న వై శాస్త్రం న మే గురుః। మాయామాత్ర వికాసత్వా న్మాయా తతో౽హ మద్వయః॥' (ఆత్మబోధ. 19) నాకు బంధము లేదు. ముక్తియును లేదు. శాస్త్రము లేదు గురువును లేదు. మాయావికాసమున నేను మాయాతీతు డను అద్వయుడను అని ఆత్మవిదుడు ప్రకటించుచు 'న నిరోధో న చోత్పత్తి ర్న బద్ధో న చ సాధకః। న ముముక్షు ర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా॥' (అమృతబిందు. 10) అని ఎలుగెత్తి

చాటుటయం దాశ్చర్యమేమి. కాన రూఢిగ 'ఇదం ప్రపంచం నాస్త్యేవ నోత్పన్నం నోస్థితం క్వచిత్' (తేజోబిందు. 5-31) ఈప్రపంచము మిథ్యమాత్రమే. అది పుట్టుట లేదు కొంచ మేని ఉండుట లేదు. మరియు 'నాస్తమేతి న చోదేతి నోత్తిష్ఠతి న తిష్ఠతి। న చ యాతి న చాయాతి న చ నేహా న చేహా చిత్॥' (మహా. 5-102) ప్రపంచము అస్తమించుటలేదు. ఉదయించుటయు లేదు. కూర్చుండుట లేదు కూరుచుండకుండు టయు లేదు. వెళ్లుటలేదు. వెడలకుండుటయు లేదు. ఇచట గలదు లేదు అనియు లేదు. అందుచే 'కార్యం చేత్కారణం కించి త్కార్యాభావే న కారణం' (తేజోబిందు. 5-36) కార్యమున్న కారణముండును. కార్యాభావమున గారణము గూడలేదు. అట్లు 'మాయాకార్యాదికం నాస్తి మాయా నాస్తి' (తేజోబిందు. 5-38) మాయాకార్యములు లేవు మాయయు లేదు. అన్నియు బోవ మిగిలినదెద్ది అన 'సచ్చిదానంద మద్వైతం సచ్చిదానంద మవ్యయం' (తేజో బిందు. 6-1) మాత్రముండును.

దానినే'ఆత్మా' 'స విజ్ఞేయః'అని మంత్రము సమాధాన మొసంగియున్నది. 'య ఆత్మా పహతపాప్మా విరజో విమృత్యు ర్విశోకో విజిఘిత్సోఽపిపాసః సోఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః' (8-7-1) ఏ ఆత్మ పాపరహితమై రజోశూన్యమై మృత్యువులేక శోకాదులు లేక, క్షుత్పిపాసలులేక యున్నదో అది అన్వేష్ట వ్యము, విజిజ్ఞాసితవ్యము అని ఛాందోగ్యము, 'ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః' (2-4-5) ఆత్మ చూడబడదగినది. దానిగూర్చి వినవలెను యోచింప

వలెను. నిదిధ్యాసము గావింపవలెను అని బృహదారణ్యకము గూడ బోధించుచున్నది.

ఈవిధముగ 'అవస్థాత్రయ భావాభావసాక్షీ స్వయం భావరహితం నైరంతర్యం చైతన్యం యదా తదా తురీయం' (సర్వసార) అవస్థాత్రయములయొక్క ఉనికిలేములకు స్వయం సాక్షియై తాభావరహితుడై అంతరము లేనివాడైన చైతన్యము ఏదో అదే తురీయము అని వర్ణింపబడిన తురీయ వివరణముతో విశ్వ తైజస ప్రాజ్ఞ తురీయాన్వితమైన పాదచతుష్టయ వివరణము పూర్తిగావింపబడినది. ఏకైకరస రూపముగా 'ఏక ఏవాత్మా మంతవ్యో జాగ్రత్స్వప్నసుషుప్తిషు' (త్రిపురతాపినీ. 5-16) అవస్థాత్రయముల నంతర్యామిరూపముగ నేకాత్మప్రత్యయ సారముగ నుండియు నందందుగల సాధకబాధకముల కందని వాడై యున్న నేకస్వరూపుడు అగు తురీయుని బొందినగాని శివంకరమగు శాంతి అలభ్యమని బోధింపబడియున్నది. అందుచే నాసాధనావిధానమును బోధింప నిక మాండూక్యము గడంగుచున్నది. అందుచే మరల ఓంకారమాత్రా త్రయమును బాదక్రమముగా నిక ప్రస్తావించి సాధనసాగరమున మనల నుపనిషత్తు దించుట కుపక్రమించుచున్నది.



# ఎనిమిదవ మంత్రము

> సో ఽ యమాత్మాఽధ్యక్షరమోంకా
> రోఽధిమాత్రం పాదా మాత్రా మాత్రాశ్చ పాదా
> అకార ఉకారో మకార ఇతి.

ఇంతవరకు వర్ణింపబడిన ఆత్మ అక్షరరూపమున నోంకారము. ఓంకారము మాత్రాదృష్టిలో జూడబడును. ఆత్మ యొక్క పాదములే ఓంకారముయొక్క మాత్రలు. అటులే మాత్రలే పాదములు, ఆమాత్రలు అకార ఉకార మకారములు.

పూర్వము 'ఓమిత్యే తదక్షర మిదం సర్వం' అని ఉపనిషత్తు ప్రారంభించి, ఆ 'సర్వం హ్యేతద్బ్రహ్మ' అని వచించి, 'అయమాత్మా బ్రహ్మ' అని బ్రహ్మాత్మల సమన్వయపరచి, ఆయాత్మ 'చతుష్పాత్' అని మాత్రము బోధించి, మూడవ మంత్రమునుండి జాగ్రత్స్వప్నసుషుప్తితురీయావస్థలగల జీవ స్థానముల విశ్వ తైజస ప్రాజ్ఞ తురీయులుగ నవి పరముగ నుపదేశించియున్నదిగాని, ఓంకారాక్షరముతో ఆత్మకుగల సాక్షాత్సంబంధమును బ్రస్తావించియుండలేదు. అనగ ఓంకారమాత్రలైన అకార ఉకార మకారార్ధమాత్రల విశ్వాదుల కన్వయించిన గాని సంపూర్ణ సమన్వయ మేర్పడజాలదు గాన నిట నుండి యీ సమన్వయము గావింపబడి అది సాధనయోగ్యముగ గావింపబడియున్నది. పూర్వగ్రంథము కడు జటిలమై సాధారణప్రజ్ఞులకు అగ్రాహ్యముగగూడ నగునట్లుదోచును. కాని యీయుత్తరగ్రంథము కష్టతరముగాక, కేవలము సామాన్య విషయములతోగూడి సాధనోపయుక్తమగుటచే సామాన్య

ప్రజ్ఞులకుగూడ సులభ సాధ్యమైయున్నది. అందుచే బూర్వ గ్రంథము శ్రేష్ఠమనియు నిది హేయమనియు దలంపరాదు. ఒక విధముగ బూర్వగ్రంథమంతయు దీనికి ఉపోద్ఘాతమై 'అస్తి బ్రహ్మేతి చేద్వేద పరోక్షజ్ఞాన మేవ తత్। అహంబ్రహ్మేతి చేద్వేద సాక్షాత్కారః స ఉచ్యతే॥' (వరాహ.2-41) బ్రహ్మము గలదని గ్రహించిన నది పరోక్షజ్ఞానమే యగుచున్నది. అట్లు కాక 'అహం బ్రహ్మాస్మి' అనిగ్రహించినచో అది సాక్షాత్కారమని చెప్పబడును అనురీతి బూర్వగ్రంథము ఆత్మయొక్క పాద చతుష్టయవర్ణనము గావించి, సాధకునియొక్క యథార్థ స్థితిని బోధించి పరోక్షజ్ఞానమును మాత్రము గలుగజేసి యున్నది. అనగా పూర్వము వచింపబడినట్లు యింతవరకు 'అయమాత్మా బ్రహ్మ' అను మననవాక్యమువరకు దెల్పబడి యున్నదేగాని యిక నిదిధ్యాసనవాక్యమైన 'అహం బ్రహ్మాస్మి' అను వాక్యార్థసాధన-మెట్లో యీ యుపనిష దుత్తరభాగము బోధించుచుండుటచే నిదియే యుపనిషత్సారమేమో అని తోచును. కాన బైపరోక్షజ్ఞానమును గురుముఖతః గ్రహించి, ఇక నపరోక్షమైన జీవబ్రహ్మైకత్వ అపరోక్షజ్ఞానమును బొంద నీ భాగము ప్రధానము. ఈ భాగమున కేవలము సాధనోపాయములమాత్రమేగాక సాధనఫలములఁగూడ బొందు బరచి యుండుటచే, సాధకుడు వెంటవెంటనే గ్రహించి, ముందుగతి గమనించుట సులభసాధ్యమగును. ఇటుగూడ 'ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణోరూపకల్పనా' (రామరహస్య. 1-7) ఉపాసకులకొరకు బ్రహ్మమునందు రూపము కల్పింపబడినది అనురీతి స్థూలమైన సగుణసాకారరూపమును నెలకొల్పి,

'యోఽన్యాం దేవతా ముపాస్తే। అన్యోఽసావన్యోఽహమస్మీతి। న స వేద' (బృ. 1-4-10) నేను వేరు, అతడు వేరు అని ఎవ డుపాసించునో అతడు తెలియనివాడు అను రహస్యమును త్యజింపక, ఉపాసన కనుకూలమైన బాహ్యాద్వైతమును నెల కొల్పక, సర్వోపనిషత్సారమైన పరమాద్వైతమును గమ్యము నందుంచి, తత్సిద్ధికి సన్నిహితమైన స్వాత్మనే గ్రహించి, దానికి ప్రతీకరూపమై ప్రతిమోపాసనకు విదూరమైన ప్రణవమునే గ్రహించి, రెండింటికి అన్వయుబరచి, మరల వివేకవైరాగ్యాది సాధన చతుష్టయమునే లక్షించి, యిట నతిసూక్ష్మమైన ప్రణ వోపాసనావిధానమును ఉపనిషత్తు ప్రతిపాదించుట గ్రాహ్యము. ఈప్రణవోపాసనము సులభసాధ్యముగాక కేవలము సాధ నాదిక చతుష్టయసిద్ధిగలవారికే సాధ్యమగుటచే, నిది ఎక్కువ వైరాగ్యవంతులగు యతీశ్వరులచేతనే నవలంబింపబడుచున్నది. కాన నీయుపనిషదుత్తరభాగముగూడ నతిప్రధానమై, అతి సున్నితమై, ఉత్తమసాధకలోకమునకే ఆచరణయోగ్యమని దృష్టియం దుంచుకొందముగాక.

'చిదేకత్వపరిజ్ఞానే న శోచతి న ముహ్యతి' (అన్నపూర్ణ. 4-34) చితియొక్క ఏకత్వవిజ్ఞానముచే శోకమోహము లుండవు. అట్టి చిదేకత్వవిజ్ఞానార్థము 'అభ్యాసవాసనాశక్త్యా తరంతి భవసాగరం' (యోగకుండలి. 3-18) అభ్యాసబలముచే భవ సాగరమును తరింపసాధ్యము గాన, 'ధ్యానం సంసారనాశనం' (జాబాలదర్శన. 9-1) అనియు నగుటచే 'భావవృత్త్యా హి భావత్వం శూన్యవృత్త్యా హి శూన్యతా। బ్రహ్మవృత్త్యా హి పూర్ణత్వం తయా పూర్ణత్వమభ్యసేత్॥' (తేజోబిందు. 1-42)

భావవృత్తిచే భావత్వము, అటులే శూన్యవృత్తిచే శూన్యత్వము, బ్రహ్మవృత్తిచే పూర్ణత్వములు గలుగును గాన బూర్ణత్వమునే అభ్యసింపవలయుసను బోధచే బూర్ణబ్రహ్మవృత్తిని అభ్యసింపవలయునని ఆదేశము.

దానికై 'చిత్తం కారణమర్థానాం తస్మిన్ సతి జగత్త్రయం। తస్మిన్ క్షీణే జగత్ క్షీణం తచ్చికిత్స్యం ప్రయత్నతః॥' (యోగశిఖ. 6-59) సర్వార్థములకు జిత్తమే కారణము, దాని వలన దిలోకము లున్నట్లు తోచును. అది నిశ్చలము కాగా జగత్తు లేకుండును. కాన బ్రయత్నపూర్వకముగ జిత్తమును నిరోధింపుము. అంతియగాక 'చిత్తే చలతి సంసారో నిశ్చలం మోక్ష ఉచ్యతే। తస్మాచ్చిత్తం స్థిరీకుర్యాత్...॥' (యోగశిఖ. 6-58) చిత్తము చలింప సంసారము నిశ్చలమునొంద మోక్షమగుచున్నది గాన చిత్తమును స్థిరపరుపుము అనియు యోగశిఖ ఉపదేశము. కాన 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' (శాట్యాయని, అమృతబిందు. 2) మానవుల బంధమోక్షముల గారణము మనస్సే కావున, 'పౌరుషేణ ప్రయత్నేన లాలయే చ్చిత్తబాలకం' (ముక్తిక. 2-12) పురుషకారప్రయత్నముచే జిత్తమను బాలకుని లాలించిన గాని సాధన కుదురనేరదు. 'నావిరతో దుశ్చరితా న్నాశాంతో నాసమాహితః। నాశాంతమానసో వాపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్॥' (కఠ. 1-2-24) దుష్టత్వమునుండి విడివడని వాడు, ఇంద్రియముల నిరోధింపనివాడు, సమాహితత్వము లేనివాడు, మనశ్శాంతి నొందనివాడు, ప్రజ్ఞానముచేనైనను ఆత్మను బొందనేరడు. అందుచే సర్వోపనిషత్తులు 'మనః

ప్రశమనోపాయో యోగ ఇత్యభిధీయతే' ( మహో. 5-42 ) మనస్సును ఉపశమింపజేయుటయే యోగమని వాక్రొనుచున్నవి.

అట్టి మనోపశమనమునకై 'యావత్సర్వం న సంత్యక్తం తావదాత్మా న లభ్యతే। సర్వవస్తుపరిత్యాగే శేష ఆత్మేతి కథ్యతే॥' ( అన్నపూర్ణ. 1-45 ) సర్వత్యాగము గావింపనంత వరకు ఆత్మ లభింపదు. సర్వవస్తుత్యాగశేషమే ఆత్మఅని చెప్పబడుటచే, 'ఆత్మావలోకనార్థం తు తస్మాత్సర్వం పరిత్యజేత్' (అన్నపూర్ణ.1-46) ఆత్మావలోకనమునకై సర్వమును త్యజింపవలయునని అన్నపూర్ణ ప్రబోధ. అట్లు చిత్తమునగల సర్వ విక్షేపముల వాసనలతో గూడ ఛేదించినగాని, అద్వైతార్థగ్రహణము సాధ్యము కాకుండుటచే నుపనిషత్తులు త్యాగముపై దృష్టిని మిగుల కేంద్రీకరించుట సహజము.

అంత ప్రణవోపాసనము బోధింపబడును. 'సర్వస్య ప్రణవో హ్యాదిర్మధ్యమంత స్తథైవ చ। ఏవం హి ప్రణవం జ్ఞాత్వా వ్యశ్నుతే తదనంతరం॥' (1-27) ఓంకారమే సర్వమునకు ఆదిమధ్యాంతములు. అట్లు గ్రహించినవాడు వెంటనే నిస్సందేహముగ ఆత్మను బొందును. ఎందుచేనన, 'ప్రణవో హ్యపరం బ్రహ్మ ప్రణవశ్చ పరః స్మృతః।' (1-26) ఓంకారమే అపరబ్రహ్మము, అటులే అది పరబ్రహ్మము. కావున 'సర్వవ్యాపిన మోంకారం మత్వా ధీరో న శోచతి' (1-28) సర్వవ్యాపి అయిన ఓంకారమును నెరింగి వివేకవంతుడు శోకింపడు. అటులే '...ప్రణవో బ్రహ్మ నిర్భయం। ప్రణవే నిత్యయుక్తస్య న భయం విద్యతే క్వచిత్॥' (1-25) ఓంకారము

నిర్భయమైన బ్రహ్మము. ఓంకారముతో నేకమైనవాడు ఎట్టి భయమును పొందడు. కాన 'యుంజీత ప్రణవే చేతః' (1-25) నట్టి ప్రణవముతో మనస్సును ఏకము గావింపవలెను. అదెట్లు అనిన, ఓంకారమును సమగ్రముగా నొకేపర్యాయము అనుసంధింప యత్నింపక 'ఓంకారం పాదశో విద్యాత్ పాదా మాత్రా న సంశయః । ఓంకారం పాదశో జ్ఞాత్వా న కించి దపి చింతయేత్॥' (1-24) ఓంకారార్థమును పాదశః గ్రహింప వలెను. పాదములు మాత్రమేయని సందేహము వలదు. ఓంకారతాత్పర్యమును గ్రహించినంత నింక దేనిని నెరుంగ ననావశ్యకము అని కారికాకారుడైన గౌడపాదాచార్యుని వాగ్దానము.

క్లుప్తసరణి నుపనిషత్తులలో బ్రణవోపాసనమునుగూడ జూచెదముగాక. ప్రణవోపాసన అనునది యుపనిషత్తులలో సర్వేసర్వత్ర బహుళవిధములుగా గానుపించుచున్నది. ఛాందోగ్యాది శ్రుతులు ఉద్గీథరూపమున (1-1-2) దాని నుపాసించు చున్నవి. 'ఓమితి బ్రహ్మ । ఓమి తీదం సర్వం॥' (1-8-1) అని తైత్తిరీయము మొదలైనవి దాని ప్రాధాన్యమును బోధించు చున్నవి. మహా, పరమహంసపరివ్రాజక, నారదపరివ్రాజక, మొదలగు ఉపనిషత్తులు దాని షోడశమాత్రామాత్రముగ విభజించి, దాని, అవస్థాషోడశకముతో సమన్వయించి, దాని ఉపాసనా విధానము మిగుల బహుళమొనరించి యున్నవి. అనగా అకార, ఉకార, మకార, అర్ధమాత్ర, నాద, బిందు, కలా, కలాతీత, శాంతి, శాంత్యాతీత, ఉన్మనీ, మనోన్మనీ, పురీ, మధ్యమా, పశ్యంతీ, పరారూపముల ఓంకారమాత్రలు

షోడశకముగా రూపించి, తదనుగుణముగ జాగ్రజ్జాగ్రత, జాగ్రత్స్వప్న, జాగ్రత్సుషుప్తి, జాగ్రత్తురీయరూపమున జాగ్రత్తును జతుర్విధములుగ విభజించినట్లు స్వప్నమును జతుర్విధముగను, సుషుప్తిని జతుర్విధముగను, అటులే తురీయమును విభజించి, మొత్తమునకు షోడశపాదములుగ గావించి క్రమముగా ప్రణవముయొక్క షోడశమాత్రల కన్వయించియున్నవి.

నాదబిందు మొదలైన ఉపనిషత్తులు దీని ద్వాదశకముగనే విభాగించి యున్నవి. ఘోషిణీ, విద్యా, పతంగినీ, వాయువేగినీ, నామధేయ, చైంద్ర్యా, వైష్ణవీ, శాంకరి, మహతీ, ధృతి, నారీ, బ్రాహ్మీ, అని వాని నామధేయములు. తారసారాదిక శ్రుతులు ప్రణవమునకు అష్టమాత్రల మాత్రము దెలిపి, అకార, ఉకార, మకార, బిందు, నాద, కళా, కళాతీత పరములు వానికి నామకరణ మొనరించియున్నవి.

ప్రణవమును సప్తభూమికలతో వరాహాదిక శ్రుతులు సమన్వయించి శుభేచ్ఛా, విచారణా, తనుమానసి, సత్త్వాపత్తి, అసంసక్తి, పదార్థభావనా, తురీయగ అను సప్తభూమికలను బ్రస్తావించి, అటులే అవస్థాచతుష్టయము షోడశకముగ బరిణమింపజేసి, అకారములోగల జాగ్రత్తురీయము వరకు బ్రథమ ద్వితీయ తృతీయ భూమికలుగను, ఉకారములోగల స్వప్నతురీయమువరకు జతుర్థభూమికగను, మకారగత సుషుప్తితురీయమువరకు బంచమీ భూమికగను. అర్థమాత్రలో తురీయ తురీయమువరకు షష్ఠమభూమికగను తదతీతము సప్తమ భూమికగ నన్వయ మొనరించియున్నవి.

ఈ విధముగా సర్వోపనిషత్తులు ప్రణవమునకు అతి ప్రాధాన్యము నొసంగియున్నవి. 'సకృదుచ్చరితమాత్ర ఊర్ధ్వ మున్నామయతీ త్యోంకారః' (అథర్వశిఖ) ఒక్కమారు ఉచ్చరించినమాత్రమున ఊర్ధ్వమైన పరమపదప్రాప్తి నొందించును గాన ఓంకారమనియు, 'యస్మాదుచ్చార్యమాణ ఏవ ప్రాణాన్ ఊర్ధ్వ మున్నమయతి తస్మాదుచ్యతే ఓంకారః' (అథర్వశిఖ. 4-1) దేని నుచ్చరించుటచేత సర్వప్రాణములు ఉన్నతినొందునో అది ఓంకారము అనియు, నోంకారము స్తుతిపాత్రమై యున్నది. 'సర్వవిఘ్నహరో మంత్రః ప్రణవ స్సర్వదోషహా' (యోగతత్త్వ. 64) సకలవిఘ్నములను సర్వ పాపములను ప్రణవము నశింపజేయును అని యోగతత్త్వ ముపదేశించును. 'సదా నాదానుసంధానాత్ సంక్షీణా వాసనా భవేత్' (యోగశిఖ. 5-70) సంతత నాదానుసంధానముచే వాసనలు క్షీణించుచుండుటచే 'నాస్తి నాదాత్పరో మంత్రః' (యోగశిఖ. 2-21) నాదానుసంధానముకంటె శ్రేష్ఠమైన మంత్రము కానరాదు. అందుచే 'సర్వే వేదా యత్ పదమామ నంతి తపాంసి సర్వాణి చ యద్వదంతి। యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి తత్తే పదం సంగ్రహేణ బ్రవీమి ఓమిత్యే తత్' (కఠ. 1-2-15) దేనినిగూర్చి వేదములు వచించుచున్నవో, సర్వతపములు పలుకుచున్నవో, దేనిని గోరి బ్రహ్మచర్యమును అవలంబించుచున్నారో, ఆపదమునుగూర్చి సంగ్రహముగా నీకు తెలుపుదును అది ఓం అని యమునిచే స్తుతింపబడి. 'ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరం। ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్॥' (1-2-6)

ఈపదమే బ్రహ్మము. అదియే పరము. దీనిని దెలిసికొనినవాడు కోరినదాని నెల్ల బొందును అని వచింపబడియున్నది. కాన 'ఏతదాలంబనం శ్రేష్ఠ మేతదాలంబనం పరం। ఏతదాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే॥' (కఠ.1-2-17) ఈవిధానము ఉత్తమము, పరము. దీని నెరింగినవాడు బ్రహ్మలోకమున స్తుతింపబడును. అట్టి పవిత్ర నాదానుసంధానమును, 'శుచిర్వాప్యశుచిర్వాపి యో జపే త్ప్రణవం సదా। న స లిప్యతి పాపేన పద్మపత్ర మివాంభసా॥' (91) శుచియైగాని అశుచియైగాని ప్రణవమును సదా జపించు వానికి బద్మపత్రమునకు ఉదకము అంటని విధము పాపము లంటవు అని యోగచూడామణి ప్రతిజ్ఞ గావించియున్నది.

ఓంకారమునకు బూర్వగ్రంథము చందము 'అకార ఉకార మకార ఇతి త్ర్యక్షరం ప్రణవం' (ఆత్మబోధ) అయియున్నది. వీని కనుగుణముగ నాత్మకు జాగ్రత్స్వప్నసుషుప్తులు గలవు. ఇవి పరస్పరాధీనములై కార్యకారణసంబంధమున వెలయుచున్నవి. 'పూర్వాస్య మాత్రా జాగర్తి జాగరితం ద్వితీయా స్వప్నం తృతీయా సుషుప్తిః చతుర్థీ తురీయం మాత్రా మాత్రాః ప్రతిమాత్రాగతాః సమ్యా త్సమస్తానపి పాదాన్ జయతీతి స్వయం ప్రకాశః స్వయంబ్రహ్మ భవతీత్యేవ సిద్ధాకర ఏతస్మాత్ ధ్యానాదౌ ప్రయుజ్యతే' (అథర్వశిఖ. 3) ప్రణవములోని ప్రథమమాత్ర జాగ్రత్తు. రెండవది స్వప్నము. మూడవది నిద్ర. నాల్గవది తురీయము. ఒక్కొక్క మాత్ర మరియొక మాత్రలో లయించును. అట్లు ఒక్కొక్క మాత్రనుండి మరియొక మాత్ర జనించును. ఇది స్వయం

ప్రకాశము. దీని ధ్యానముచే బూర్వపదముల సిద్ధిగలుగును. మోక్షముగూడ సిద్ధించును. ఈవిధముగా నోంకార ప్రాశస్త్య మును దెల్పు మాత్రా పాద సమన్వయమున, అనగ మాత్రా అవస్థా సమన్వయముగ నిక ఉపాసనావిధానమును మాండూ క్యము బోధించుచున్నది.



## తొమ్మిదవ మంత్రము

> జాగరితస్థానో వైశ్వానరోఽకారః
> ప్రథమా మాత్రాఽఽప్తే రాదిమత్వా ద్వా ఆప్నోతి
> హ వై సర్వాన్ కామానాదిశ్చ భవతి య ఏవం వేద.

జాగ్రదవస్థా వ్యవహర్తయైన వైశ్వానరుడు అకారము. సర్వవ్యాప్తమగుటచే బ్రథమమగుటచేత బ్రథమ మాత్రయగు అకారము అతడే. దీని నెరింగినవాడు సర్వకామములబొంది ఎల్లరకు బ్రథముడగును.

పూర్వమంత్రమున ఆత్మోంకారములకు బాదచతుష్టయ పూర్వకముగా వచింపబడిన సామ్యమే పాదామాత్రలకు ప్రత్యేకముగా నిందు దెలుపబడుచున్నది. అందుచే బ్రథమతః ఓంకారమున ప్రథమమైన అకారము, విశ్వాదులలో బ్రథముడు వైశ్వానరుడును యిట స్వీకరింపబడి వారి సమానత్వము నిరూపింపబడుచున్నది. జాగ్రదవస్థావ్యవహర్త విశ్వుడు అనగ వైశ్వానరుడు. ఇతడు ద్వితీయ మంత్రార్థము రీతిగా సప్తాంగో పేతుడగుటచేత సర్వవ్యాప్తిగలవాడగుట స్పష్టము. భూలోకాది

ద్యులోకపర్యంతము అతడే అని అచ్చట ఛాందోగ్య శ్రుతి ప్రమాణముగ వివరింపబడియున్నది. అటులే ఓంకార ప్రథమ మాత్రయగు అకారముగూడ 'అకారో వై సర్వావాక్' అను శ్రుతిచందము సర్వశబ్దములకు అకారమే వ్యాప్తమై ఆధారమై యున్నది. అది సర్వశబ్దములకు అంతర్గతనే గదా. నోరు తెరచుటలో అకారమే ఉచ్చరింపబడుట సామాన్యవిషయము. అటులే జాగ్రదవస్థయు గూడ నాల్గవస్థల నంతర్గతము. దాని నుండియే మిగతా అవస్థల జ్ఞానము సంభవించుచున్నది. కాన జ్ఞానరూపముగ నది సర్వావస్థాంతరము అని వచింపనగును. మరియు నకారము సర్వాక్షరములకు ప్రథమస్థానము నలంకరించి యున్నది. అనగ నకారము ఓంకారమునగల అ ఉ మ అక్షరములకు ఆదియేగాక సర్వాక్షరములకు ప్రథమమే. దానికి పూర్వము ఏఅక్షరమును గూడ నభావము. అట్లే విశ్వాది చతుష్టయమునకు వైశ్వానరుడే మొదటివాడు. ఇట్లు అకార వైశ్వానరులకు ద్వివిధ సామ్యము గోచరించుచున్నది. ఈవిషయము నెరింగిన సాధకుడు సర్వకోరికల బొందినవాడై గొప్పవారిలో ప్రథముడగును.

ఇచట జాగ్రదవస్థా సాధనోపాయము తెలుపబడినది. సర్వవిధ సాధనల కనుకూలమును ఆధారమును అయి యీ యవస్థ గలదు. కాన దీనియందు త్తీర్ణతనొందినచో సర్వేతర అవస్థలును సాధ్యములనియే చెప్పనగును. అందులకై శాస్త్ర ముపదేశించు కర్మ భక్తి జ్ఞానాదిక సాధనలన్నియు జాగ్రదవస్థాధీనములే యగును. నాదోపాసకుడు ప్రథమతః అకారసాధన గావించి, దాని హ్రస్వ దీర్ఘ ప్లుతరూప సర్వవిధోచ్చారణముల

సాధించి, పిమ్మట నెట్లు ఇతరశబ్దముల నుచ్చరింప బూనుచున్నాడో, అటులే సాధకుడు జాగ్రదవస్థను సాధ్యము గావించుకొనుట ముఖ్యము. అందుచే జాగ్రత్తులో అనుభవకారణములైన చతుర్దశోపకరణములలో స్థూలములైన దశేంద్రియముల శుద్ధపరచి, వాని నధోముఖమునుండి యూర్ధ్వముగ మరలించి, సద్వినియోగము గావించిననే సాధన సిద్ధించును. దానికై యోగవిధానము యమ నియమాది సమాధిపర్యంత సాధన విధానము నుపదేశింప, నద్వైతశాస్త్రము వివేకాది సాధన సంపత్తిని బోధించియున్నది. దాని ననుసరించి, సద్గురువు నాశ్రయించి, అధ్యయనము గావించి, పరోక్షజ్ఞానము నార్జించి, తన్మూలమున సత్యాసత్యవివేకము గావించి, అనాత్మవస్తువైన అసద్వస్తువును త్యజించినచో వైరాగ్య మేర్పడుచున్నది. బాహ్యవస్తుసంస్పర్శము లేకుండుటచే నింద్రియాదుల కెట్టి సంగము లేక శాంత్యాది షట్కమును బొందుట సహజము. అంత ప్రథమతః నిశ్చయింపబడియున్న సద్వస్తువుపై దృష్టిమరలి దాని బొందు నాకాంక్ష వృద్ధియగును. కాన నిట్టి శాంత్యాదుల బొందిన సాధకుడే మోక్షాధికారియగుటకు అవకాశ మేర్పడుచున్నది.

ఆకారణమున ముముక్షుత్వమునకు సత్యాసత్యవివేకము పునాదిగ నేర్పడుచున్నది. దాని సంఘమున నుపయోగించినచో నది అనేక సత్ఫలితముల నొసంగుట సహజమే. అనగ ప్రపంచమున గల సర్వవస్తుచయములో పంచభూతములతో బాటు గుణత్రయము గూడ నంతర్గతమై యొప్పారుచున్నది. గుణములలో దమస్సు ప్రధానముగనున్న అచరములును,

సత్వము ముఖ్యముగనున్న చరములు నేర్పడుచున్నవి. అందును సత్వమునతిక్రమించి రజోతమములున్నచో పశుపక్ష్యాదికములును, తమమునతిక్రమించి రజోసత్వములుగల్గుచో మానవత్వమును గలుగుచున్నవి. కాన నుపాసకుడు సత్యాసత్యవివేచనా విధానమున బ్రతివస్తువులోగల సత్వాంశముపై దృష్టిసారించి దానినే గ్రహింప సమకట్టుచుట యీ జాగ్రత్సాధనలో ముఖ్యాంశముగ నున్నది. సత్వాంశమే ఆత్మకు సన్నిహితము గాన, నదే దృష్టి ఆత్మను జేర్చుమార్గమని వేరుగ జెప్పనవసరములేదు. అందుచేతనే 'రసో వై సః' (తై. 2-7) సర్వమునకు అది రసస్వరూపమైనది అనియు, 'యో వై జ్యేష్ఠం చ శ్రేష్ఠం చ వేద జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ స్వానాం భవతి' (బృ.6-1-1) జ్యేష్ఠమైనది శ్రేష్ఠమైనదానిని నెవడెఱుంగునో వాడు తన వారిలో జ్యేష్ఠుడు శ్రేష్ఠుడుగ గౌరవింపబడును అనిగదా శ్రుతివాక్యములు. అట్లు సర్వ చరాచరభూతకోటిలో సత్వాంతరముగనున్న శ్రేష్ఠత్వమును అనగ సత్వాంశమును గాంచు ఉపాసనలో నుత్తీర్ణతనొందుట జాగ్రదుపాసనావిధానములో బ్రధానము. అదియే ప్రథమము. అదియే శుద్ధమైన వైశ్వానరుని అనగ విరాట్బ్రహ్మదర్శనము గావించు పద్ధతి. ఆస్థితికి జేరిన సాధకుడు పై బృహదారణ్యకశ్రుతిరీతి జ్యేష్ఠుడై శ్రేష్ఠుడై సాటివారిలో నగ్రస్థానము నలంకరించి, మాండూక్యమంత్ర విధానముగ 'ఆదిశ్చ భవతి' ప్రథముడగును. అట్టివానికి సర్వకామములు సిద్ధించుటయందింక సందేహము లేదు. జాగ్రవ్యష్టిచయ మంతయు నతనిదే.

అందుచే 'త్యాగేనైకే అమృతత్వమానశుః' (కైవల్యా.3) త్యాగమొక్కటియే అమృతత్వసిద్ధి కుపాయమని కైవల్యోపనిషత్తు ప్రకటించియున్నది. అనగ బాహ్యమున గోచరించు వస్తు జాతములలో స్థూలమైన నామరూపముల త్యజించి, తదధిష్ఠానమైన సచ్చిదానందలక్షణ ప్రాప్తికై యత్నింపవలయునని అన్వయింపనగును. అప్పుడు 'అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే। అన్నేన జాతాని జీవంతి। అన్నం ప్రయంత్యభిసంవిశంతి' (తై 3-2) అను స్థూలబుద్ధి నశించి, 'ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే। ఆనందేన జాతాని జీవంతి। ఆనందం ప్రయంత్యభిసంవిశంతి' (తై. 3-6) ఆనందములో మాత్రమే యీసర్వభూతములు జనించుచున్నవి. ఆనందములోనే జీవించుచున్నవి. ఆనందముననే లయించుచున్నవి అను పరమార్థమును యీసాధనముద్వార సాధకుడు పొంది, సర్వేసర్వత్ర ఆనందమునుగాంచి ఆనందింప సాధ్యపడగలదు. అందుచే నీ జాగ్రదవస్థాస్థితమైన వైశ్వానరోపాసనము అత్యంత ముఖ్యమని తాత్పర్యము.

అట్లు వైశ్వానరోపాసనము గావించి ఉత్తీర్ణతనొందినవాడు 'స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మస్వన్నమత్తి' (ఛాం. 5-18-1) సర్వలోకముల సర్వేసర్వత్ర సర్వవిధముల నాహారమును భుజించి జీర్ణింప జేసికొనును అని ఛాందోగ్యశ్రుతి. అట్టివాడు 'మహిమానమనుభవతి' (5-3) గొప్పదనము ననుభవించుననియు ప్రశ్నోపనిషత్తు ప్రకటించినది. కాన నీ వైశ్వానరోపాసనము ఇతరములలో ప్రథమస్థానము నలంకరించి యున్నది.

సాధనాభ్యాసమున ముఖ్యముగ ధ్యానాభ్యాస విధానమున గోచరించు విక్షేప కషాయ లయ రసాస్వాదనములు ఇటగూడ యథాతథముగ గోచరించును. ధ్యానాటంకములలో విక్షేపము కేవలము సాధకునికి బాహ్యమై, దశేంద్రియముల ద్వార ధ్యానభంగమును గలుగజేయుచుండును. అటులే స్థూలేంద్రియ సమన్వితమైన జాగ్రదవస్థగూడ సాధకుని బాహ్యలక్షణములుగలదై అతని ఆత్మానుభూతికి ఆటంకదాయకముగ నేర్పడుచున్నది. ధ్యాననిమగ్నతకు బాహ్యసంబంధ విదూరత్వ మెంత అవసరమో యిటగూడ జాగ్రదవస్థాస్థిత సర్వసంగములు అసంగతములై ఆత్మరతి కాటంక హేతువులగునుగాన సర్వసంగ పరిత్యాగము ఆవశ్యక మగుచున్నది. కషాయస్థానమున నట స్వప్నము గలదు. ఉభయము మానసికములే యగుచున్నవి. చిత్తసంస్కార జన్యములుగ రెండును రూపొందుచున్నవి. అందుచే చిత్తమునకు ధ్యానవ్యతిరేకసంస్కారములు జనింపకుండునట్లు జాగ్రదవస్థలో జాగ్రతవహించుట ముఖ్యావసరమగుచున్నది. అనగా బరవిషయములలో నెంత సంగము తగ్గినదంతవరకు సంస్కారములు ఉపశమించి ధ్యానములో గషాయ బాధను తగ్గించును. అటుల స్వప్నమును సాధనోపయుక్తముగ నొనరించి, అందు అధిష్ఠానముగనున్న ఆత్మపరిశీలనము గావింప శుద్ధసంస్కారములు అనగ అనుకూలసంస్కారము లుండినచో సాధ్యము. మరల ధ్యానమున లయము, నిద్ర, విస్మృతి యనబడునవియు నొక ముఖ్యాటంకము. అటులే జీవునికి అజ్ఞానరూపముననున్న సుషుప్తియు ఆత్మజ్ఞానమున కాటంక హేతువే యగుచున్నది. కాని విక్షేప కషాయములు నీరసించిన

కొలది నిద్ర స్వాధీనమయి, అది విస్మృతిరూపముగగాక అన్య
ముగ బరిణమించి, సుషుప్తి తురీయముగ మారి, ఆత్మన
వ్యక్తముగావించు స్థితిగ గ్రమముగ పూర్వుజెందును. అటులె
యీమూడు స్థితు లుడిగిపోవ, రసాస్వాదనమను కించిదానంద
స్ఫురణముగూడ ఆటంకమే యగుచున్నది. అదేవిధముగ
నవస్థాత్రయమును దాటినను, తురీయము పాదచతుష్టయములో
జేరియుండుటచే సంకుచితమై, అపరిమిత బ్రహ్మానుభూతి
కాటంకకారణముగ రాజిల్లును. కాని సాధకుడు అటకూడ, న
అల్పానందమున నిలచిపోవక, తదతీత బ్రహ్మముపై బ్రథమమ
నుండి దృష్టినుంచినచో, నటగూడ నతడు నిలువక బురోగ
మించి, సర్వాతీతబ్రహ్మమును బొందును అనిమాత్రమ
వ్యావహారికముగ బ్రస్తుతమునకు జెప్పకొనెదముగాక.

ఈ విక్షేప కషాయ లయ రసాస్వాదనములు మరల బ్ర
అవస్థలోనుగలవు. ధ్యానమున లేకున్నను, జాగ్రత్తులో సీనాటిగ
ఆటంకములు ఎందున్నను సాధకుని నెదుర్కొనుచునే యుండును
ధ్యానమున నుపయోగింపబడిన ఆటంకనివారణోపాయములన
యిటకూడ బ్రయోగించి సాధించినచో సాధకు డెటనున్నను
ఏస్థితిలోనున్నను, ఆత్మానుభూతిలో నోలలాడుచుండు నవక
శము గలదు. అటులే యితరఅవస్థలలోగూడ నన్వయింపనగును
ఇట్లు అన్వయించుకొని సాధించుటకు ఎక్కువ ప్రజ్ఞయుండవలె
నని వేరుగ జెప్పనవసరములేదు. ఇక సాధించి సిద్ధిగాంచుట
అత్యంతకష్టసాధ్యము. మరియు నొక జాగ్రదవస్థను సాధించు
టయే బహుప్రయాసహేతువుగ నుండ, నిక నిదేవిధముగ నితర
అవస్థల సాధించు టెట్లు, సిద్ధి నొందు టదెట్లు? అది కేవలము

దుస్సాధ్య మనిపించును. కాని సాధనకు దిగినవానికి సులభము కాకపోదు. అందుచేత గౌడపాదాచార్యుడుగూడ 'అస్పర్శ యోగో వై నామ దుర్దర్శః సర్వయోగిభిః । యోగినో బిభ్యతి హ్యస్మాదభయే భయదర్శినః॥' (మాం.కా.3-39) దేనితోడను యోగముగాని యీ అస్పర్శయోగము, సామాన్యయోగులకు సాధ్యముకానిది. యోగులు దీని జూచి భీతి జెందెదరు. అచ్చట యథార్థమున భయహేతువులేకున్నను వారందు భయమును గాంచెదరని వచించుచు, సామాన్యుల కది దుస్సాధ్యమే అని సమ్మతించుచు, అధికారులకు అది సులభసాధ్యమే అని గౌడపాదుని వాగ్దానము. దీని నెక నుండుగూడ గాంచెదము గాక.



# పదియవ మంత్రము

స్వప్నస్థాన స్తైజస ఉకారో
ద్వితీయా మాత్రోత్కర్షా దుభయ
త్వాద్వోత్కర్షతి హ వై జ్ఞానసంతతిం
సమానశ్చ భవతి నాస్యా బ్రహ్మవిత్కులే
భవతి య ఏవం వేద ।

స్వప్నస్థానాభిమానియైన తైజసుడు, ఆధిక్యతచేత, రెండుస్థానములకు మధ్యనుండుటచేత ఓంకారములోని ద్వితీయ ఉకారము అగును. దీని నెరింగినవాడు, విజ్ఞాన సంచయమును అధిక మొనర్చుచున్నాడు. ఎల్లరచేత సమాన గౌరవాదరముల

జూడబడును ఈతని వంశమునందు, బ్రహ్మవిదుడు కానివాడు జనింపడు. ఇచట తైజస ఉకారములకుగల సామ్యము విచారింపబడుచున్నది. ఆధిక్యతచేత ననుటకు ఉత్కర్ష శబ్ద ముపయుక్తము. పూర్వముండిన విశ్వ అకారములకంటె నీద్వయ ముత్కృష్టము. ఎట్లు? విశ్వుడు కేవలము బహిఃప్రజ్ఞ గలవాడై, స్థూలభుక్కనిపించుకొనియున్నాడు. అతని ఆనందమునకు స్థూలేంద్రియములేగాక స్థూలవిషయములుగూడనున్నగాని సాధ్యముకాదు. అదియునుగాక నతని ఆనందసాధనమంతయు స్వాధీనముగాక ఈశ్వరకల్పిత వ్యావహారిక సృష్టిపై నాధారపడియున్నది కాని తైజసునిస్థితి తద్వ్యతిరేకము. అతనికి స్థూలేంద్రియ విషయాపేక్ష లేదు. వాని వాని సంస్కారముల మాత్రము వెంటగొని, వానికి స్వరూపచైతన్యముల గల్పించి, వానితో సుఖదుఃఖముల భోగించును. ఆయంతఃసృష్టి నంతటిని అన్యముపై నాధారపడక కేవలము స్వశక్తిచేత దన సర్వావసరముల సృజించుకొనును. అందుచేత విశ్వునికంటె తైజసునికి అధికతర శక్తిసామర్థ్యము లున్నట్లు విదితము. అతనికి మనస్సే ఆధారము. అది అతని రూపము, శక్తి, సర్వము. తన స్వకల్పిత దృశ్యముల నొక పర్యాయము సృజించి, పోషించుచు అనుభవించి, అంత్యమున నకారణముగ వాని నుపసంహరించుకొనును. అనగ మరల తనలో లయింపజేసికొనును. అందుచేత తైజసుడు జగత్సృష్టి స్థితి లయకర్తయైన పరమేశ్వరుని తాత్కాలిక ప్రతిరూపమా అనిపించు శక్తిసామర్థ్యముల స్వప్నములో బ్రకటించును. అందుచే నితడు విశ్వునికంటె నధికుడే యనుట కెట్టి సంశయములేదు. కావున నతనికి జంటగ

గల ఉకారముగూడ అకారముకంటె నధికముగ జెప్పంబడి యున్నది.

ఈతని ఆధిక్యతకు మరియొక కారణము వాగొనబడి యున్నది. తైజసుడు విశ్వప్రాజ్ఞులకు మధ్యనుండుట యగును. అందుచేతనే స్వప్నావస్థను సంధ్యావస్థ అనియు, గాన తైజసుడు ఉభయలోకముల దర్శించుచుండుననియు బృహదారణ్యక వాక్యముల బూర్వము గాంచియున్నాము. అట్టి అవకాశము విశ్వ ప్రాజ్ఞులకు అభావము. అంతియగాక బూర్వగ్రంథమున మనము గాంచినట్లు తైజసునికి, విశ్వునికిగల సర్వానుభవ సంపత్తి గలదు. అందుచే నతని సర్వరహస్యముల నాత డెరుంగును. అటులే తైజసునికి స్థూలాతీత యింద్రియాతీతస్థితి యైన ప్రాజ్ఞుని విషయము గ్రాహ్యామే. వీరిరువురు కేవలము సంస్కారాధీనులు. స్థూలత్వము పూర్తిగ నిరువురికిని లేదు. అంతియగాక, విశ్వుని లోపమైన స్థూలత్వము తైజసునికి లేదు. అటులే ప్రాజ్ఞునికి సహజమైన విస్మృతి అనగ అజ్ఞానముగూడ లేదు. ఈకారణములవలన విశ్వ ప్రాజ్ఞులకు మధ్యనుండి,యిరువురి లక్షణములగలిగి, దోషములు లేకయుండుట తైజసుని ఆధిక్యత యని చెప్పనొప్పును. ఇదే అన్వయము అకార మకారముల మధ్యగల ఉకారమునకుకూడ చేయబడియున్నది.

ఈ తైజసరహస్యమును గ్రహించినవాడు,తన జ్ఞానమును బెంపొందించుకొనును. స్థూలేంద్రియములపై నాధారపడని మనస్సుపై దృష్టినిలిపి, దాని బరీక్షించుచు, ధ్యానించుచు నుండుటచే నామనస్సునకు బలముచేకూరి సర్వ సామర్థ్యము సిద్ధించుట సహజమే. దానిచే దానికి ఏకాగ్రత సూక్ష్మత

ఏర్పడి సాధకు డేవిషయమును గ్రహింపయత్నించినను అది అతిసులభమై సాధ్యపడును. కావున నతని జ్ఞానమాభివృద్ధి గాంచునని ఉపనిషత్తు. అట్టి ప్రజ్ఞాశక్తిని ఉచితరీతి గౌరవింపనివా డెవడుండును? అతని గౌరవించుట స్వాత్మగౌరవముగా భావించి మిత్రశత్రు లేకమగుదు రనుటలో నతిశయోక్తియుండదు. అతనికి శత్రువులే ఉండజాలరు. అట్టి అపూర్వ ప్రజ్ఞావాతా వరణములో బుట్టినవాడుగాని పెరిగినవాడుగాని బ్రహ్మవేత్త కాక నుండగలడా? ఆశక్త్యావరణము ఎట్టివానినైన నభివృద్ధి గలుగజేయు సామర్థ్యముతో నుండ నిక నందే పుట్టి, అందే పెరుగువారి విషయము నాలోచింప ననావశ్యము. అనగ నతని సన్నిధానమున తజ్జన్యముగ బ్రహ్మవిదులే యుందురని మంత్రతాత్పర్యము.



## పదునొకండవ మంత్రము

సుషుప్తస్థానః ప్రాజ్ఞో మకార స్తృతీయా
మాత్రా మితేరపీతేర్వా మినోతి హ వా
ఇదం సర్వమపీతశ్చ భవతి య ఏవం వేద।

సుషుప్తిస్థానమున కధిమూర్తి అయిన ప్రాజ్ఞుడు ఓంకారమున దృతీయమాత్రయయిన మకారము. ప్రాజ్ఞత్వ మకారములు రెండును పరిమాణమువలనను, సర్వముయొక్క ఏకీభూతత్వమువలనను సమానము. ఈవిషయము నెఱ్ఱిగినవాడు,

సర్వముయొక్క మానము నెరుంగును. సకలమును తనయందే గాంచును.

విశ్వ తైజసులను అకార ఉకారములతో సమన్వయ పరచి, అందందుగల తత్త్వముల బోధపరచి, తత్సంబంధ ఉపాసనావిధానముల నుపదేశించి, పిమ్మట వానివాని ఫలితములగూడ ఉపనిషత్తు వివరించియున్నది. ఈ మంత్రమున సుషుప్తస్థాన ప్రాజ్ఞునికి మకారమునకును నన్వయించుచున్నది. ఈ రెండింటికి గల సామ్యములగూర్చి తెలుపుచు, 'మితి' అనగా కొలత మానము అని వచించినది అనగా ధాన్యాదుల నొక కొలతపాత్రతో గొలిచినట్లు యీ ప్రాజ్ఞ మకారములు కొలుచుచున్నవని యర్థము. వీనిచే గొలువబడు పదార్థము లెవ్వి? జాగ్రత్స్వప్నములు ఏకీభూత చేతోముఖరూపముగా ప్రాజ్ఞునిచే గొలువబడుచున్నవి. విశ్వతైజసస్థితులు సంస్కార పూర్వకముగా ప్రజ్ఞానఘనమై ప్రాజ్ఞునిలో నిమిడియుండి కాలాంతరమున సంచలనమునొంది చేతోముఖములై అనగ బహిర్గతములై స్వప్నజాగ్రత్తులుగా మారుచున్నవి. ప్రజ్ఞానఘనత్వమున లేని విషయములు తైజసప్రాజ్ఞులు గ్రహింపజాలరు కాన వారి వ్యవహారము ప్రాజ్ఞుడు పరిమితము గావించుచున్నాడనియే తాత్పర్యము. అట్లయినచో జాగ్రత్తులో నూత్నానుభవములు నూత్నజ్ఞానములు గలుగుటలేదా అని సంశయించినచో, లేదు అని అద్వైతశాస్త్రము వక్కాణించును. తురీయుడు శుద్ధచైతన్యస్వరూపుడు. అతడే ప్రాజ్ఞుడు. కాని తాను తురీయుడైన ఆత్మను అను జ్ఞానము విస్మరింపబడుటచే ప్రత్యేకముగ నతడు ప్రాజ్ఞుడని చెప్పంబడియున్నాడు. విస్మరించినంత

మాత్రమున నతడు ఆత్మ కాకుండబోవునా? అందుచే నతనిలో ఆత్మలక్షణము అజ్ఞాతముగ నుండియే యున్నది. సాధనాదులచే నతని అజ్ఞానమాలిన్య మెంతతొలగునో అంత తురీయజ్ఞానము అతనికి గలుగుచుండును. ఆత్మయందు లేని విషయము అవస్థాదులయందు లేదుగదా? అవస్థాదులలో ఆత్మలక్షణము లుండియు, అంతఃకరణావచ్ఛిన్నములయి తత్సంబంధమైన అన్యథాజ్ఞానము గోచరించుచుండుటచే ఆత్మ ప్రత్యక్షముగ లేనట్లు దోచును గాని అన్యోన్యాధ్యాసపూర్వకముగ సర్వనామరూపములలోనుండి అది కర్తృత్వ భోక్తృత్వాదులుగల స్వస్వరూపముగ దొంగిచూచుచునే యున్నది. కాన నెంత నామరూపములు వానిజ్ఞానము లోపించుచుండునో అంతగ ఆత్మ ప్రస్ఫుటమగుచుండునని అద్వైతతాత్పర్యము. అందుచే బ్రపంచమున నూత్నవిషయముగాని శ్రోత్రజ్ఞానముగాని అభావము. కాని ఆత్మజ్ఞానము ఏకము అద్వయము. అందుచే జాగ్రత్తులో మన కనుభూతమగు నూత్నత్వమంతయు, అన్యథాజ్ఞాన సంస్కారపుంజరూపమున సర్వజ్ఞుడై సృష్టి స్థితి లయ కారణుడైన ప్రాజ్ఞునిలో బూర్వమే యిమిడియుండి పైపేర్కొనిన విధాన సాధనమగ్నత నొందుచున్నకొలది ఆ సంస్కారములు ఉద్బూతములగుటచే నూత్న మనిపించునుగాని అది పూర్వకాలికమే. అయినను ప్రాజ్ఞుని సర్వజ్ఞత్వము అవస్థాపరిమితము గాన అజ్ఞానజన్యమే యయి అపరవిద్యగ బరిగణనము. జాగ్రత్తులో గ్రహింపబడుచున్న విషయ వినూత్నత్వమంతయు, ప్రాజ్ఞుని సర్వజ్ఞత్వములో నంతర్గతమే యగును. సదా జ్ఞానాభివృద్ధి గలుగజేయుచున్నదని భ్రమింపజేయు

జాగ్రత్స్థితియే యిటులుండ నిక విశ్వప్రాజ్ఞ సంస్కారములపై నాధారపడుచుండు తైజసునిస్థితిని వచింపవలెనా ? అతనిలో గూడ గ్రొత్తదనమేదియును ఉండజాలదు. ఈవిధముగ విశ్వ తైజసులు ప్రాజ్ఞునిచే బరిమితము జేయబడుచుండుటచే 'మితి' అను శబ్దమును మాండూక్య ముపయోగించి ప్రాజ్ఞుని లక్షణ మును వర్ణించియున్నది. అదేవిధముగ మకారము అకార ఉకారముల గొలుచుచు బరిమితపరచుచున్నది. అకారము ఉకారమునను ఉకారము మరల మకారమునను లయించుట విదితమే. వెంటవెంట వాని నుచ్చరించిన నది వ్యక్తము. అటుల మరల మకారమునుండియే ఉకార అకారము లుద్భవించుటయు స్పష్టము. కాన మకారము వాని గొలుచుచున్నదని అర్థము.

మరియొక సామ్యత్వమును దెలుపుచు 'అపీత' పదము లయించుట అను అర్థముతో దెలుపబడియున్నది. ఈవిషయము అయిదవమంత్రమున 'ఏకీభూత' పద వివరణసందర్భమున దెలుపబడియున్నది. స్థూలేంద్రియములు స్థూలవిషయముల సంస్కారములనుగా నొనర్చి, తమవృత్తులతో వాని స్వప్న స్థితిలోనికి బంపి తాము విశ్రాంతి గొనుచుండును. అటులే సూక్ష్మేంద్రియములు స్వప్నవిషయముల అజ్ఞాతసంస్కారము లనుగా నొనర్చి, అటుగ బీజసంస్కారములనుగ మార్చి ప్రాజ్ఞునకు అందించి ఇవియు నుపశమించును. ప్రాజ్ఞునిలో నీయింద్రియవృత్తులు తమ విషయములతో నెట్టి భోక్తృభోగ్య భావసంబంధము లేక, దమ కర్తృత్వాహంకారాదికమును మరచి అభేదవృత్తి బ్రహ్మానఘన స్వరూపమున నొత్తిగిలి యుండును. అందుచే అపీత పదము యిట ప్రయోగింపబడి

యున్నది. అటులే అకార ఉకారములు మకారమున లయిం చుటయు ప్రత్యక్షనిదర్శనమే యని పూర్వమే నిర్ణయింపబడి యున్నది. ఈరెండుకారణములచే ప్రాజ్ఞ మకారములు సమ ములు అని తెలుపబడియున్నది.

అయినచో జ్ఞానమువలన ప్రయోజన మేమి? ఇట్లు యీ రహస్యము నెరింగినవాడు సృష్టియొక్క రహస్యమునంతటిని గ్రహించును. అనగ దాని పుట్టు పూర్వోత్తరముల దెలిసి కొనును. అది ఆత్మేతరముగాక ఆత్మాధిష్ఠానము గల్గినదే అనియు, దాని ఆత్మ లక్షణములుమాత్రమేగాక, దానియందు అజ్ఞానజన్యమైన ఆత్మేతరగుణములును మిశ్రితములై అన్యోన్య విభాగమున కసాధ్యములై యున్నవనియు, ఆలక్షణద్వయ జ్ఞానమును గ్రహించి, దృగ్దృశ్యవివేకమున దృక్స్థానము ఆత్మ కును దృశ్యస్థానము లోకమునకును ఒసంగి, ఆత్మేతరముల ఆభాసముగ అజ్ఞాన అన్యథాజ్ఞానములుగ గ్రహించి, త్యజించి, ఆత్మావలోకన సామర్థ్యమును గురించి, సాధనాబలముచే 'ఆత్మైవాహం' 'న జీవోస్మి' అను దృఢజ్ఞానము నొందుటకు ఈ విశ్వవిజ్ఞాన ముపయుక్తమగుచున్నది. ఆసర్వసృష్టి స్థితి లయకర్త యయిన ఈశ్వరుడు తానే యను అచంచలజ్ఞానమునకు త్రోవ దీయును. అనగ విశ్వ తైజస ప్రాజ్ఞరూపమున జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థల వ్యవహరించు జీవాత్మనుమాత్రమే తానని గ్రహించుకొనుట గాక, తత్తత్సంబంధమున నెలుగొందు విరాట్ హిరణ్యగర్భ ఈశ్వరుడును అనగ కార్య, కార్యకారణ, కారణబ్రహ్మములు గూడ దానే అని గ్రహించును. కాని కార్యము కారణాభేదమున నుండునను అద్వైతసిద్ధాంతమురీతి

కార్యబ్రహ్మమైన విరాట్టు కార్యకారణ బ్రహ్మమైన హిరణ్య గర్భునకు బహుడు గాకుండుటచే అనగ నతడే యితడగుటచే బూర్వము జాగ్రద్రహస్యముల గ్రహించి, విశ్వుడుగ గోచరించు తా యథార్థముగ సమష్టిరూపమునను విరాట్టు తానే యని ప్రథమతః సాధకుడు గ్రహించును. అటులే మరల విశ్వ తైజస విభేదము కల్పితమే అని గ్రహించి, దాని సమష్టియం దన్వ యించి, విరాడ్ఢిరణ్యగర్భ లొక్కటియేయనియు నెఱింగి, అందుచే హిరణ్యగర్భుడుగూడ తానే అనియు దెలిసికొనును. అంత హిరణ్యగర్భునకు గారణమైన ఈశ్వరునుగూడ, తైజసుడు ప్రాజ్ఞుడుగ యథార్థమున నున్నట్లు వ్యక్తము గావించుకొని ఈశ్వరుడుగూడ తానే అని గ్రహించుకొనును. అనగ నొక ఆత్మ స్థానభేదముచే ప్రాజ్ఞ తైజస విశ్వనామముల బరగుచేగాని యథార్థముగ నొక్కడే యయినట్లు, ఒకే బ్రహ్మము వివిధ దృష్టుల గాంచినచో నీశ్వర హిరణగర్భ విరాట్టులవలె దోచును గాని సత్యమున నొక్కడే యనియు గ్రహించి, జీవేశ్వరాభేదమున దానే ఈశ్వరుడని సాధకు డెఱుంగునని ఉపనిషత్తాత్పర్యము.



# పంద్రెండవ మంత్రము

అమాత్ర శ్చతుర్థో౽వ్యవహార్యః
ప్రపంచోపశమః శివో౽ద్వైత ఏవ మోం
కార ఆత్మైవ సంవిశత్యాత్మనా౽త్మానం
య ఏవం వేద.

అమాత్ర యనగా మాత్రలు లేనిదియు, అవ్యవహార్యమును, ప్రపంచోపశమమును, ఆనందకరమును, అద్వైతమును అగు ఓంకారము నాలుగవపాదము. అదియే ఆత్మ. దాని నెరింగినవాడు ఆత్మలయము నొందును.

'అకారః ప్రథమాక్షరో భవతి। ఉకారో ద్వితీయాక్షరో భవతి। మకార స్తృతీయాక్షరో భవతి। అర్ధమాత్ర శ్చతుర్థాక్షరో భవతి' (రామోత్తరతాపినీ. 2) మొదలగు నుపనిషత్తులవలె అర్ధమాత్రను జతుర్థాంశముగ మాండూక్యము గైకొనక, బూర్వము ఏడవమంత్రమునందువలె ఆత్మనే చతుర్థపాదముగ గైకొనియున్నది. ఇది అమాత్ర అనబడియున్నది. ఇది పూర్వ అకార ఉకార మకారములతో గూడి వానికి పరమైన నొక ప్రత్యేకతను గలిగి చతురాంశశోభితమైన ఓంకారమని అర్థము. ఇందు నిక నేభాగములు లేక బూర్ణత్వము నొందియుండుననియు గ్రాహ్యము. అటులే విశ్వుడు తైజసునందును, అతడు ప్రాజ్ఞునందును లయింప, నతడజ్ఞానమును బోనాడి తురీయుడైన ఆత్మలో లయించునని స్థూలార్థము. అట్లుగాక విశ్వునిలోని స్థూలమైన అన్యథాజ్ఞానత్వము నశింప, సూక్ష్మమైన అన్యథాజ్ఞానవిశిష్టుడైన తైజసుడుగ నతడు పరిణమించును. మరల

నతనిలో నానూక్ష్మ అన్యథాత్వము నశింపజేయుగ నతడు బీజ సంస్కారియై అజ్ఞానమాత్రవిశిష్టుడై యొప్పారును. అతడే ప్రాజ్ఞుడు. ఈప్రాజ్ఞునుండి అజ్ఞానబీజమును దొలగింప, నత డవ్యయమైన ఆత్మగ నగునని యథార్థము. అందుచే దురీయునిలో నేభాగములులేక సంపూర్ణత్వము యిట నుపదేశింప బడియున్నది.

అతడు అవ్యవహార్యుడు. పూర్వోక్తమందము 'విశ్వ తైజస ప్రాజ్ఞ స్వస్వోపాధిలయా త్ప్రత్యగాత్మని లీయంతే' (పైంగల. 3) విశ్వతైజస ప్రాజ్ఞులు తమ ఉపాధులతో ప్రత్యగాత్మలో లయింపగా 'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' (తై. 2-4; 2-9; బహ్మా. 25) వాక్కు పొంద జాలక దేనినుండి మనస్సుతో సహా నివర్తించునో అనునట్లు వాఙ్మనములు రెండును అంతర్ధానమగును. సూక్ష్మదృష్టి విచారించుచో అభిధాన అభిధేయములు అనగ నామరూప ములు రెండును మనోవికారములై మనోస్పందనముగ నున్నవి. జ్ఞానోదయమున అవి మనోలయముతోగూడ నదృశ్యమై పోవును. కాన తురీయమునకు నామరూపముల నన్వయింప నశక్యము. అట్లు నామరూపాత్మకముగాని దాని నెట్లు వ్యవహ రించుట? అందుచే నది అవ్యవహార్యము అని వచింపబడినది. అట్లు అజ్ఞానము తనకార్యసంచయముతో సహా లయింప 'ఏవం త్రిపుట్యాం నిరస్తాయాం నిరస్తరంగ సముద్రవ న్నివాతస్థ దీపవ దచల సంపూర్ణ భావాభావవిహీన కైవల్యజ్యోతి ర్భవతి' (మండలబ్రాహ్మణ. 2) ఇట్లు త్రిపుటీ నిరస్తమగుచోట నిస్త రంగ సముద్రమువలెను, గాలిలేనిచోట దీపమువలెను, భావా

భావములేని సంపూర్ణ నిశ్చల కైవల్యజ్యోతి యగుచున్నది. 'యథా నద్యః స్యందమానాః సముద్రేఽస్తం గచ్ఛంతి నామ రూపే విహాయ' (ముం. 3-2-8) నదు లెటుల ప్రవహించుచు సముద్రమున దమ నామరూపముల వదలి లయించుచున్నవో అనునట్లు చిత్తము లయింప, సర్వద్వంద్వము నశించి 'తల్లయా చ్ఛుద్ధాద్వైతసిద్ధిః భేదాభేదాత్ ఏతదేవ పరమతత్త్వం' (మండలబ్రాహ్మణ. 5) మనోలయమువలన భేదభావము లేమిచే అద్వైతసిద్ధి కలుగుచున్నది. అదే పరమతత్త్వము. 'యత్తు చంచలతా హీనం తన్మనోఽమృత ముచ్యతే। తదేవ చ తపః శాస్త్రసిద్ధాంతే మోక్ష ఉచ్యతే॥' (మహో. 4-101) ఏమనసు నందు చంచలత్వము నశించునో అది అమృతము. అదియే తపము. శాస్త్రసిద్ధాంతమున నదియే మోక్షము. 'మనస్తత్ర లయం యాతి తద్విష్ణోః పరమంపదం' (నాదబిందు. 47) చిత్తమట లయింప నదియే విష్ణువుయొక్క పరమపదము. 'నాదాంతేఽపి మనోన్మనీ' (నాదబిందు. 48) నాదాంతమున ఉన్మనీ అనియు ఉపనిషచ్ఛ్రుతులు పలురీతుల నావిషయము నుక్కడించియుండుటచే, నది సర్వప్రపంచోపశమమై వెల్గొం దును. అందుచే నది శివంకరమై ఆనందస్వరూపముగ నగునని 'రసో వై సః రసం హ్యేవాయం లబ్ధ్వానందీభవతి' (తై. 2-7) అది రసస్వరూపమైనది. ఆ రసమునుబొంది ఆనందమును బొందును అనియు, 'ఆనందో బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కదాచనేతి' (తై. 2-4) అట ఆనందస్వరూపుడైన బ్రహ్మజ్ఞు డైన విద్వాంసుడు కొంచెమేని భీతినొందడు అనుటయు 'ద్వితీ యాద్వై భయం భవతి' (బృ. 1-4-2) అనునట్లు ద్వైతము

లేని స్థితికావునసే శివంకరమై యున్నదని ప్రపంచోపశమ శివ అద్వైతపదముల బూర్వము విమర్శించి గ్రహించియున్నారము. అవి పరస్పరాపేక్షికములై ఆత్మస్థితియొక్క సమగ్రస్వరూపము ను వ్యక్తపరచును. అదియే ఓంకారము, ఆత్మ.

అట్లు మంత్రార్థరహస్యము నెరింగిన బుధవర్యు డేమగును అనగ నాజ్ఞానఫలిత మెట్టిది? 'బ్రహ్మవిదాప్నోతి పరం'(తై.2-1) బ్రహ్మవిదుడు పరత్వమును బొందును. పర మనగా నేమి? 'స యో హ వై తత్పరం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి' (ముం. 3-2-9) ఈ బ్రహ్మము నెరింగినవాడు బ్రహ్మమే యగును. 'బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి' అనునట్లు అతడు బ్రహ్మమే అగుచున్నాడు. 'యథా నద్యః స్యందమానాః సముద్రేస్తం గచ్ఛంతి నామరూపేవిహాయ। తథా విద్వాన్ నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యం॥' (ముం. 3-2-8) ఎట్లు నదులు ప్రవహించి, నామరూపముల బరిత్యజించుచు సముద్రములో అస్తమించునో, అట్లే విద్వాంసుడు, నామరూపాది విముక్తుడై దివ్యమైన పరాత్పరునిలో లయించును. అనగ 'తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్య ముపైతి' (ముం. 3-1-3) అంత విద్వాంసుడు పుణ్యపాపముల దన్నివేసి నిర్మలుడై పరమైన లయమును బొందును. అపుడు ఇంతవరకు జీవుడుగా నున్నవాడు 'కర్మనాశే సదాశివః' 'పాపముక్తస్సదాశివః' (స్కంద. 6, 7) అప్పటిక జీవాత్మలలో విభేదము అదృశ్యమై 'యథా జలే జలం క్షిప్తం క్షీరే క్షీరం ఘృతే ఘృతం। అవిశేషో భవేత్తద్వ జీవాత్మ పరమాత్మనోః॥' (పైంగల. 4-10) ఎట్లు జలము

జలమునను, క్షీరము క్షీరమునందును, ఘృతము ఘృతములోన లయించి అవిశేషమగునో అనగ అభేదమునొందునో అట్లు జీవాత్మ పరమాత్మ లేకమగుదురు. అంత 'అభయం ప్రతిష్ఠాం విందతే। అథ సోఽభయం గతో భవతి' (తై. 2-7) ఆత్మలో అభయస్థిరత్వము నొందగ అభయత్వమే సిద్ధించును. 'యే తద్విదు రమృతాస్తే భవంతి' (బృ. 4-4-14) దాని గ్రహించిన వారు అమృతత్వమును బొందుదురు. 'అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే' (బృ. 4-4-7) అంత మర్త్యుడు అమృతుడగును. అచట బ్రహ్మమును బొందును. 'అజం ధ్రువం సర్వతత్త్వైర్విశుద్ధం జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః' (శ్వే. 2-15) అజము, ధ్రువము, విశుద్ధము అయిన దాని గ్రహించి సర్వపాశములనుండి విముక్తినొందును. అప్పుడతడు 'ఏతమేవ విదిత్వా మునిర్భవతి' (బృ. 4-4-22) ఇట్లు దాని గ్రహించి ముని అగును అను వాక్యములు బ్రహ్మజ్ఞాని బ్రహ్మమే అని తీర్మానించుటచే నతనిలో నింక నెట్టి పాశములు గాని అభావము అని గ్రాహ్యము.

అట్టి ఆత్మజ్ఞాని 'సర్వావస్థా వినిర్ముక్తః సర్వచింతా వివర్జితః' (నాదబిందు. 51) సర్వఅవస్థా విముక్తిని బొంది ఏ చింతయు లేకుండును. అతడు 'కాష్టవత్ జ్ఞాయతే దేహం ఉన్మన్యావస్థయా ధ్రువం। న జానాతి స శీతోష్ణం న దుఃఖం న సుఖం తథా॥' (నాదబిందు. 53) ఉన్మనీయవస్థలో ధృఢమైనవాడై దేహమును కాష్టమునువలె గాంచును. అతడు శీతోష్ణాదులను సుఖ దుఃఖములను గ్రహింపడు. మరియు 'భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః। క్షీయంతే

చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥' (ముం. 2-2-8) పరావరుని గాంచుటచే హృదయగ్రంథులు భిన్నము గావింప బడెను. సర్వసంశయములుగూడ ఛిన్నమైనవి. అతని కర్మములు క్షీణించినవి. కావున 'న స శోచీరాత్మవిజ్ఞానీ శోకస్యాంతం గమిష్యతి' (శాండిల్యో. 2-0) ఆత్మవిజ్ఞాని శోకింపడు. అతడు శోకముయొక్క అంతమును బొందును. అట్లగుటచే 'శాంతి మత్యంత మేతి' (శ్వే. 4-11) అత్యంతశాంతిని బొందును. 'నిర్మమోఽమనసః శాంతో గత పంచేంద్రియ భ్రమః' (సంన్యాస. 2-19) అతడు నిర్మముడై మనవరహితుడై పంచేంద్రియ భ్రమశూన్యమున శాంతు డగుచున్నాడు. 'శాంత మచల మద్వయానంద విజ్ఞానఘన ఏవాస్మి' (పరమహంస.2) అని స్థిరుడై 'శ్రుత్వా స్పృష్ట్వా చ భుక్త్వా చ జ్ఞాత్వా శుభా శుభం। న హృష్యతి గ్లాయతి యః స శాంత ఇతి కథ్యతే॥' (మహో.4-32) శుభాశుభముల నాకర్ణించినను, స్పృశించినను, భుజించినను, గ్రహించినను సుఖదుఃఖముల బొందక ఎవ డుండునో అతడు శాంతుడు అని పలుకబడును అనురీతి నుండి, 'లబ్ధ్వా శాంతిపదం గతే తదా ప్రభా మనోబుద్ధిశూన్యం భవతి' (పైంగల. 4-9) శాంతిపదమును బొంది అంత ప్రభామనోబుద్ధి శూన్యతను బొందిన వాడగును. అతనికి నిక 'న చాస్తి కించి త్కర్తవ్యం' (దర్శన. 1-23) అతనికి నొంచెమేని కర్తవ్యము లేదు. 'తచ్చాసంద సముద్రమగ్నా యోగినో భవంతి। తదపే క్షయా ఇంద్రాదయః స్వల్పానందాః ఏవం ప్రాప్తానందః పరమయోగీ భవతి॥' (మండలబ్రాహ్మణ. 2) అట్టి జీవన్ముక్తి ఆనందసాగర మగ్నులైన యోగులకు లభించును. ఈఆనంద

నతో బోల్చినచో ఇంద్రాదులు అల్పానందముగలవా రగు చున్నారు. ఈ బ్రహ్మానందమును బొంది పరమయోగి అగు చున్నాడు.

'యదా న భావ్యతే భావః క్వచిజ్జగతి వస్తుని। తదా హృదంతరే శూన్యే కథం చిత్తం ప్రజాయతే॥' (అన్నపూర్ణ. 4-49) జగతిలోని వస్తువులు నెచ్చోటనైన భావింప నప్పుడు, హృదయాకాశములో నపుడు శూన్యత్వముండగా చిత్తము ఎట్లు సంకల్పించును? అని అన్నపూర్ణ ప్రశ్నించినట్లు 'అభేద దర్శనం జ్ఞానం ధ్యానం నిర్విషయం మనః।' (స్కంద. 11) అనురీతి జ్ఞానధ్యానముల నారూఢుడైన యోగి చిత్తవృత్తి ఎట్లుండును? 'వృత్తి విస్మరణం సమ్యక్సమాధి రభిధీయతే' (తేజోబిందు. 1-37) బాగుగా వృత్తుల విస్మరించుట సమాధి అనియు 'ధ్యానస్య విస్మృతి స్సమ్యక్సమాధి రభిధీయతే' (త్రిశిఖిబ్రాహ్మణ. 37) 'ధ్యాన విస్మృతి స్సమాధిః' (మండల బ్రాహ్మణ.1) సర్వవృత్తిరాహిత్య స్థితియే యని నిర్వచింపబడిన నిర్వికల్పసమాధిలో మగ్నుడై యోగి ఉండును. 'సమాధి స్సమతావస్థా జీవాత్మ పరమాత్మనోః' (యోగతత్త్వ. 106) జీవబ్రహ్మముల సమత్వస్థితియే సమాధి అనియు, 'జీవాత్మ పరమాత్మైక్యావస్థా త్రిపుటీరహితా పరమానంద స్వరూపా శుద్ధచైతన్యాత్మికా భవతి' (శాండిల్య. 1-11-0) సమాధి యనగా జీవాత్మపరమాత్మలకైక్యస్థితియై త్రిపుటీరహితమై పరమానందస్వరూపమై శుద్ధచైతన్యముగ యున్నదని శాండిల్యము బోధించును. మరియు 'ధ్యాతృ ధ్యానే విహాయ నివాతస్థిత దీపవద్ధ్యేయైకగోచరం చిత్తం సమాధి ర్భవతి'

(పైంగల. 3) ధ్యాతృధ్యానముల వదలి, గాలిలేనిచోట నిశ్చల దీపికవలె చిత్తముండుట సమాధియని పైంగల ముపదేశింప, 'ధ్యాతృ ధ్యానే పరిత్యజ్య క్రమాద్ధ్యేయైకగోచరం।నివాతదీపవ చ్చిత్తం సమాధిరి త్యభిధీయతే॥' (అధ్యాత్మ. 35) అని అదే అర్థమును అధ్యాత్మ గానముచేసినది. 'సలిలే సైంధవం యద్వత్ సామ్యం భవతి యోగతః। తథాత్మమనసోరైక్యం సమాధి రితి కథ్యతే॥' (వరాహ. 2-75, సౌభాగ్యలక్ష్మి.14) నీటిలో లవణము కలిసి ఏకమైనట్లు ఆత్మ మనముల ఐక్యత్వము సమాధి యనబడును. అందుచే 'ప్రభాశూన్యం మనఃశూన్యం బుద్ధిశూన్యం నిరామయం । సర్వశూన్యం నిరాభాసం సమాధి రభిధీయతే॥'(సౌభాగ్యలక్ష్మి.17)అనుచు సౌభాగ్యలక్ష్మి సమాధిలో ఆత్మేతరసర్వము శూన్యముగ బోధించియున్నది. కాని 'ఉదితౌదార్య సౌందర్య వైరాగ్య రసగర్భిణీ। ఆనందస్యందినీ యైషా సమాధి రభిధీయతే' (మహో. 4-61) వచింపబడిన ఔదార్య సౌందర్యవైరాగ్యరసములగలిగిన ఆనందప్రవాహము సమాధియని మహోపనిషత్తు సమాధిగల ఆనందలక్షణముల గొంచెము సూచించినది. అందుచే జన్మహేతువులగు 'సమస్త వాసనా స్త్యక్త్వా నిర్వికల్ప సమాధితః' (అన్నపూర్ణ. 4-62) సమస్తవాసనలు పరిత్యజింపబడిన నిర్వికల్పసమాధి అగుటచే 'సమాధి భవనాశనం' (జాబాలదర్శన. 10-1) సమాధి జన్మరాహిత్య కారణమగుచున్నది. అచట 'సమాధౌ మోక్ష మాప్నోతి' (యోగచూడామణి. 116) మోక్షము గలుగును అనియు నుపనిషత్తులు సహస్రముఖముల బలుకుచున్నవి.

ఇట్టి సమాధిలో నిత్యరతుడైయుండువాడు జీవన్ముక్తుడని చెప్పబడును. అట్టివానికి 'కర్మ జన్మాంతరీయం యత్ ప్రారబ్ధమితి కీర్తితం' (26) జన్మాంతరమైన కర్మ ప్రారబ్ధమగుటచే, భ్రాంతిజ్ఞాననాశమున 'రజ్జుఖండే పరిజ్ఞాతే సర్పరూపం న తిష్ఠతి' (27) రజ్జువు దెలియబడగ సర్పరూపము పోయినట్లు 'అధిష్ఠానే తథా జ్ఞాతే ప్రపంచే శూన్యతాం గతే। దేహస్యాపి ప్రపంచత్వాత్ ప్రారబ్ధావస్థితిః కుతః॥' (28) అధిష్ఠానము దెలియబడగా ప్రపంచము శూన్యమగును. దేహము గూడ ప్రపంచము గాన నిక నా ప్రారబ్ధ మెట్లుండును? అందుచే 'ఉత్పన్నే తత్త్వవిజ్ఞానే ప్రారబ్ధం నైవ ముంచతి। తత్త్వజ్ఞానోదయాదూర్ధ్వం ప్రారబ్ధం నైవ విద్యతే॥' (22) తత్త్వజ్ఞానము ఉదయింపగనే ప్రారబ్ధము విడివడును. తత్త్వజ్ఞానానంతరము ప్రారబ్ధ ముండనేరదు అని సవివరముగ నాదబిందు ఉపనిషత్తు బోధించి జీవన్ముక్తునికి ప్రారబ్ధలేశము గూడ నుండజాలదని వ్యక్తపరచినది. ఎందుచేతనన 'అహం బ్రహ్మేతి విజ్ఞానా త్కల్పకోటిశతార్జితం। సంచితం। విలయం యాతి ప్రబోధా త్స్వప్నకర్మవత్॥' (అధ్యాత్మ. 50) 'అహం బ్రహ్మాస్మి' అను జ్ఞానముచే శతకోటిజన్మల సంచితకర్మగూడ స్వప్నకర్మవలె నశించును. 'క్షీయంతే చాస్య కర్మాణి' (ముం. 2-2-8) అతని సర్వకర్మలు క్షీణించును అనియు నుపనిషద్బోధ.

అట్లు అతడు సర్వకర్మవివర్జితుడై 'బ్రహ్మణి స్థితః' (ధ్యానబిందు. 6) అయి యుండగ, 'అమృతేన తృప్తస్య

పయసా కిం ప్రయోజనం। ఏవం స్వాత్మానం జ్ఞాత్వా వేదైః ప్రయోజనం కిం భవతి।' (పైంగల. 4-9) అమృతముతో దృప్తుడైనవానికి క్షీరముతో బ్రయోజనమేమి? అట్లే ఆత్మను నెరింగినవానికి వేదముతో ప్రయోజన మేమి? అందుచే 'దేహజాత్యాది సంబంధాన్ వర్ణాశ్రమ సమన్వితాన్। వేద శాస్త్రాణి చాన్యాని పదపాంసు మివ త్యజేత్।' (బ్రహ్మవిద్య. 31) దేహజాతిసంబంధములను, వర్ణాశ్రమములను, వేదశాస్త్ర ములను మరియితరములను బాదధూళివలె త్యజింపుము అను రీతి నతడు త్యజించును. అటులే 'ఉల్కాహస్తో యథా కశ్చిత్ ద్రవ్యమాలోక్య తాం త్యజేత్।జ్ఞానేనజ్ఞేయ మాలోక్యపశ్చాత్ జ్ఞానం పరిత్యజేత్॥' (బ్రహ్మవిద్య. 36) కొరివిని గొనినవాడు వస్తువును గాంచిన పిమ్మట దాని త్యజించునట్లు, జ్ఞానముతో జ్ఞేయమును దర్శించి అంత నా జ్ఞానమును బరిత్యజించును. అతని కట 'న తస్య విద్యతే కార్యం న లింగం నా విపశ్చితః। నిర్మమో నిర్భయః శాంతో నిర్ద్వంద్వోఽవర్ణభోజనః॥' (నా. ప. 4-31) ఏకార్యమును లేదు. లింగముగూడ ఆపండితునకు లేదు. అతడు నిర్మముడు, నిరహంకారుడు, శాంతుడు, ద్వంద్వాతీతుడు, అవర్ణభోజనుడునై విరాజిల్లును. 'సందిగ్ధః సర్వభూతానాం వర్ణాశ్రమవివర్జితః। అంధవజ్జడవచ్చాపి మూక వచ్చ మహీం చరేత్॥' (నా. ప. 4-36) సర్వభూతములలో సందిగ్ధుడై వర్ణాశ్రమాచారరహితుడై, అంధునుగనో, జడుడు గనో, మూగిగనో, ప్రపంచమున జరించును. లేక 'బాలో

న్మత్తపిశాచవజ్జడవృత్త్యా లోక మాచరేత్' (మండల బ్రాహ్మణ. 5) బాలోన్మత్తపిశాచమువలె జడవృత్తితో లోకమున జరించును. అప్పుడతడు సర్వద్వంద్వాతీతుడు.

అట్టి అసమానస్థితిలో 'యత్పూర్ణానందైకబోధ స్తద్బ్రహ్మైవాహ మస్మీతి' (పరమహంస) ఏది పూర్ణానందైకబోధ స్వరూపముగలదో ఆబ్రహ్మమే నేను అని కృతకృత్యుడగును. 'వేదాహమేతం పురుషం మహాంతమాదిత్యవర్ణం తమసః పరస్తాత్। తమేవ విదిత్వాఽతి మృత్యుమేతి' (శ్వే.3-8) తమమున కావల, సూర్యప్రభాతేజుడగు మహాపురుషుని నే గాంచితిని. అతని నెరింగి మృత్యువు నతీతించును అని అజ్ఞమానవుల సంబోధించి ప్రకటించుచు, నద్వ్యానంద పారవశ్యమున, 'జాగ్రత్స్వప్నసుషుప్త్యాదిప్రపంచం యత్ప్రకాశతే। తద్బ్రహ్మాహం' (కైవల్యా. 17) అవస్థాత్రయమున దోచు నేజగత్తు గలదో అది బ్రహ్మమే అది నేనే, 'త్రిషు ధామసు యద్భోగ్యం భోక్తా భోగశ్చ యద్భవేత్। తేభ్యో విలక్షణ స్సాక్షీ చిన్మాత్రోఽహం సదాశివః॥' (కైవల్యా. 18) దేహత్రయమున భోగ్యభోక్తభోగరూపమున ఏది గలదో దానికి విలక్షణమైన చిన్మాత్రస్వరూపుడను నేను సదాశివుడను. 'న బద్ధోఽస్మి న ముక్తోఽస్మి బ్రహ్మైవాస్మినిరామయం ద్వైతభావవిముక్తోఽస్మిసచ్చిదానంద లక్షణః॥' (అన్నపూర్ణ. 5-68) 'నాహం దుఃఖీ న మే దేహో బంధః' (మహా. 4-126) 'బ్రహ్మైవ కేవలమహం పరిపూర్ణమస్మి' (వరాహ. 2-73) 'స ఏవ హి పరంబ్రహ్మ తద్బ్రహ్మాహం

న సంశయః। జీవ శ్శివ శ్శివో జీవ స్సజీవః కేవల శ్శివః॥'
(స్కాంద. 5) అదియే పరబ్రహ్మము. ఆబ్రహ్మమును నేను.
నిస్సందేహము. జీవుడు శివుడే. శివుడు జీవుడే. ఆజీవుడు కేవ
లముశివుడే అని అనంగతన్మయత్వమున నాజీవన్ముక్తుడు గానము
చేసినను జేయవచ్చును, చేయుచుండును.



# ఫ లి త అం శం

'మాండూక్యమేక మేవాలం ముముక్షూణాం విముక్తయే' యని కీర్తిగాంచి యున్న అతిప్రధాన మాండూక్య ఉపనిషన్మాధుర్యమును, దాని వివరణా రూపమును అష్టోత్తర శతోపనిషత్తుల దృష్టితో ఇసుమంత గాంచియున్నారము. అద్వైతామృతసింధువన దగు దాని గ్రహించి తరించుట యన దాని ద్వాదశ మంత్రతాత్పర్య సిద్ధిగాంచినగాని సాధ్యము గానేరదని సువిదితము. ప్రస్తుత మీ అనుభవభాష్యము సమగ్రముగాక అతిక్లుప్తమని స్పష్టము ఉపనిషన్మహోదధి నుండి అసంఖ్యాకవాక్య రత్నముల యుక్త్యనుభవములతో మేళవించి, వివరణముగావించుచో నది సాధక లోకమున కతిముఖ్య గ్రంథరాజముగ రూపొందును గాని యది బృహద్రూపము దాల్చును. అట్టి సర్వతోముఖ వచనమునకై గాలాంతరమున నిరీక్షించెదము గాక.

హరిః ఓం తత్ సత్



# శ్రీ అనుభవానంద గ్రంథమాల

## అభిప్రాయములు

## సాధనరహస్యము

1. సాధనచతుష్టయ రహస్యాలు యీ గ్రంథంలో సర్వులకు బోధపడేరీతిని సులభ వ్యావహారిక భాషలో వివరింపబడినవి. ఆధ్యాత్మిక జిజ్ఞాసపరులైన వారందరికి ఉపయోగకరంగా ఉందనడంలో సందేహం లేదు. శ్రీరామకృష్ణ పరమహంస శిష్యకోటి సాంప్రదాయానికి అనుగుణమైనది.

— ఆంధ్రప్రభ : మద్రాసు

2. వీరిలేఖల్లో వాడిన వ్యావహారికం అనర్గళప్రవాహంలాగా సాగిపోతూ పాఠకులలో బాగా అభిరుచిని కలిగిస్తున్నది.

సాధనరహస్యం సాధకుల కల్పతరువు. ఇది పదమూడేండ్ల బాలికకోసం వ్రాసిన గ్రంథమైనా, భోగులకూ, యోగులకూ, విరాగులకూకూడా, పఠనీయము అనడానికి యింకొకరు, 'సర్టిఫికెట్టు' యీయ నక్కరలేదు. ఈ గ్రంథంలోని ప్రత్యక్షరంలోనూ శ్రీ అనుభవానందులు అనుభవానందులుగా ప్రత్యక్షమవుతూ; ఉపనిషణ్ణులై పాఠకునకూ సాధనరహస్యాన్ని బోధిస్తున్నట్లు గుర్తించి అనుభవానందం పొందవచ్చు.

— ఆంధ్రపత్రిక : మద్రాసు

3. ఈ విషయాలను వీరు విప్పిచెప్పిన ధోరణిచూస్తే ముచ్చట వేస్తుంది. పెద్దల మాటకేమి, వారే కూడా పిన్నలైకూర్చుండి వినవచ్చు. ప్రతివారూ చదువుకోవలసిన గ్రంథం.

ఆధ్యాత్మిక సాధనరహస్యములను వీరిందులో వెన్నముద్దలూ గుజ్జెన గూళ్లు చేసి తినిపిస్తున్నారు.

— కృష్ణాపత్రిక : బందరు

4. సాధనమీదనే దృష్టినుంచి వ్రాయబడటంవలనను చాల సులభ శైలిలో వివరించబడటంవలనను యీ గ్రంథవిషయాలను యీ విషయాలలో ఏమాత్రం ప్రవేశంలేనివారుకూడ అర్థంచేసుకోగలరు.

— గోలకొండపత్రిక : హైదరాబాదు

5. సాధకుని కవసరమైన సర్వవిషయాలు పండొలిచి చేతిలో పెట్టినట్లు స్వాములవారు మన కిచ్చియున్నా రీగ్రంథములో.

— ఆరాధన : బందరు

6. సాధనరహస్యముకంటె ఆత్మసాక్షాత్కార మార్గమును విస్పష్టగా వివరముగా తెలుపు గ్రంథము దుర్లభము. ఈ గ్రంథము చాల గహనమైన విషయములనుగూడ సర్వ సుగ్రాహ్యముగాచేసి తెలుగువారిని ధన్యులను జేసినది.

— పండిత శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు : తిరుపతి

7. సాధనారహస్యము చదువ మొదలిడుటయే నావంతు. చివరంట తీసికొనిపోవుట దానివంతు. తాము భిక్షువులు. తమ సాధనారహస్యము చదివినవారు తమ విజ్ఞానమునకు అనుభవమునకును భిక్షువులు. జ్ఞానముచే శుష్కమైన మనస్సులందుగూడ నిది రస సంచారము చేయగలదు. భక్తిభరితమయిన తమ అనుభవములో నిది ఒక చిటికె. ఇట్టి చిటికెలెన్నియో తమనుండి లోకమపేక్షించును.

— శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు : చిరివాడ.

8. ఈ గ్రంథము 'వాఙ్మయగురువు' అనవచ్చును. అచ్చముగా సాధనకు సంబంధించిన విషయములు పుష్కలముగా యిందున్నందున అనేక ఉత్తమ గ్రంథాల ప్రయోజనము యీ ఒక్కదానిచే సిద్ధింపజేసుకొనవచ్చును.

— శ్రీ శుద్ధచైతన్యస్వాములవారు : బందరు

9. ముఖ్యముగా సాధనరహస్యము అమూల్యము. ఎన్నిమారులు చదివినను యింకను మరిమరి చదువవలయుననియే కోరిక ఉండును.

— డాక్టరు వి. యస్. శర్మగారు, Ph. D. : మద్రాసు

10. పై మహత్తరాంశముల నింత సులభముగ దెలుపు గ్రంథ మింత వరకు వెలువడలేదు.

— శ్రీ సత్యానందస్వాములవారు : ఇనమడుగు

11. శ్రీ పూజ్యపాదులు మీ 'సాధనరహస్యము' ను చూచిరి. అంతియగాక శాస్త్రజ్ఞానములేనివారు శాస్త్రముల గ్రహించి, తమ అధ్యాత్మ విద్యను అభివృద్ధిచేసికొన యీ గ్రంథము అత్యంత సహకారియనియు శ్రీవారి తాత్పర్యము.

—శ్రీ యస్. లక్ష్మీనారాయణశాస్త్రిగారు ; శృంగేరిపీఠము

# సర్వసిద్ధాంతసారభవము

## ప్రథమ భాగము

1. మూలగ్రంథాలను గురించి వీరు వ్రాసినదంతా సంస్కృత వ్యాఖ్యానాల వివరణశైలిలో ఉదాత్తంగాను నిర్దుష్టంగాను సాగిపోయింది. ప్రత్యేకంగాను తెలుగులో యీ దర్శనాలనుగురించి యింతవిపులంగా వ్రాసిన పుస్తకాలు చాలా అరుదుగా ఉన్నాయి.

— ఆంధ్రపత్రిక : మద్రాసు

2. శ్రీ స్వాములవారు అనుభవానందులే కాదు, సకల శాస్త్ర పారంగతులుకూడ. అన్ని శాస్త్రాలు వారికి కొట్టినపిండివలె అయిపోయిన వంటే అతిశయోక్తికాదు. వివిధ సిద్ధాంతములనుగూర్చి ప్రాచ్య ప్రాశ్చాత్య పండితాభిప్రాయాలన్నీ వారికి హృత్కవిలి. మంచినీళ్ళప్రాయంగా వాటిని ఉదహరించుకుంటూ పోగలరు. ఆ సమన్వయం చేయడానికి శ్రీ రామకృష్ణ పరమహంస సంప్రదాయానికి చెందిన స్వాములవారే ఉత్తమాధికారులు.

— కృష్ణాపత్రిక : బందరు

3. ఈ గ్రంథమున ప్రాచ్యపాశ్చాత్య విమర్శకాగ్రణుల యభిప్రాయములతోగూడ దర్శనకర్తలు, వ్యాఖ్యాతలు, వారి జీవితవిశేషములు, విషయప్రమాణములగు గ్రంథములు, ఆయా దర్శనసారము, తద్విమర్శనలు వేయేల సర్వవిషయము లిందు సంగ్రహింపబడియున్నవి. కాన నీ గ్రంథము ఆయా దర్శన విషయముల నెరుంగగోరువారికి రసగుళిక అని చెప్పవచ్చును.

— ఆరాధన : బందరు

4. సర్వ సిద్ధాంత సౌరభమును చిత్రించడములో తమరు అనుసరించిన మార్గం ఎంతో బాగా ఉన్నది. మనవారు యిట్టి ఉత్తమ గ్రంథాన్ని చదివినగాని సంస్కృతి చక్కగా గ్రహించడానికి వీలుండదు.

— డాక్టరు వి. యస్. శర్మగారు, Ph. D. : మద్రాసు

5. వారి హృదయసీమను ప్రాచ్యపాశ్చాత్య విజ్ఞానలక్ష్ములు గంగా యమునలవలె సరస సంగతినిబొంది లోకమును తరింపజేయ సమకట్టినవి. ఈ సౌరభమును నాఘ్రాణించిన నాస్తికత పటాపంచలగును. ఆస్తికత తిరిగి తేజరిల్లును.

శ్లో॥ జీయాదాచంద్ర తారార్కం సర్వసిద్ధాంతసౌరభం।
మూర్ఛితాధ్యాత్మచైతన్య సంజీవన మహౌషధిః॥

—కవిశిరోభూషణ శ్రీ వాసా సూర్యనారాయణశాస్త్రిగారు: నరసన్నపేట

## ప్రథమ, ద్వితీయ, తృతీయ భాగములు

6. మాధవాచార్యులవారు సంస్కృతమున 'సర్వ సిద్ధాంత లేశ సంగ్రహము' రచించి చేసినంతపనిని వీరు 'సర్వసిద్ధాంత సౌరభము' ద్వారా చేయుచున్నారు.

7. తన జాతి తరించాలనే పూనికతో యీ పనిని శ్రీ స్వామి నిర్వర్తించారు. గొప్పపని.

— ఆంధ్రపత్రిక : మద్రాసు

8. ఇది భాషాంతరములోనికి పరివర్తితమైన ఖండాంతరములయందు గూడ విశిష్ట సంచలనమును గలిగించును. భారత సనాతన విజ్ఞాన జ్యోతి కిరణములను దశదిశల వెదజల్లును.

శ్లో॥ ఆస్తికత్వం ప్రతిష్ఠాప్యయుక్తి ప్రామాణ్య పూర్వకం।
జీయాదాచంద్రతారార్కం సర్వసిద్ధాంత సౌరభం॥

— కవిశిరోభూషణ శ్రీ వాసా సూర్యనారాయణశాస్త్రిగారు

9. ఇతర పుస్తకాలలో లభించని అమూల్య విషయాలు ఎన్నో యీ గ్రంథాలలో ఉన్నాయి. వాటిని చదవటానికి అదృష్టం గలవారే ధన్యులు.

— డాక్టరు వి. యస్. శర్మగారు, Ph. D. : మద్రాసు

10. శ్రీ అనుభవానందులవారు యీ గ్రంథరచనలో సరికొత్త పద్ధతుల అనుసరించారు. ఈ మూడు భాగాలను పఠించినవారికి షడ్దర్శనాల ఆపాత పరిచయం కాక సమగ్రజ్ఞానమే కలగగలదనడం నిస్సందేహం. ఏమైనా దర్శన విషయక 'లఘు విజ్ఞాన సర్వస్వం' అనదగిన యీ 'సర్వ సిద్ధాంత సౌరభం' ఆంధ్రావని ఇంటింటా గుబాళించి, వారి ఐహికాముష్మిక జీవితాన్ని సురభిళం చేయగలదని ఆశిస్తున్నాను.

— ఆంధ్రప్రభ : మద్రాసు

11. 'సర్వ సిద్ధాంత సౌరభము' మహాప్రయత్నము ఫలించిన రచన. అనూహానమైన భిన్న దర్శనములను చారిత్రకముగా, పారిభాషికముగా వివరించుటకై తాము చేసిన వ్యాసంగము, సంగ్రహించిన విషయములు

అత్యద్భుతముగా యిందు గోచరించుచున్నవి. దర్శన విద్యార్థులకు దీని యుపయోగము అమూల్యము.

— పండిత శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు : తిరుపతి

12. మహాగ్రంథము రచించినారు. వీరి ఆంధ్రశైలి సరళము. భావ సుబోధకము. శాస్త్రములకును (Sciences) మన భారతీయ తత్త్వమునకును సమన్వయముచేసి, విద్వాంసులకుకూడ విశేష విషయములను వివరించి చూపినారు. ఆధునిక శాస్త్రములయొక్క ప్రమాణబుద్ధికల నవనాగరికులకు నైతము సంశయవిచ్ఛేదకమైన సమ్యగ్దర్శనమును ప్రదర్శించినారు. ఇట్లు వివిధ శ్రేణులకు చెందిన పాఠకలోకమునకు పరితుష్టినొసగు నీ విపుల గ్రంథము.

—మహోపాధ్యాయ శ్రీ శివశంకర స్వాములవారు: ఒంగోలు

13. సద్దర్శన ప్రామాణ్యమునకు మరియు మీ స్వానుభవాధారమగు గ్రంథమును మీరు రచించుట గమనించి శ్రీ వారమితానందము నొందిరి. శ్రేష్ఠమును సులభమునగు శైలిలో మన శాస్త్ర ప్రామాణ్యముతో, ఆధునిక యుగమున కనువగురీతి నీ గ్రంథము రచింపబడినట్లు గ్రహించి ఆనందించితి మని మీకు తెలియజేయ శ్రీ సద్గురు పూజ్యపాదులు నా కాదేశించిరి. శాస్త్రాభ్యాసమున ఆసక్తి లేనివారియందుగూడ యీ గ్రంథము తప్పక ఆసక్తిని కలిగించును.

— శ్రీ యస్. లక్ష్మీనారాయణశాస్త్రిగారు : శృంగేరిపీఠము

14. ఇంత కొలదిమేరలో యింత గొప్పవిషయము నిముడ్చుటయు, చెప్పవలసిన విషయమంతయు చెప్పివేయుటయు జూడ నక్కజము. గహనములగు విషయములను బాలురకును దెలియునంత తేలికగా చెప్పగలుగుట గొప్ప విశేషము. ఈ గ్రంథములో మీ కృషి సఫలమైనది. దానిని వినియోగించుకొనగల నేర్పు చదువరులది.

— శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు : చిరివాడ

## చతుర్థ భాగము

15. మీ శ్లాఘనీయమైన సర్వసిద్ధాంత సౌరభముయొక్క నాలుగవ భాగము శైలి మిగుల గంభీరముగను, మధురముగను గలదని మొత్తముగను చెప్పగలను.

**— పండిత శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు : తిరుపతి.**

16. నిగూఢమైన విషయమును వివరించుచున్నను, అది మిగుల మనోహరముగ నున్నటుల ఆ గ్రంథమును చూచుతోడనే నాకు తోచినది. ఆంధ్రప్రజానీకమునకు అది అందజేయబడినందులకు నే నెంతయో సంతసించుచున్నాను. ఆంధ్రులు తమకు తప్పక కృతజ్ఞులు.

**— కేంద్రఆర్థికమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు**

17. తమ గ్రంథమును అందుకొని సంతోషముగ చదివితిని.

**— ఉపరాష్ట్రపతి డాక్టరు శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు**

18. శ్రీవారి ప్రతిభ పరిశ్రమలు ఉదితోదితములై దేదీప్యమానములగుచున్నవి. పాశ్చాత్యు లంతరించినను వారి సిద్ధాంత వ్యామోహము లంతరించలేదు. తమ సౌరభమువంటి యుత్తమ గ్రంథరత్నములే వానిని తొలగింప సమర్థములు.

**—కవిశిరోభూషణ శ్రీ వాసా సూర్యనారాయణశాస్త్రిగారు**

19 మతము దాని ఆవశ్యకత అనే సమస్యపై కలుగు సందేహములను తీర్చగలది యీ గ్రంథము. ప్రాచ్యపాశ్చాత్య తత్త్వవేత్తలచే ప్రశంసించబడిన భారతీయ తత్త్వశాస్త్ర సారమును శ్రీ స్వాములవారు అక్షరాస్యుడైన ప్రతి ఆంధ్రునకు కరతలామలకంచేయ సంకల్పించి లోకానుగ్రహకాంక్షచే యీ దీక్ష పూనినారు అని అస్మదాదుల విజ్ఞప్తి.

**— గోలకొండ పత్రిక : హైదరాబాదు**

20. స్వాములవారు ఆధ్యాత్మిక భావాలు ప్రచారం కావడానికే యీ రచనలు సాగిస్తున్నట్లు స్థూలంగా చెప్పాలి. అందుకు ప్రోద్బలకంగా వివిధ వేదాంతపండితుల వ్రాతలను విస్తృతంగా ఉదహరించారు. అయితే తాము నిరూపించదలచిన సత్యాన్ని అధ్యాయాంతాలలో చక్కగా వివరించి చెప్పారు. వేదాంతం ఒక వృత్తిగా పెట్టుకున్న మేధావులకు, వేదాంతం

ఒక జీవన విధానంగా పెట్టుకున్న సత్పురుషులకు అదేకదా భేదం. ఇది నేటి విద్యార్థులకు పఠనీయగ్రంథ మవుతున్నది. అధ్యాత్మిక చింతనను ఆశ్రయించినవారికి అభిమాన గ్రంథ మవుతున్నది. చరిత్రను తెలుసుకోవాలనే ఆసక్తిగలవారికి ఉపకరించే గ్రంథం. పేరుకు తగినట్లు యిది నిజంగా సర్వ సిద్ధాంత సౌరభం. మక్కు—వేదాంత తిమిరాన్ని పటాపంచలు చేయగల రచన.

— ఆంధ్రపత్రిక : మద్రాసు

21. అది బృహత్తరమైన గ్రంథం. విశ్వకోశ మని చెప్పినా ఆమాటలో ఆశ్చర్యమేమీ ఉండదు.

— డాక్టరు వి. యస్. శర్మగారు Ph. D. : మద్రాసు

22. గ్రంథరచన శ్రీస్వాములవారి సహజధోరణిని ఆంగ్ల సంస్కృత గ్రంథాలనుండి యనేకప్రముఖవాక్యాల నుదహరిస్తూప్రవాహగతితో నడచినది.

— కృష్ణాపత్రిక : బందరు

23. శ్రీ అనుభవానందుల సర్వ సిద్ధాంత సౌరభము ఆంధ్రదేశము నలుమూలల నలము కొనినది. విశేషించి యీ నాలుగవ కుసుమ సౌరభము హృదయ తర్పకముగా నున్నది. ఇందలి విషయములన్నియు అనేక సంప్రదాయముల తరాజులలో తూపబడి విలువకట్టబడినవి. ఈ రీతిగా యీ గ్రంథము విద్యార్థులకు విద్వాంసులకును ఆనంద మొసగగలదని తలతును.

—శతావధాని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు : చిరివాడ.

24. ఈ కాలమునకు తగురీతి అందరికి చక్కగా మనస్సునకు పట్టునట్లు వైజ్ఞానికుల వాక్యములనుండియే విజ్ఞాన సిద్ధాంతముల అపూర్ణత్వమును చూపించియుండు నిది ఎటువంటి వారికకూడ భ్రాంతి నివారకమై, అధ్యాత్మ శాస్త్రములలో రుచి పుట్టించునదిగాయున్నది. బహుగ్రంథముల పరిశీలనాఫలమైన తమ యీ గ్రంథము తత్త్వవిమర్శకులకు బహు సాహాయ్యకముగా నున్నది.

— శ్రీ యస్. లక్ష్మీనారాయణశాస్త్రిగారు: శృంగేరిపీఠము

25. సర్వసిద్ధాంత సౌరభములో నాలుగవ సంపుటి మకుటాయమానమైనది. ఇందు అద్వైత చరిత్రమును, సిద్ధాంతములను శ్రీస్వాముల వారు గవేషణా పూర్వకముగా విస్పష్టము చేసియున్నారు.

—మహోపాధ్యాయ శ్రీ శివశంకరస్వాములవారు: ఒంగోలు.

7. సాధన సుధ :
సాధనలో గలుగు ఆటంకముల నివారింప అమూల్య
మగు సలహాల నొసంగు పద్యగ్రంథము. 1/8 క్రౌను.
62 పుటలు. 0—50

8. మన శారదామాయి : శ్రీమాతాజీ రచితము
జగన్మాత శ్రీ శారదామాయి జీవితోపదేశముల వివ
రించు ఉత్సాహపూరిత సులభగ్రంథము. 1/8 క్రౌను
64 పుటలు. 0—50

9. మన వివేకానందుడు : ,,
వేదాంతకేసరి శ్రీ వివేకానందుని జీవితాదర్శముల
ప్రబోధించు ఉత్కృష్ట గ్రంథము.1/8క్రౌను. 68 పుటలు. 0—50

10. మన రామకృష్ణుడు : ,,
జగద్గురు శ్రీరామకృష్ణుని అద్భుతాదర్శ సాధనవివర
ముల సుగమము గావించు గ్రంథము. 1/8 క్రౌను.
74 పుటలు. 0—50

11. సర్వ సిద్ధాంత సౌరభము : 1 వ భాగము.
దర్శన ఖండము – ప్రథమ భాగము – సాంఖ్యయోగ
ములు – శ్రీ కపిల పతంజలి మహర్షుల జీవిత కాల విశేష
ముల, సిద్ధాంతములు యిట చర్చితములు. 1/8క్రౌం.
350 పుటలు. 3—25

12. శాంతి సామ్రాజ్యము :
శాంతిని గోరు నేటి ప్రపంచమునకు శాంతిప్రబోధ
గావించు ఉత్తమ గ్రంథము. 1/8 క్రౌను. 40 పుటలు. 0—38

13. శ్రీరామకృష్ణాదర్శము :
శ్రీరామకృష్ణుని సాధన సిద్ధుల రహస్యమును వివరించు
ఉత్తేజకర విపుల గ్రంథము. 1/8 క్రౌను. 0—12

14. శ్రీరామకృష్ణపూజ :
శ్రీరామకృష్ణ పూజా విధానము సహస్ర అష్టోత్తర
నామములతో నేలరారు గ్రంథము. 1/16 డెమ్మీ
71 పుటలు. 0—50

15. సర్వ సిద్ధాంత సౌరభము : 2 వ భాగము.
దర్శన ఖండము - ద్వితీయ భాగము - వైశేషిక
న్యాయములు-శ్రీ కణాద గౌతమ మహర్షుల జీవిత కాల
సిద్ధాంతములు, పండితాభిప్రాయములతో రచితము.
1/8 క్రౌను. 300 పుటలు. 3-00

16. సర్వ సిద్ధాంత సౌరభము : 3 వ భాగము.
దర్శన ఖండము - తృతీయ భాగము - మీమాంసా
ద్వయము. శ్రీ జైమిని వ్యాసమహర్షుల జీవితకాల
సిద్ధాంతములు ఆధునిక పండితాభిప్రాయములతో
రచితము. 1/8 క్రౌను. 340 పుటలు. 3-00

17 సర్వ సిద్ధాంత సౌరభము : 4 వ భాగము.
అద్వైత ఖండము - ప్రథమ భాగము - శ్రీ శంకర
పూర్వాద్వైతము - వేదముల నుండి శ్రీ శంకరులవరకు
ప్రవహించు అద్వైతరసప్రవాహమును ముందుంచు
విపుల గ్రంథము. అద్వైత సిద్ధాంతమునకు, ఆధునిక
భౌతిక విజ్ఞానమునకు సమన్వయమును జూపును.
1/8 క్రౌను 440 పుటలు. 4-25

18. మాండూక్య రసాయనము :
శ్రీ అనుభవ భాష్యము. 108 ఉపనిషన్మంత్రము
లతో, గౌడపాదకారికలతో వ్యాఖ్యాతము.
1/8 క్రౌను. 160 పుటలు. 1-25

19. సర్వ సిద్ధాంత సౌరభము : 5 వ భాగము.
అద్వైత ఖండము - ద్వితీయ భాగము - శ్రీశంకరా
ద్వైతము - శ్రీ శంకర జీవిత కాల విశేషములు, అద్వైత
సిద్ధాంతము విస్తృతముగా వివరింపబడినవి. సన్న్యాస
ప్రాశస్త్య, అధికారవివరములు గలవు. 1/8 క్రౌను
480 పుటలు. 4-25